

కీర్తి శేషులయిన

శ్రీయుత కొమర్రాజు లక్ష్మణరావు గారు ఎం, ఏ.

జ్ఞాన చంద్రికాగ్రంథమాల 32

ఫ్రెంచి

# స్వాతంత్ర్యవిజయము

మొదటి సంపుటము



గ్రంథకర్త:

అయ్యదేవర కాళేశ్వరరావు



బెజవాడ:
ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు
క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడియె.

1923



చందాదారులకు
వెల రు 1-4-0
ఇతరులకు 1-8-0

పూతచరితులు, దేశాభిమానులు,

మాతృభాషా సేవకులు, నాయనుంగు మిత్రులు,

కీర్తిశేషులు నగు

శ్రీయుత

కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారికి

ఈ దేశచరిత్రమును అంకితమిచ్చుచున్నాను.

—గ్రంథకర్త.

# ఉపోద్ఘాతము

విజ్ఞానచంద్రికామండలి స్థాపించబడిన 1906 వ సంవత్సరమునుండియు నేదేని దేశచరిత్రమును తెనుగులో వ్రాసి ప్రకటించుచు మాతృభాషాసేవ చేయవలెనని నాకు కోరికయుండెను. కాని అట్టిభాగ్యమునాకిదివరకు లభించలేదు. ఇప్పుడు భగవదనుగ్రహమువలన నాకట్టి వీలు కలిగి ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయమను దేశచరిత్రను ఆంధ్రభాషామతల్లియొక్క యడుగుదమ్ముల కర్పించుకొనుచున్నాను. ఫ్రాన్సుదేశము యూరపుఖండమునకు హృదయమువంటిది. ఫ్రాన్సుదేశచరిత్ర తెలిసికొనుట వలన యూరపులో బయలుదేరిన మత సాంఘిక రాజకీయోద్యమముల తత్వము తెలియగలదు. గ్రంథవిస్తరభీతిచే నీచరిత్రను రెండు సంపుటములుగ విభజించి ప్రథమసంపుటములో చరిత్రప్రారంభమునుండియు ఫ్రెంచివిప్లవమువరకును వ్రాసితిని. ఫ్రెంచిచరిత్ర మీగ్రంథములో ప్రధానముగానున్నను యూరపుఖండస్థితికూడ సంగ్రహముగా చూపుచువచ్చితిని.

నేనాంధ్రమున విద్వాంసుడను కాను. గ్రంథము వ్రాయుట కిదే ప్రథమప్రయత్నము. ఈగ్రంథములో ననేక తప్పులున్నవి. సదయహృదయులై పండితులు నాతప్పులను క్షమింతురుగాక!

ఆంగ్లభాషలో వ్రాయబడిన డ్యూరీ రచియించిన ఫ్రాన్సుదేశచరిత్ర రెండుసంపుటములు, మీనేవ్రాసిన ఫ్రెంచివిప్లవము, గార్డినరుసతి వ్రాసిన ఫ్రెంచివిప్లవము, హెచ్. జి. వెల్సు రచియించిన ప్రపంచచరిత్రము, గ్రాంటు వ్రాసిన యూరపుచరిత్రము, గ్రీనువ్రాసిన ఆంగ్లేయచరిత్రము, విన్సెంటుస్మిత్తు వ్రాసిన ప్రాచీనహిందూదేశచరిత్రము వీని యాధారమున నీచరిత్రను వ్రాసితిని. వీనిలో గ్రాంటుగాక తక్కిన యన్నిటిని బ్రిటిషుప్రభుత్వమువారు నన్ను కడలూరు చెరసాలకు గొనిపోయి విశ్రాంతి నొసగినప్పుడు పఠించితిని. ఈగ్రంథకర్తలకు నేను కృతజ్ఞుడను.

నా కెట్టిశ్రమయు కలుగనీయక ప్రూఫులన్నియు తామే దిద్దించి త్వరితముగ నీ గ్రంథమును తయారుజేసిన ఆంధ్రగ్రంథాలయమువారికి నావందనములు.

—గ్రంథకర్త.

# విషయసూచిక


| అధ్యాయము | | పుట |
|---|---|---|
| ఒకటి | ఫ్రాన్సుదేశమనుపేరు (France) | 1 |
| రెండు | షార్లమేను చక్రవర్తి (Sharlamane) | 12 |
| మూడు | మొఘాసాప్రభుపరంపర (Feudal System) | 21 |
| నాలుగు | ముసల్మానులకును క్రైస్తవులకును యుద్ధములు (Crusades) | 33 |
| అయిదు | నూరుసంవత్సరముల యుద్ధము (Hundred Years War) | 45 |
| ఆరు | యూరపియనులు హిందూదేశమునకు వచ్చుట (European nations coming to India) | 60 |
| ఏడు | ప్రొటెస్టంటు మతస్థాపనము (Protestantism) | 71 |
| ఎనిమిది | రాజుల నిరంకుశత్వము (Absolute monarchs) | 97 |
| తొమ్మిది | ఫ్రాన్సు హైందవసామ్రాజ్యమును కోల్పోవుట (France losing Indian Empire) | 116 |

| అధ్యాయము. | | పే |
|---|---|---|
| పది | ఫ్రెంచి విప్లవకారణములు (Causes of French Revolution) | 1 |
| పదునొకండు | పదునారవ లూయిరాజు (Louis XVI) | 15 |
| పండ్రెండు | ఫ్రెంచివిప్లవము (French Revolution) | 16 |
| పదుమూడు | జాతీయసభ (National Assembly) | 18 |
| పదునాలుగు | సంపూర్ణప్రజాస్వామ్యము (French Republic) | 20 |
| పదునైదు | రాజునకు మరణదండనము విధించుట (Execution of the King) | 21 |
| పదునారు | అతివాదులు (French Extremists) | 237 |



# ఫ్రెంచి
# స్వాతంత్ర్యవిజయము

## మొదటిఅధ్యాయము

## ఫ్రాన్సుదేశ మనుపేరు

ఉపోద్ఘాతము.

ప్రస్తుతకాలమున మానవసంఘములను మహాకార్యములకు పురికొలుపుచున్న భావములలో ముఖ్యమగునవి మూడు. మొదటిదిజాతీయ భావము. ప్రతిదేశములోని ప్రజలందరును వారిలోవారి కెన్ని భేదములున్నను ఒకేజాతియనియు, ప్రతిజాతియుతన యదృష్టమును తన యభివృద్ధిని తన బాగోగులను తానే నిర్ణయించుకొనవలెననియు ననుభావము. ఇది మొదటిది. రెండవది ప్రజాపాలనము. ప్రతిదేశములోని ప్రజలును ఆదేశమును పరిపాలించుకొనుటకు హక్కుదారులనియు, ఆప్రజల యిష్టములేనిది వారిపై రాజ్యాధికారము చలాయించుట కెవరికిని హక్కులేదనియు రెండవ భావము. మూడవది మానవ సమానత్వము. మానవులందరును పుట్టుకవలన సమానులని

యు, రంగువలనగాని, కులమువలనగాని, ధనమువలనగాని, వృత్తివలనగాని, మతమువలనగాని ఎవరును తక్కినవారికన్న నధికులు కాజాలరనియు, సమర్థత, యోగ్యతలు మాత్రమే గౌరవార్హమయినవనియు ననుభవము మూడవది. నూట ఏబదియేండ్ల క్రిందట ప్రపంచము నిరంకుశత్వములోను స్వార్థపరత్వములోను, మతదురభిమానములోను మగ్నమై యుండినపుడు ఫ్రెన్సుదేశము పైయూహభావములను లోకమునకు ప్రసాదించి వాని స్థాపనకొరకై గొప్ప త్యాగములు చేసినది. ఫ్రెన్సుదేశమునుండియే యీభావములు ఇతరదేశములకు వ్యాపించి యిపుడు మానవకోటిని ఉద్రేకించుచున్న ప్రధానభావములుగ నిలచినవి. ప్రయత్నములు చేయుటలోను, కార్యాచరణలో బెట్టుటలోను ఫరాసుదేశీయు లనేక పొరబాటులు, తప్పులు చేసిరనుట నిర్వివాదాంశము. వానిని సవరించుకొనుటకుగూడ ప్రయత్నించిరి. తప్పులు చేసినపుడు నష్టములను, సవరించుకొనినపుడు అభివృద్ధిని, సౌఖ్యమును పొందిరి. ఉదారభావములచే ప్రేరేపింపబడి, కష్టపరంపరలను ధైర్యముతో నెదుర్కొని, మహాత్కార్యములను సాధించిన యొకజాతి యొక్క అనుభవము లిందు కొంతవరకు విశదపరచబడినవి.

గాలుదేశము.

ఫ్రాన్సుదేశమునకు పూర్వకాలమున 'గాలుదేశ' మని పేరుండెను. పశ్చిమమునను ఉత్తరమునను అట్లాంటికు మహాసముద్రము, దక్షిణమున మధ్యధరాసముద్రము, నైరుతిమూల పిరనీసు కొండలు, ఇవి ఫ్రాన్సుదేశమునకు నైసర్గికమగు ఎల్లలు. పూర్వ

## మొదటి అధ్యాయము

కాలమున 'గాలుదేశము' తూర్పుదిక్కున రైనునదివరకును అల్ప్సుపర్వతములవరకును వ్యాపించి ఇప్పటి ఫ్రాన్సుకన్న నయిదువవంతు పెద్దదిగ నుండెను. ఇటుతరువాత తూర్పున కొంత దేశమును ఫ్రాన్సు పోగొట్టుకొనినది. ఫ్రాన్సుదేశము తక్కిన యూరపుఖండములోని దేశములవలెనే నవీనముగ వృద్ధిజెందినది. కాని హిందూదేశము, ఈజిప్టు, చైనా, అరేబియా దేశములవలె ప్రాచీననాగరికతగలదికాదు. క్రీస్తుశక ప్రారంభమున హిందూదేశము ప్రపంచకములోకెల్ల మిగుల నుత్కృష్టమగు నాగరికతచే విరాజిల్లుచుండెను. ఆకాలమున "గాలుదేశము"న స్వల్పనాగరికతగల నాలుగువందల జాతులు నివసించి యొకరితోనొకరు కలహించుచుండిరి. వారి గురువులకు డ్రూయిడులని పేరు. వారు తమ దేవతలకు సాధారణముగ నరబలుల నిచ్చుచుండిరి. మతగురువుల సలహాతోడ రాజులు పాలించుచుండిరి. రాజులక్రింద ప్రభువు లను జాతియుండెను. దేశ మంతఃకలహాములకును రక్తపాతమునకు లోనైయుండెను. వ్యవసాయము కొంతవరకును, బట్టలు నేయుటయు, రంగులు వేయుటయు కొన్ని లోహములు వాడుటయు "గాలు" దేశీయులకు తెలియును. వ్రాతవ్రాయుట తెలియదు. శత్రువులతో పోరాడి వారినోడించి పట్టుకొనినపుడు వారి శిరములను ఖండించి యిండ్లకు తీసికొనిపోవుదురు. గొప్పవారైన శత్రువుయొక్క తల దొరికినచో దానిని నూనెలోవేసి దాచియుంచెదరు. "గాలు"లోని గొప్పవాడు మరణించినచో అతడు ప్రేమించిన జంతువులను నౌకరులను అతనితోగూడ పాతిపెట్టెదరు. ప్రతిపురుషు

నికిని తన భార్యను పిల్లలను చంపుటకుగూడ హక్కుగలదు. గాలు దేశీయులు మిగుల ధైర్యశాలురై గుఱ్ఱములమీద తండాలుగా వెళ్ళి ప్రక్కనున్న దేశములను దోచుకొని వచ్చుచుండెడివారు. ఒక్కొకపుడు వీరు నూతనప్రదేశముల నాక్రమించి యచట నివసించుచుండెడివారు. ఆకాలమున నింగ్లాండు దేశము గాలు దేశమునకన్నగూడ మిగుల మోటుస్థితియందును హీనస్థితి యందును నుండెను.

రోమనులు జయించుట.

ఇట్టిస్థితిలో గాలులున్నపుడు క్రీస్తుకుపూర్వము 125 సంవత్సరము మొదలు 50 సంవత్సరము వరకును గాలుపై రోమనులు దండెత్తిరి. రోమకసామ్రాజ్యమునకు "ఇటలీ" దేశములోని "రోము" ముఖ్యపట్టణము. అప్పుడు రోమకరాజ్యము యూరపు ఖండములో ప్రసిద్ధికెక్కియున్నది. రోమకరాజ్యముయొక్క సర్వసేనాధిపతియగు జూలియసుసీజరు గాలుదేశమును జయించుట కేడుసారులు దండయాత్రలు సలిపెను. రోమనులకును గాలులకును ఘోరయుద్ధములు జరిగెను. తుదకు గాలుదేశమంతయు రోమనులచే జయింపబడినది. గాలుదేశము రోమనుల పాలనము క్రింద క్రీస్తు తరువాత 395 సంవత్సరమువరకును నుండెను. ఆదేశమును రోమను ప్రభువులు పదునేడు రాష్ట్రములుగను నూటయిరువది పట్టణములుగను విభజించిరి. పట్టణములలో మ్యునిసిపాలిటీలను నెలకొలిపిరి. పాఠశాలలను స్థాపించి కళలను చేతిపనులను వాణిజ్యమును కొంతవరకు ప్రోత్సహించిరి. గొప్ప అందమైన కట్టడములను నిర్మించిరి. రోమనులు నాగరికు

లుగావున కొంతవరకు గాలు దేశములోని ప్రజలకును నాగరికతను నేర్పిరి. రోమనుల భాషయగు లాటినును పాఠశాలలలో నేర్పిరి. లాటిను భాషలో పండితులు కవులు చరిత్రకారులు వక్తలు గాలులనుండి బయలుదేరిరి. రోమనుల ఆచారవ్యవహారములను గాలులు నేర్చుకొనిరి.

మతము నణచుట.

కాని రోమనులు గాలుల మతము నణచివేసి తమ మతమును వ్యాపించుటకు యత్నించిరి. రోమక చక్రవర్తులు గాలుల మతగురువులగు డ్రూయిడులను మతబోధ చేయగూడదని శాసించిరి. డ్రూయిడులమతము నవలంబించువారికి మరణశిక్ష విధించెదమని కూడ శాసించిరి. డ్రూయిడు మతస్థులకు ఘోరశిక్షలు విధించి ఆమతమును రూపుమాపుటకు యత్నించిరి. ఇంతలో క్రైస్తవ మతబోధ గాలులో కూడ బయలుదేరెను. రోమక చక్రవర్తులప్పటికి క్రైస్తవులు గారు. క్రైస్తవమతమును స్వీకరించినవారికి ఘోరశిక్షలు విధించుచుండిరి. క్రీస్తుశకము 177 సంవత్సరమున లయన్సు పట్టణములోని నలుబదియెనిమిదిమంది క్రైస్తవులను సింహముల కాహారముగ నర్పించిరి. ఒక స్త్రీని శిశుపుత్రుతో కూడ నురిదీసిరి. ఇంతటితో క్రైస్తవమతబోధ ఆగెను. తిరిగి క్రీస్తుశకము 250 వ సంవత్సరమున నేడుగురు మతాచార్యులు గాలులో క్రైస్తవమతబోధను ప్రారంభించిరి. వీరినందరను రోమక ఉద్యోగస్థులు ఘోరహత్యలపాలు చేసిరి. ఒకరిని ఆంబోతుచేత చంపించిరి, కొందరిని బావులలో పడద్రోసిరి. మరియొకరిని ఎఱ్ఱగాకాలిన యినుపగోలుసులచే బంధించి,

తాత్కాలికముగా క్రైస్తవబోధ యణచివేయబడినది. కాని పవిత్రమయిన క్రైస్తవమతబోధ నిర్బంధములచే చిరకాల మణచివేయుట దుస్సాధ్యమయ్యెను.

మతసహనము లేకుండుట.

తొందకు క్రీస్తుశకము 330 వ సంవత్సరమున రోమక చక్రవర్తియగు కాన్స్టాంటైన్ క్రైస్తవమతమును స్వీకరించెను. దానితో క్రైస్తవమతమునకు గొప్ప రాజపోషణము కలిగెను. కాని క్రైస్తవమతమును స్వీకరింపక పూర్వము రోమకరాజు లేదుష్టశాసనములచే క్రైస్తవమతము నణచయత్నించిరో ఆదుష్టశాసనములవలననె క్రైస్తవమతమును స్వీకరించిన రోమకరాజులు క్రైస్తవమతము కానియితరమతములను నాశనము చేయయత్నించిరి. క్రీస్తుశకము 380వ సంవత్సరమున థియోడోసి యను చక్రవర్తి తనరాజ్యములో క్రైస్తవమతముతప్ప నేయితరమతము నవలంబించినను యజ్ఞములు చేసినను మరణశిక్ష విధించబడునని శాసించెను. రోములో చిరకాలమునుండి యారాధించబడుచున్న దేవతలయారాధనను బలవంతముగా నాపుచేయించెను. రోమకరాజ్యములోని క్రైస్తవులుకానివారి సుందరమగు దేవాలయములన్నియు పడగొట్టించి యాచలువరాళ్ళతో క్రైస్తవదేవాలయములను నిర్మించెను. కొన్ని దేవాలయములలోని విగ్రహములను పీకివైచి వానిలో క్రైస్తవారాధనను నెలకొల్పెను. ఇతరమతస్థులు వ్రాసిన కవిత్వము, చరిత్రలు, తత్త్వశాస్త్రము, మొదలగు గ్రంథములను క్రైస్తవచక్రవర్తి నాశనము చేయించెను.

రోమక సామ్రాజ్యముక్రిందనుండి గాలులు కొంత నాగరికతను నేర్చుకొనిరి. కాని తమస్వతంత్రశక్తిని ధైర్యసాహసములను గోల్పోయిరి.

ఫ్రాంక్కులు.

రోమక చక్రవర్తులు గాలులను తుపాకి, కత్తి మొదలగు నాయుధములను ధరించగూడదని ఆయుధచట్టము నొకదానిని చేసిరి. తమ మీాద తిరుగబడి గాలులు తిరిగి స్వాతంత్ర్యమును పొందకుండ నుండుటకై ఇట్టి శాసనము చేయబడెను. నాలుగవ శతాబ్దములో రోమనురాజ్యము మిగుల బలహీనమై అనాగరికులగు జర్మనుజాతులచే ముట్టడించబడి ఇటలీదేశమునే రక్షించుకొనలేని స్థితియందుండెను. గాలు మొదలగు రాష్ట్రములకు తగిన సంరక్షణ నీయలేకపోయెను. అప్పుడు గాలుమీాదికి జర్మనుజాతులగు ఫ్రాన్కులు దండెత్తుచు దోచుకొనుచుండిరి. ఇంతలో కాన్స్టాంటిన్ చక్రవర్తి ఫ్రాన్కుల నోడించి కొంతవరకు గాలులను సంరక్షించెను.

ఫ్రాన్కుల రాజ్యస్థాపన.

కాని కొలది వత్సరములలోపలనే రోమకరాజ్యము నలువైపులనుండియు ననాగరికులగుజాతులచే దండెత్తబడి విచ్ఛిన్నము చేయబడినది. గాలు మొదలగు రాష్ట్రములలోని సైన్యములను ఉద్యోగస్థులను రోముకు పిలిపించుకొనిరి. రోమక రాజ్యముచే చేయబడిన •ఆయుధచట్టమువలన నాలుగువందల సంవత్సరములు ఆయుధములు ధరించుటకు విలులేక, గాలులు స్వసంరక్షణ చేసికొనజాలని నిస్సహాయస్థితియందుండిరి. రోమనులు దేశమును వదలగనే గాలుదేశముపైకి ఫ్రాన్కులరాజగు

క్లోవిసు దండెత్తి దేశమునంతను నాక్రమించుకొనెను. ఈయన క్రైస్తవమతమును స్వీకరించెను. ఫ్రాన్కులు గాలును జయించి ఆక్రమించుకొనుటవలన గాలునకు ఇంతటినుండియు ఫ్రాన్సు దేశమని పేరు వచ్చెను.

మేయర్సు.

క్లోవిసు మరణించిన తరువాత ఫ్రాన్కులరాజ్యవైభవము క్షీణించెను. నూరు సంవత్సరముల వరకును రాజకుటుంబము అంతఃకలహములతోను చెప్పనలవిగాని కల్లోలములతోను నిండియుండెను. క్లోవిసుయొక్క వంశమువారు ఆయన సామర్థ్యమును కలిగియుండనందున కొలదికాలములోనే పలుకుబడిని పోగొట్టుకొనిరి. వీరితాబేదార్లగు (మేయర్సు ఆఫ్ ది పాలస్) రాజనగర పాలకులను ఉద్యోగస్థులు క్రమముగా రాజ్యాధికారమును చెలాయించసాగిరి. వీరు ప్రథమమున రాజనగరుకు సంబంధించిన ఉద్యోగస్థులు. రాజులు బలహీనులైన కొలదియు వీరు బలవంతులై రాజులపేర యావత్తు అధికారమును చెలాయించుచువచ్చిరి. శివాజీఛత్రపతియొక్క వంశీకులపేర పేష్వాలు మహారాష్ట్రసామ్రాజ్యము నేలినటుల ఫ్రాన్సుదేశమును రాజులపేర మేయర్లు పరిపాలించిరి. రాజుల హక్కులు వంశపారంపర్యముగ నున్నటులే ఈమేయర్ల హక్కులుకూడ వంశపారంపర్యముగ స్థిరపడినవి. ఈయుద్యోగమునకు 687 వ సంవత్సరమున పిప్పిన్ అనునాయనవచ్చెను. ఈయన బహు సమర్థుడు. ఈయన రైనునదీప్రాంతముననున్న ఫ్రాన్కులను జయించి రాజ్యమును విస్తరింపజేసెను. పిప్పిన్ చనిపోయినతరు

వాత ఆయన అధికారము కుమారుడగు ఛార్లెసు మార్టిలుకు సంక్రమించెను. నామమాత్రావశిష్టుడగు రాజుపేర ఛార్లెసు మార్టిలు యావత్తు రాజ్యాధికారమును వహించి మిగుల సుప్రసిద్ధుడై ఫ్రాన్సుదేశపు సరిహద్దులను రైనునదికి తూర్పున కొంతదూరమువరకు విస్తరింపజేయుటయే గాక తనరాజ్యము లోని ప్రభువులను సామంతరాజులను అణచి రాజుయొక్క అధికారమును బలపరచెను. క్రైస్తవమతమునకును రోము లోని క్రైస్తవ ప్రధానమతాచార్యునికిని (పోపుకును) చేయూత నొసగెను.

732 వ సంవత్సరమున ఛార్లెసు మార్టిలు మహ
మహమ్మదీయ మ్మదీయులను టూర్సుయుద్ధములో నోడిం
ఒత్తోయుద్ధము. చెను. మహమ్మదీయులు 640 వ సంవత్సరమున ఈజిప్టును జయించిరి. 695 సంవత్సరమున కార్తేజిని స్వాధీనమును పొంది ఉత్తర ఆఫ్రికానంతను ఆక్రమించుకొనిరి. 711 వ సంవత్సరమున స్పెయిను దేశమును జయించి రాజ్యమును స్థాపించియుండిరి. కొలదికాలములో పెరినీసు పర్వతములను దాటి ఫ్రాన్సులో ప్రవేశించి కొన్నిపట్టణముల స్వాధీనమును పొందిరి. ఇందుమీద క్రైస్తవ ప్రపంచములో సంక్షోభము జనించెను. మహమ్మదీయులు ఫ్రాన్సును జయించి క్రైస్తవనాగరికతను నాశనముచేయుదు రనుభయముపుట్టెను. ఫ్రాన్సులోని అక్విటైను మండలములో మహమ్మదీయులు ప్రవేశించగ ఆమండలప్రభువు పారిపోయెను. అంత ముసల్మానులు లాయిరునదీ ప్రాంతము నాక్రమించిరి. ఆమండలప్రభువు ఛార్లెసుమార్టిలు

యొక్క సహాయము కోరగ నాయన ఫ్రాన్కుల సైన్యము లను 732 వ సంవత్సరమున ముసల్మానులపైకి నడపెను. టూర్సువద్ద క్రైస్తవసేనలును ముసల్మానుసేనలును తారసిల్లెను. దినమంతయు యుద్ధము బహు తీవ్రముగా జరిగెను. ఉభయ పక్షములవారును మతావేశముతో పోరాడిరి. కాని ముసల్మానుల కెక్కువనష్టము కలిగినందున రాత్రి ముసల్మానులు యుద్ధభూమినివిడిచి వెనుకకు మరలిపోయిరి. ఛార్లెసు మార్టెలు వారిని వెంబడించి వారు స్వాధీనము నొందిన ప్రతిపట్టణమును తిరిగి స్వాధీనముపొంది ఫ్రాన్సుయొక్క నైరుతి సరిహద్దగు పెరిన్నీసుపర్వతములవరకును దేశమంతను తిరిగి జయించెను. మహమ్మదీయులు పెరిన్నీసుకొండలుదాటి తిరిగి స్పెయినులో ప్రవేశించిరి. ఈవిధముగా ఛార్లెసుమార్టెలు ఫ్రాన్సుదేశము ను కాపాడెను. 741 వ సంవత్సరమున ఆయన చనిపోయెను. ఆయన కుమారులగు కార్లమాన్, పిప్పిన్లు ఫ్రాన్సును పంచుకొనిరి. ఫ్రాన్సుయొక్క ఐక్యత చెడునట్లు కనబడెను. కొలదికాలములో కార్లమాను తన భాగమును త్యజించి తన ఆత్మాభివృద్ధికొరకై క్రైస్తవమఠప్రవేశము చేసెను. 747 వ సంవత్సరమునుండియు పిప్పిన్ ఒకడే యావత్తు దేశముయొక్క రాజ్యాధికారమును చలాయించెను.

మేయర్లు రాజులగుట.

రోములోనున్న క్రైస్తవప్రధానమతాచార్యులగు పోపుకు పిప్పిన్ చాలసహాయము చేయుచుండెను. పిప్పిన్ పదిసంవత్సరముల కాలము మేయరుగ దేశమును పాలించెను. ఇంతలో నతనికి తానేలరాజు

కాకూడదను ఆశపుట్టెను. తాను రాజు కాగలడు. అడ్డము వచ్చువారులేరు. కాని రాజుయొక్క బిరుదము ఒకవిధమగు ప్రత్యేకగౌరవముగ చూడబడుచు వచ్చినది. అందువలన క్రైస్తవ ప్రధానమతాచార్యుని అనుజ్ఞను పొందనెంచెను. తాను రాజబిరుదమును ధరింతునాయని సలహా నడిగెను. ప్రధానమతాచార్యుడు నిజమైన అధికారము చలాయించువాడే రాజుగాన పిప్పిన్ రాజబిరుదము ధరించుట న్యాయమేసని చెప్పెను. వెంటనే రాజగు మూడవ చిల్డరిక్కును తీసివేసి క్రైస్తవ మఠములో ప్రవేశపెట్టి పిప్పిన్ రాజుగా పట్టాభిషిక్తుడయ్యెను. రెండుసంవత్సరముల తరువాత పోపు స్వయముగా పారిసునకు వచ్చి పిప్పిన్‌కు తనహస్తములతో కిరీటధారణగావించెను. పిప్పిన్ వంశమువారు అడ్డులేకుండ ఫ్రాన్సునకు రాజులుగ పాలించిరి. 768 సంవత్సరమున పిప్పిన్ చనిపోయెను.



ఫ్రెంచి

# స్వాతంత్ర్య విజయము

రెండవ అధ్యాయము.

## షార్లమేను చక్రవర్తి

షార్లమేను.

ఫ్రాన్సు దేశముయొక్క పూర్వరాజులలో షార్లమేను చక్రవర్తికన్న సుప్రసిద్ధులు లేరు. షార్లమేను ఫ్రెంచివారికెంత ముఖ్యుడో జర్మనులకుకూడ నంతే ముఖ్యుడు. ఈయన పిప్పిన్ రాజుయొక్క కుమారుడు. పిప్పిన్ చనిపోయిన తరువాత రాజ్యభారమును వహించెను. షార్లమేనుకూడ తక్కిన ఫ్రాన్కులవలెనే జర్మనుభాష మాటలాడువాడు. మధ్యమ యుగములో యూరపుచరిత్రలో నీయన పాలనము మిగుల ప్రాముఖ్యతను వహించినది. తన రాజ్యములో జర్మనీని చేర్చుకొని జర్మనీ కైక్యతను కలుగ చేసెను. ఇటలీని జయించి స్పెయినులో కొంతభాగ మాక్ర

మించెను. ఈ అన్ని దేశములలోను ఆయనచేసిన పనులు, ఏర్పరచినవిధానములు కొన్నితరములవరకును నిలిచినవి. ఆయన పండితపోషకుడు. క్రైస్తవమతమునకు పట్టుకొమ్మ. ఆయన యొక్క గొప్పతనమునకుగాను పోపు ఆయనకు చక్రవర్తియను బిరుదము నొసంగెను. ఈయన పాలనముతో యూరపు ఖండమున ప్రాచీనయుగమంతమై రోమకరాజ్యము పడిపోయిన తరువాత నేర్పడిన అరాజకమంతరించి నూతనశకము ప్రారంభమయినది.

శాంతిస్థాపన.

ప్రతి గొప్పరాజ్యమును బలవంతమయినపై తనయేలుబడిలోని ప్రజలలో కట్టుదిట్టముల నేర్పరచి శాంతిని స్థాపించును. శాంతిస్థాపన రాజ్యము సాగుటకు మిక్కిలి ఆవశ్యకము. అరాజకములో ఏరాజుయొక్క పాలనమును సాగదు. పన్నులు వసూలగుటకును రాజ్యలాభములను పొందుటకును వీలుండదు. ఎల్లప్పుడును అరాజకులవలనను బందిపోటు దొంగలవలనను ప్రభుత్వపు బొక్కసములకును ప్రభుత్వోద్యోగులకును భయముండును. కావున శాంతిస్థాపనము ప్రజలకన్న నెక్కుడుగ ప్రభుత్వముల కావశ్యకము. ప్రతి గొప్పరాజ్యమును తాను స్థిరముగ నిలుచుటకై ముందుగ శాంతిస్థాపనను చేయును. కాని ఆరాజ్యము పడిపోగనే కొంతకాలము కట్టుదిట్టములన్నియుపోయి దేశమున నరాజకము ప్రబలును. హిందూదేశమును 1526 మొదలు 1707 వరకును మొగలాయి చక్రవర్తులు రాజ్యముచేసి మిగుల నాగరికమైన కట్టుదిట్టములనుచేసి శాంతిని స్థాపించిరి. ఒంట

రిగా ఎంత సొమ్ముతో ప్రయాణము చేసినను అపాయము లేనంత నిర్భయముగ నుండెను. విదేశీయులు హిందూదేశముపై దండెత్తుటకు వెఱచిరి. ఆకాలమున హిందూదేశము లోకములోకెల్ల నగ్రస్థానము వహించినది. యూరపు ఖండవాసుల నిచటి కాకర్షించినది. 1707 సంవత్సరమున మొగలాయి రాజ్య మస్తమించెను. వెంటనే హిందూదేశములో కొంత కాల మరాజకము ప్రబలెను. ఈ అరాజకకాలములో ఫ్రెంచివారును ఇంగ్లీషువారును స్వదేశరాజుల అంతఃకలహములలో ప్రవేశించి తమరాజ్యమును స్థాపించుటకు పోటీగ కృషిసలిపిరి. కాని ఫ్రెంచివారి సంకల్పము విఫలమై ఆంగ్లేయులు సామ్రాజ్యమును స్థాపించిరి. తమరాజ్యస్థిరతకొరకు కొన్ని కట్టుదిట్టములనుచేసి అరాజకమును పోగొట్టి శాంతిస్థాపనను చేసిరి. అటులనే రోమకరాజ్యము కొన్ని శతాబ్దములు యూరపులో నాగరికతకు శాంతికి కట్టుదిట్టములకు తోడ్పడినది. అది అయిదవశతాబ్దములో కూలిపోయినది. మూడువందల సంవత్సరములకాలము యూరపుఖండమంతయు అరాజకముగను అశాంతిగను ధర్మము, న్యాయము లేక బలవంతులదే హక్కుగను ఉండి వివిధజాతుల పోరాటములలో మునిగియుండెను. తుదకు 770 వ సంవత్సమున బలవంతుడగు షార్లమేనురాజు బయలుదేరి ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, స్పెయిను దేశములను లోబరచుకొని శాంతిస్థాపనచేసెను. ఈయన ఏర్పరచిన పద్ధతులు కొంతకాలము బాగుగాసాగి ఈయన మరణించగనే తిరిగి అరాజకమేర్పడెను.

అరాజకమునకు సిద్ధౌషధము.

నిరంకుశ రాజ్యముల రహస్యమేమనగా పాలకులు బలవంతులుగ నున్నంతకాలము మాత్రమే సాగును. వారిబలము క్షీణించగనే రాజ్యము కూలిపోయి అరాజక మేర్పడును. కాని దేశములోని ప్రజలలో జాతీయభావ మేర్పడి ప్రజాపాలన ముండినచో దేశములోని నిరంకుశ రాజ్యములు పుట్టుటయు, కూలిపోవుటయు, తిరిగి అరాజకము ప్రబలుటయు తటస్థించనేరదు. ప్రజాపాలనమే అరాజకము రాకుండుటకు సిద్ధౌషధము. శాశ్వతశాంతికి పునాదియగు ప్రజాపాలనముకొరకే ప్రస్తుతప్రపంచము పరితపించుచున్నది.

షార్లమేను జయములు.

షార్లమేను ఆజానుబాహువు, కడు ధైర్యశాలి. ఈదుటలోను, గుఱ్ఱపుసవారి చేయుటలోను, వేటాడుటలోను మిగుల నేర్పరి. తినుటలోను, త్రాగుటలోను మితమైన అలవాటులు గలవాడు. అనేక భాషలు నేర్చినవాడు. పండితపోషకుడు. ఉదారస్వభావుడు. రాజ్యమును బాగుచేయుటకు దీక్షవహించినవాడు. ఆయన అనేక ప్రదేశములను జయించి కీర్తివడసెను. ఫ్రాన్సు దేశములో స్వతంత్రముగ నుండిన అక్విటైనును తన రాజ్యములో కలుపుకొనెను. పిదప స్పెయిన్ దేశములోని మహమ్మదీయులపై దండెత్తి కొన్ని జయములను బడసెను. స్పెయిన్‌లోని మహమ్మదీయులలో కలిగిన అంతఃకలహముల యవకాశమును తీసికొని షార్లమేనురాజు పెరెన్నీసు పర్వతములను దాటి స్పెయిన్‌లో ప్రవేశించి 797 వ సంవత్సరమున బార్సిలోనా పట్టణమును

ఆచుట్టు ప్రాంతమును జయించి యచట క్రైస్తవరాజ్యమును స్థిరముగ స్థాపించెను. ఈప్రాంతమునుండి క్రైస్తవులు మహమ్మదీయులను ముట్టడించుచు తుదకు చాలకాలమయిన తరువాత స్పెయిన్‌నుండి మహమ్మదీయులను వెడలగొట్ట గలిగిరి. తరువాత షార్లమేనురాజు శాక్సనీపై దాడి వెడలెను. శాక్సనీప్రజలు క్రైస్తవమతమును స్వీకరించలేదు. క్రైస్తవ మతబోధకులను వారిసహాయముగ వెళ్ళిన క్రైస్తవసేనలను వెడలగొట్టిరి. తమ స్వమతమును దీక్షగా నవలంబించియుండిరి. అట్టి శాక్సను ప్రజలపై షార్లమేను దండెత్తి ప్రథమమున వారిచే నోడింపబడెను. ఉభయుల మధ్యను తీవ్రమగు పోరుజరిగెను. తుదకు షార్లమేను జయమొందెను. వారినాయకుడగు విడుకిండుచే బలవంతముగ క్రైస్తవమత స్వీకారమును చేయించెను. కొలదికాలములో శాక్సనులు మరల తిరుగబాటు చేసిరి. షార్లమేను తిరుగబాటును మిగుల క్రూరముగ నణచి నాలుగువేలమంది తిరుగబాటుదార్లను శిరచ్ఛేదము గావించెను. శాక్సనీలో కత్తిబట్టి బలవంతముగ ప్రజలను క్రైస్తవులుగ గావించెను. ఆరాష్ట్రమునందంతట క్రైస్తవ మందిరములను నిర్మించెను. ఈవిధముగా కఠినమగు పద్ధతులతో ఫ్రాన్కులరాజ్యమును క్రైస్తవమతమును శాశ్వతముగ శాక్సనీలో స్థాపించెను. అటుతరువాత షార్లమేనురాజు బవేరియారాష్ట్రమును, యావత్తు జర్మనుదేశమును, అటుపైన బొహిమియా దేశమును జయించెను. అక్కడనుండి ఇపుడు ఆస్ట్రియాహంగెరీయని పిలువబడు దేశమునంతను అపుడచట నివసించియున్న అవారులను

జాతులనుండి జయించి, అవారుల ముఖ్యనాయకులను క్రైస్తవ మతమును స్వీకరించునటుల చేసెను.

పోపు (రోములోని క్రైస్తవ ప్రధానమతాచార్యు) నకును ఇటలీలోని లంబార్డిరాజునకును విరోధము ప్రబలియుండెను. పోపు షార్లమేను యొక్క సహాయ మపేక్షింపగ 773 వ సంవత్సరమున షార్లమేను ఇటలీపై దండెత్తి లంబార్డినంతయు జయించి, తన రాజ్యములో కలుపుకొనెను. 797 వ సంవత్సరమున చనిపోయిన పోపుయొక్క బంధువులకును క్రొత్తగావచ్చిన పోపు మూడవలియోకును కలహములు కలిగి వారు పోపు లియోను ముట్టడించి పోపుయొక్క ఒకకన్ను పొడిచివైచి ఆయనను ఖయిదు చేసిరి. కాని పోపులియో తప్పించుకొని పారిపోయి షార్లమేను రాజువద్దచేరెను. 800 వ సంవత్సరమున షార్లమేనురాజు రోముపై దండెత్తి పోపుయొక్క శత్రువులను వెడలగొట్టి పోపులియోను ప్రధానక్రైస్తవపీఠ మలంకరింప జేసెను. పోపు షార్లమేనుకు మిగుల కృతజ్ఞుడై యుండెను.

పోపునకు సహాయము.

800 వ సంవత్సరము క్రిస్టమసు పండుగనాడు రోములోని సెంటుపీటర్సు దేవాలయమునకు షార్లమేను రాజువెళ్ళెను. క్రైస్తవప్రార్థన లయిన తరువాత పోపు మూడవలియో లేచివెళ్లి షార్లమేను తలపైన కిరీటమునుంచి యాశీర్వదించి చక్రవర్తియను బిరుదము నిచ్చెను. రోమకసామ్రాజ్యము పడిపోయిన తరువాత యూరపుఖండమున చక్రవర్తి బిరుదాంకితులు లేరు. ఇపుడు

షార్లమేను చక్రవర్తియగుట.

షార్లమేను రోమునగరముననే చక్రవర్తియయ్యెను. దీనివలన షార్లమేనుయొక్క రాజ్యమునకుగాని అధికారమునకుగాని గలిగిన యాధిక్యతలేదు. కాని షార్లమేను సంతతివారు ఈ చక్రవర్తి బిరుదము మిగుల గొప్పదని భావించి, ఇందువలన తాము యూరపు ఖండములోనెల్ల అధికులమని తలంచుచుండిరి. ఈ బిరుదము కలిగియుండుటవలన తాము షార్లమేను చక్రవర్తియొక్క వారసులేగాక, రోమకసామ్రాజ్య చక్రవర్తులగు జూలియసు సీజరు, అగస్టసు, కాన్‌స్టాంటైన్, మొదలగు సుప్రసిద్ధ చక్రవర్తులకును వారసులమని గర్వపడుచుండిరి. మధ్యమయుగచరిత్రలో నీచక్రవర్తిత్వము చాల ప్రముఖ్యతను వహించెను.

రాజ్యపాలనము. షార్లమేను చక్రవర్తి రాజ్యపాలనమునందు సమర్థుడని ప్రసిద్ధిని బడసెను. తన రాజ్యము విశాలమయినది. ఆయా ప్రాంతములలోని ప్రభువులును ప్రజలును ఎప్పుడైనను తిరుగబాటు చేయవచ్చును. అట్టివి జరుగకుండ చేయుటకై తాను తఱచుగా సంచారము చేయుచుండెను. తన యుత్తరువులను అమలు జరుపుటకు రాజప్రతినిధుల నేర్పఱచెను. సంవత్సరమునకు రెండుసారులు—వేసవికాలమున నొకసారియు, ఆకురాలు కాలమున నొకసారియు—తన రాజ్యపాలనమునుగూర్చి ముఖ్యవిషయములలో ప్రజాభిప్రాయము కనుగొనుటకు గొప్ప సభలను సమావేశము చేయుచుండెను. ఆసభలలో మతగురువులు వేరుగను, ప్రభువులు వేరుగను, సామాన్యప్రజలలోని ముఖ్యులు వేరుగను, సమా

వేశమగుచు తమతమ యభిప్రాయములను వెలిబుచ్చుచుండిరి. ఈసమావేశములతో బాటు తన సేనలన్నిటిని సమావేశపఱచి తన బలమునుకూడ ప్రదర్శించుచుండెను. తరువాత ఫ్రాన్సు దేశపురాజులు సమావేశపఱచిన స్టేట్సుజనరలు కిది పునాది. రాజ్యమునంతను జిల్లాలుగా విభజించి జిల్లాపైన సివిలు, క్రిమినలు, సైనిక అధికారములను చలాయించు కౌంటు (ప్రభువు)లను నియమించెను పాఠశాలలను స్థాపించి విద్యావ్యాపకము చేసెను. గ్రంథకర్తలకు ప్రోత్సాహము కలుగజేసెను. మంచి కట్టడములను కట్టించెను. రైను, డాన్యూబునదులను కలుపుటకై గొప్ప కాలువను త్రవ్వించెను. ఈగొప్ప చక్రవర్తి 814 సంవత్సరము జనవరినెల 28వ తేదీని చనిపోయెను.

నార్మనులు.

షార్లమేను చనిపోయినతరువాత ఆయనమనుములు రాజ్యముయొక్క పంపిణీకొరకై తమలో తాము యుద్ధములు గావించికొనిరి. తుదకు 843 వ స॥ మున వెర్డన్ వద్ద జరిగిన సంధివలన జర్మనీ యొకమనుమనికిని, ఫ్రాన్సు మరియొకరికిని, ఇటలీస్విట్జర్లాండులు మూడవవానికిని పంపకములో వచ్చెను. ఇటలీదేశమును పాలించువారికి చక్రవర్తిబిరుదము చెందెను. చార్లెసు ది బాల్డు ఫ్రాన్సుదేశమునకు రాజయ్యెను. ఫ్రాన్సుదేశము చాలకాలము వఱకును మిగుల బలహీనులగు రాజులచే పాలించబడెను. నార్వే మొదలగు నుత్తరదేశములనుండి మిగుల క్రూరులగు ఓడదొంగలు పరాసు రేవులకువచ్చి దోచుకొనుచుండిరి. రాజులేమియు చేయజాలకుండిరి. ప్రజలు నిస్సహాయులుగ నుండిరి. ఈవోడదొంగల

బాధ క్రమముగా ఎక్కువయినది. వీరు తండోపతండములుగ ఫ్రాన్సుదేశములో ప్రవేశించి ప్రజలను హింసించియు దోచుకొనియు పైరుపంటలను నాశనము చేసియు పోవుచుండిరి. వారినెదిరించిన వారిని క్రూరముగ వధించుచుండిరి. ఈ యోడదొంగలకు నార్మనులనిపేరు. వీరికి కొంతకాలము ఫ్రెంచిరాజలు విశేషధనమిచ్చి పంపివేయుచుండిరి. లంచమిచ్చినకొలదియు మరలవచ్చి బాధించుచుండిరి. ౮౮౫ వ సంవత్సరమున వీరు ఫ్రెంచిరాజధాని యగు పారిసు పట్టణమును ముట్టడించిరి.

పారిసుప్రజలును,ప్రభువులును మిగుల ధైర్యముతో పోరాడి నార్మనుల నోడించి తరిమివేసిరి. కాని ఇంతటితో నార్మనుల దండయాత్రలాగలేదు. ఫ్రెంచి దేశములోని ప్రభువులందరును తమతమ కోటలను బాగుచేసికొని క్రొత్తకోటలనుగూడ నిర్మించవలసినదని పరాసురాజు ఉత్తరువుచేసెను. నార్మనులనుండి దేశసంరక్షణము గావించుకొనుటకు ప్రభువులు ప్రతిచోటను కోటలను గట్టిరి. తాత్కాలికముగా పరాసు ప్రభువులు నార్మనుల నోడించుచు వచ్చిరి. 912 వ సంవత్సరమున పరాసురాజు నార్మనులతో సంధిచేసికొని ఫ్రాన్సుదేశములోని నార్మండీరాష్ట్రమును వారికిచ్చెను. నార్మనుల దోపిడులు ఆగిపోయెను. నార్మను ప్రభువులును నార్మను ప్రజలును ఫ్రాన్సులో కాపురమేర్పరచుకొని ఫ్రెంచిభాషను నేర్చికొని తక్కిన ఫ్రెంచి ప్రభువులతోను ప్రజలతోను కలసిపోయిరి. నార్మండీరాష్ట్రము కొలదికాలములో మిగుల శాంతియుతమైనట్టియు భాగ్యవంతమయినట్టియు రాష్ట్రమయ్యెను.



## ఫ్రెంచి

# స్వాతంత్ర్య విజయము

### మూడవ అధ్యాయము

## మొఖాసా ప్రభుపరంపర

మొఖాసా ప్రభుపరంపర. క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దమునుండియు యూరపులోని తక్కిన దేశములలో వలెనే ఫ్రాన్సు దేశమునందు గూడ మొఖాసాప్రభుపరంపరాపద్ధతి స్థాపించబడెను. రాజులు బలహీనులగుటచేత నీపద్ధతి త్వరితముగ వ్యాపించెను. పదవ శతాబ్దమున నీపద్ధతి పరాసు జర్మనీ దేశములలో పూర్తిగ విజృంభించెను. 1066 వ సంవత్సరమున నార్మండీ రాష్ట్రప్రభువగు విల్లియం ఆంగ్లేయ దేశమును జయించి పాలనము నెలకొలిపెను. ఆయన ఆంగ్లేయదేశమునందుగూడ నీ మొఖాసాపద్ధతిని పూర్తిగ స్థాపించెను. ఈపద్ధతివలన నేర్పడిన రాజకీయసాంఘికపరిస్థితులు

యూరపుఖండములోని అన్ని దేశములలోను పదునెనిమిదవ శతాబ్దాంతమువఱకును నిలిచియుండెను. ఈపరిస్థితులపై తిరుగబాటుచేసి నాశనముచేయుటకు 1789 వ సంవత్సరమున ఫరాసుదేశములో ప్రజాస్వాతంత్ర్యవిప్లవము జరిగెను. ఈ ప్రభుపరంపరాపద్ధతి ఇంకను ఇంగ్లాండులో పూర్తిగచావక ఆంగ్లేయ పార్లమెంటులోని ప్రభువులసభరూపముననూ, ఇంగ్లాండులోని భూస్వాములందు రైతులమధ్య హక్కులలో కొంతవఱకును, నిలిచియున్నది. ఇప్పటికిని ఇంగ్లాండులోని ప్రభువులు సామాన్యప్రజలతో కలియక వేరుగ క్లబ్బులను స్థాపించుకొనియున్నారు. సామాన్యప్రజలను తమకన్న తక్కువవారిగ చూచుచున్నారు. ఫరాసు విప్లవముతరువాత ఫ్రాన్సుదేశములోను అమెరికాలోను ప్రభువులు లేరు.

ఆకాలపు ప్రజల అవసరములను బట్టియు అభిరాజుల బల ప్రాయములను బట్టియు నీ ప్రభు పరంపరా హీనత. పద్ధతి ఏర్పడినది. దీనియొక్క ప్రధానలక్షణము రాజుయొక్క అధికారము మిగుల బలహీనమై సామంతరాజులయొక్కయు వారి క్రింది ప్రభువుల యొక్కయు అధికారము మిగుల బలముగానుండుట. తొమ్మిది, పది శతాబ్దములలో యూరపులోని రాజులు బలహీనులుగనుండిరి. రోమక సామ్రాజ్యము కూలిపోయెను. దానితరువాత వచ్చిన షార్లమేనుయొక్క సామ్రాజ్యము ఆయన మరణముతోనే విచ్ఛిన్నమయ్యెను. ఫ్రాన్సులోని బలహీనులగు రాజులు నార్మనులనుండియు జర్మనిలోని రాజులు మాగియారులనుండియు తమ ప్రజలను సంర

క్షించ లేకపోయిరి. అందువలన రాజులు తమ అధికారమును సామంత రాజులకును ప్రభువులకును పంచి యీయవలసి వచ్చెను. నార్మనులనుండి పరాసుదేశమును కాపాడుటకై ప్రభువులను కోటలు కట్టుకొమ్మని రాజు లుత్తరువులిచ్చుట చూచియున్నాము. ప్రభువులను సామంత రాజులను బలవంతులుగ చేయవలసివచ్చెను. సంఘ మరాజకముగ నుండెను. బలవంతులు బలహీనులను ఒత్తిడి చేయుచుండిరి. పశుబలమే రాజ్యము చేయుచుండెను. ప్రతివారును స్వసంరక్షణకొరకై కత్తి పట్టవలసియుండెను. సామాన్యజనులు తమ్ము తాము రక్షించుకొనలేక తమ స్వతంత్రతను పోగొట్టుకొని బలవంతులగు ప్రభువులయండను జేరిరి. ప్రభువులు ప్రజలను సంరక్షించుచుండిరి. ఈ విధముగా ప్రభుపరంపరయొక్క యావశ్యకత ఏర్పడినది.

మొఖాసాప్రభుపరంపరాపద్ధతిలోగల ప్రధానసూత్ర
స్వంతముగ నౌకరీ మేమనగా స్వయముగా నౌకరిచేయుట. ఒకరి.
చేయుట. యొద్ద మరియొకరు భూమినికౌలుకుతీసికొనినచో ఈకాలమున ద్రవ్యరూపకముగ శిస్తు నిచ్చును. ఆకాలమందు భూఖామందుకు స్వయముగా నౌకరీ చేయవలెను. యూరపుఖండమున మధ్యమయుగములో తగినన్ని నాణెములులేవు. కాగితపు ద్రవ్యమును (నోట్లను) వారెరుగనేయెరుగరు. ఆకాలమున మూలధనముకూడ తక్కువ. మరియునీపద్ధతిలో మనుష్యులుచేసిన చట్టములకన్న ఆచారమే ప్రధానముగ నుండెను.

మొఖాసాపద్ధతిలో గల మఱియొక సూత్రము దేశము భూమినిచ్చుట: లోని భూమియంతయు రాజుది అనునది. భక్తిప్రమాణము. రాజు కొద్దిభూమిని తనక్రింద నుంచుకొని మిగత యావత్తు భూమిని తనక్రింది సామంతరాజులకు పంచి యిచ్చెను. ఆభూమిని పుచ్చుకొనినందుకుగాను రాజునకు సామంతరాజులు రాజభక్తిప్రమాణమును చేసిరి. రాజునొద్దకు సామంతరాజు తలకు టోపీలేకుండను, చేతిలో నాయుధము లేకుండను వచ్చి మోకరించి "నేను మీామనిషిని" అని ప్రమాణము చేయును. రాజు సామంతరాజును ముద్దాడి చేతులతో లేవనెత్తును. సామంతరాజునకు భూమిని స్వాధీనము చేసితినని చెప్పి అందుకు చిహ్నముగ నొకచెట్టుకొమ్మ నిచ్చును. కాబట్టి ఈ కలనే సామంతరాజు కొంతభూమి తన స్వంతముక్రింద నుంచుకొని మిగిలినదాని నంతను కొందరు ప్రభువులకు పంచియిచ్చెను. సామంతరాజునకు ప్రభువులు మోకరించి 'నేను మీామనిషిని' అను ప్రమాణముచేసిరి. సామంతరాజు ప్రభువులను ముద్దాడి లేవనెత్తి భూమిని స్వాధీనము చేసితినని చెప్పి చెట్టుకొమ్మ నిచ్చెను. తిరిగి ప్రభువులు తమ క్రిందనున్న భూమిని చిన్న ప్రభువులకును, వారు తమభూమిని ఇంకా కొద్ది ప్రభువులకును,వారు మరికొద్ది ప్రభువులకును పంచియిచ్చిరి. పైవారికి క్రిందివారు భక్తిసూచకమైన ప్రమాణము చేయుటయు, క్రిందివారిని పైవారు లేవనెత్తి భూమినిచ్చితినని చెప్పి చెట్టుకొమ్మ నిచ్చుటయు జరిగెను. రాజు సామంతరాజును, సామంతరాజు ప్రభువును, ప్రభువు తనక్రింది ప్రభువును, ఆతఁడు తన

క్రింది చిన్న ప్రభువును, ఈవిధముగా పైవాడు తనక్రింది వానిని శత్రువులనుండి రక్షించెదనని వాగ్దత్తము చేయుచు భూమినిచ్చినందునకు పైవానికి క్రిందివాడు భక్తిప్రమాణము గావించుటయేగాక సైన్యములతో సహాయము చేయవలెను. రాజు యుద్ధమునకు వెడలగనే సామంతరాజు, సామంతరాజు వెడలగనే ప్రభువు, ప్రభువు వెడలగనే క్రిందిప్రభువు, ఈవిధముగ ప్రతిక్రిందివాడును తనపైవానికి సహాయముగ సైన్యములను తీసికొని వెళ్ళవలెను. ఇటుల భూమినిచ్చుట, భక్తి ప్రమాణము, శత్రువులనుండి రక్షణ, సైనికసేవ, ఇవి మొఖాసాపద్ధతిలో పైవానిని క్రిందివానిని బంధించు ముఖ్యనిబంధనలు. రాజ్యమంతయు భూస్వామందులగు సామంతరాజులతోడను గొప్ప ప్రభువులతోడను చిన్న ప్రభువులతోడను నిండెను. ఈ ప్రభువు లెప్పుడును ఆయుధములను ధరించి సైన్యములను తయారుచేసికొని కోటలను నిర్మించుకొని యుద్ధములకు సంసిద్ధులుగనుండిరి. ప్రభువులు చిన్నతనమునుండియు యుద్ధమున కౌశలముచూపి పేరు పొందవలెనని శిక్షను పొందుచుండిరి. ప్రతిదానికిని కత్తిదూయుట సామాన్యమయ్యెను. ప్రభువులకు యుద్ధము ప్రధానవృత్తియయ్యెను.

రాజు మొదలగు పైవారిని ప్రభువులనియు క్రిందివారిని సామంతులనియు పిలుతము. ప్రభువునకు సామంతుడు సంవత్సరమునకు నలుబది దినములు మాత్రము సైనికసహాయముచేసి తీరవలెననియు, తాను పొందిన భూమినుండి కొంతదూరముకన్న నెక్కువదూరము సామం

ప్రభువునకు చేయుపనులు.

తుడు ప్రభుసహాయమునకై పోనక్కరలేదనియు క్రమముగా నాచారమేర్పడినది. ఒక సైనికసహాయమేగాక ప్రభువునకు సామంతుడు కొన్ని ఇతర సహాయములను చేసితీరవలెను. సామంతుడు చనిపోయినప్పుడాతనివారసులు ప్రభువునకు కొంత ద్రవ్యమిచ్చినగాని భూమిలో ప్రవేశించవీలులేదు. దూరవారసునకు భూమి సంక్రమించినపుడు ప్రభువునకెక్కువ సొమ్మునియ్యవలెను. ఇయ్యవలసిన సొమ్ము ఆచారమువలన స్థిరపడినది. ప్రభువు ప్రయాణముచేయుచున్నపుడును, వేటాడుటకు బయలుదేరినప్పుడును ఆయనకును ఆయన అనుచరులకును సామంతుడు ఆతిథ్య మీయవలయును. ప్రభువు యుద్ధములో శత్రువులచే జిక్కినపుడు సామంతుడు ఎంతధనమైనను ఇచ్చి ప్రభువును విడిపించుకొని రావలెను. ప్రభువుయొక్క ప్రథమపుత్రికయొక్క వివాహమునకును ఆతని ప్రథమకుమారుడు ఆయుధధారణము గావించినపుడును సామంతుడు కొంతసొమ్మునియ్యవలెను. ప్రభువు కోరినపుడెల్ల సామంతుడు సలహానీయవలెను. భూమి వారసత్వముగా జ్యేష్ఠకుమారునికి మాత్రమే సంక్రమించును. వారసులెవరును లేనపుడును, సామంతుడు ప్రభువుపై తిరుగబాటు చేసినపుడును సామంతుడు షరతులకు వ్యతిరేకముగ ప్రవర్తించినపుడును భూమిని ప్రభువు తీసికొనును.

రాజుగాని సామంతరాజుగాని ప్రభువులుగాని తమ క్రిందివారికి స్వాధీనపరుపక తమ స్వంతకమతముక్రింద నుంచు

వ్యవసాయక భూములను వ్యవసాయక బానిసలచే (సర్ఫ్స) సేద్యము చేయించుకొనిరి. కొంత

బానిసలు.

కాలమువరకు పరాసుదేశములో రాజుయొక్క స్వంతకమతము క్రింద నుంచుకొనిన భూమి స్వల్పమై సామంతరాజులును, ప్రభువులును దేశములో రాజునకన్న ఎక్కువ బలవంతులుగ నుండిరి. ఆకాలమున రాజు వేరుగ పన్నులు వసూలుచేయు పద్ధతి లేనేలేదు. 987 వ సంవత్సరమున పరాసుదేశమునకు హ్యూజుకాపటు రాజయ్యెను. ఈకాపటు వంశీకులగు రాజులు తమ స్వంతకమతపు భూములను వృద్ధిచేసికొని క్రమముగా బలవంతులైరి. ఏదో సాకుపెట్టి సామంతులనుండి భూమిని లాగుకొని స్వంతకమతములో చేర్చుకొనిరి. స్వంతకమతపు భూములలోని వ్యవసాయకబానిసల స్థితి దుర్భరముగ నుండెను. భూములనువిడిచి ఇష్టము వచ్చినచోటికి పోయి జీవించుటకు వీలు లేదు. వీరిని తమ భూఖామందులగు ప్రభువు లెట్టిశిక్షవిధించినను ఖైదులో వేసినను కొరడాదెబ్బలు కొట్టినను భూమిలోనుంచి వెడలగొట్టినను ప్రభువు నడుగువారు లేరు. వీరు ప్రభువు చెప్పిన అన్నిపనులును చేసితీరవలెను. భూమి అమ్మబడినపుడు భూమితోకూడ వీరు నూతనప్రభువుక్రిందికి పోవుదురు. వీరు చనిపోగనే వీరి ఆస్తిఅంతయు తమ భూఖామందునకు చెందును. ఇట్టివారుగాక భూఖామందులగు ప్రభువుల భూములను వ్యవసాయముచేయుచు వారికి నియమితమైన సేవను శిస్తును అర్పించెడి వ్యవసాయకులుకూడ కొందరుగలరు. వీరు సాధారణముగ పండినపంటలో కొంతభాగము చెల్లింతురు. భూఖామందుయొక్క ఇతర భూములమీదను. ద్రాక్షతోటలలోను పనిచేయవలెను. ఆయన కోటను బాగుచేయవలెను.

సామానులను బండ్లను నాగళ్లను బాగుచేయవలెను. భూఖామందుయొక్క రోడ్లను వేయవలెను. వీరి ఆస్తి వీరిపిల్లలకు చెందును. వీరిపై విచారణహక్కు భూఖామందులకే గలదు. భూఖామందుల తీర్పుపై వ్యవసాయకులకు మరెక్కడను చెప్పుకొనుటకు హక్కు లేదు.

జాతిభేదములు.

మధ్యమయుగమున యూరపుఖండములోని దేశములన్నిటిలోను సంఘముమూడుజాతులుగ విభజింపబడి యుండినది.

మొదటిజాతి ప్రభువులు.

మొదటిజాతియగుప్రభువులకుశిరస్సురాజు. సామంతరాజులు, పెద్దప్రభువులు, చిన్నప్రభువులు మొదలగు ప్రభువులందరును ఈజాతిలోనివారు. వీరందరును భూఖామందులు. వీరిలోవీరు వివాహమాడుచుండిరి. సామంతరాజులునుగొప్ప ప్రభువులును సాధారణముగ రాజబంధువులుగ నుండిరి. సామాన్యప్రజలకన్న పుట్టుకవలన అధికులమని భావించుచునీప్రభువులజాతి సామాన్యప్రజలమీద గొప్పగొప్ప అధికారములను గలిగియుండెను. ప్రభువులకు తమ భూములలోని వ్యవసాయకులమీదను, వ్యవసాయకూలీలమీదను, కాపురముండు ఇతర ప్రజలమీదను నిరంకుశమగు న్యాయవిచారణాధికారహక్కులు గలవు. ఖైదు, దెబ్బలశిక్ష మొదలగునవి వేయవచ్చును. గొప్పప్రభువులకు మరణశిక్ష విధించు హక్కుగూడ నుండెను. ప్రభువులందరును తమంతటతాము యుద్ధము చేయవచ్చును. సంధి చేసికొనవచ్చును. ఇష్టము వచ్చినంతసైన్యము నుంచుకొనవచ్చును. ఇష్టమువచ్చిన ఆయు

ధములను ధరించవచ్చును. కోటలు నిర్మించుకొనవచ్చును. కొందరు నాణెములుకూడ వేసికొనవచ్చును. వీరికింద నుండిన భూములకు పైవారికి సైనికకొలువుతప్ప చెల్లించవలసిన పన్నులు లేవు. క్రమముగా నీప్రభువులు తమలోతాము యుద్ధములుచేయుచు చుట్టుపట్టుప్రాంతములలోని ప్రజలను దోచుకొనుచు దేశములోని అరాజకమునకును, క్షామమునకును కారకులైరి. పదకొండవశతాబ్దమున యూరపుఖండమున మితిలేని అరాజకము, దోపిళ్ళు, హత్యలు ప్రబలి మహాక్షామము కలిగెను. ప్రజలు మానవకళేబరములను తినిరి. ప్రభువులు ప్రతివానిమీదకిని కత్తిదూయుటకు సిద్ధముగా నున్నను స్వాతంత్ర్యప్రియులై ఆత్మగౌరవముగలవారై యుండిరి. స్త్రీల, అనాథల, శరణాగతుల సంరక్షణ తమ ప్రధానధర్మమని తలచిరి. వీరు కవిత్వమును చిత్రలేఖనమును కొంతవఱకుప్రోత్సహించిరి.

రెండవ జాతిమతగురువులలో రెండు రకములవారుగలరు. బిషపులు మొదలగు పెద్దగురువులు, చిన్నగురువులు. వీరువివాహ రెండవజాతి మాడుటకువీలులేదు. ప్రభువుల ఆస్తి జ్యేష్ఠపుత్రుల మతగురువులు. కుమాత్రమే సంక్రమించుచుండినందున తక్కిన పుత్రులలో కొందరు సన్యాసాశ్రమమును స్వీకరించి బిషపులు మొదలగు పెద్దగురువులగుచుండెడివారు. పెద్దగురువులలో చాలవఱకు ప్రభువంశీకులుగ నుండిరి. చిన్నగురువులు సాధారణముగ సామాన్య ప్రజలలోనుండి యాశ్రమమును స్వీకరించినవారు. మతగురువులందరును రోములోని క్రైస్తవప్రధానాచార్యుడగు

పోపులలో బడియుండిరి. స్త్రీలుగూడ సన్న్యాసినులగుచుండిరి. ఈ గురువులజాతివారు దేవుని కెక్కువసాన్నిధ్యమందున్నారని భావింపబడుచు సామాన్య ప్రజలకంటె నధికులుగ భావింపబడుచుండిరి. వీరికిగూడ చాల ఆస్తులుండెను. భక్తులు విశేషముగ ఆస్తుల నిచ్చుచుండిరి. క్రీస్తుశకము 1000 వ సంవత్సరాంతమునకు ప్రళయముకలిగి ప్రపంచమంతయు తప్పక నాశనమగునను దృఢనమ్మకము క్రైస్తవ ప్రపంచమునందలి యందరిజనులకును గలిగెను. యూరపుఖండమంతయు నాప్రళయమునకై మిగుల నాతురతతో సిద్ధపడెను. ఆ సంవత్సరము యూరపులోని ప్రతివారును మతగురువులకు గొప్పగొప్ప ఆస్తిదానములను చేసిరి. ప్రతివారును పాపములకొరకు పశ్చాత్తాపపడి ముందులోకమునకై సిద్ధపడియుండిరి. కాని నూతనసంవత్సర ప్రారంభపురోజున సూర్యుడు చక్కగా ప్రకాశించెను. ప్రళయమురాకనే ప్రపంచము యథాప్రకారముగనే నడుచుచుండెను. ప్రజలభయము భ్రమ తొలగిపోయెను. దేశములోని అయిదవవంతు భూమి మతగురువులక్రిందికి వచ్చెను. మతగురువులఆస్తికి సంబంధించినమట్టుకు వారును ప్రభువులై తమభూములను రాజులనుండిగాని ప్రభువులనుండిగానిసామంతులుగ మొఖాసా షరతులకు లోబడి గ్రహించుటయు తమకు సామంతులుగ ప్రభువులకుగాని ఇతర మతగురువులకుగాని అదేప్రకార మిచ్చుటయు జరుగుచుండెను. వీరు స్వయముగాయుద్ధమునకు పోగూడదు కావున ప్రతినిధులను బంపుచుండిరి. వీరికి భూఖామందులుగ ప్రభువులతోబాటు న్యాయవిచారణాధికారము మొదలగు సమస్తహక్కులుండెను.

కాని మతగురువులు తమ మఠములలోను దేవాలయములలో
ను పాఠశాలలనుబెట్టి కొంతవఱకు సామాన్యజనులలో విద్యా
ప్యాపకము చేయుచుండిరి. అనేకమంది మతగురువులు గొప్ప
పండితులై కవిత్వము తత్త్వశాస్త్రము మొదలగునవి వ్రాసి
ప్రసిద్ధికెక్కిరి. క్రమముగా వ్యవసాయక బానిసలను దేవుని పేర
బానిసత్వమునుండి విముక్తిగావించిరి.

మూడవజాతి సామాన్య ప్రజలు. సామాన్యప్రజలుమతగురువులచే హీనముగచూడబడి,
ప్రభువులనిరంకుశత్వమునకును వత్తిడికిని లోబడి,
వారుకోరిన నౌకరిని చేసితీరవలసి, చెమటకార్చి
కష్టించు వ్యవసాయకులువ్యవసాయ బానిసలు ఇతర
చేతిపనులు చేయుప్రజలు ఈ మూడవజాతిలో చేరియుండిరి.

ఒక రాజుక్రిందనున్న సామంతరాజు లందరును సమా
నులు. అటులనే ఒక దర్జాగల సామంతరాజుక్రిందగాని ప్రభువు

న్యాయవిచారణ. క్రిందగాని యుండిన ప్రభువులందరును సమా
నులు. సమానులగు ప్రభువులలో తగువులు
కలిగినచో తమయొక్కపై ప్రభువువద్ద చెప్పుకొనెదరు. ఆయన
సభ్యులను పిలిపించి రాజీగా పరిష్కరించుటకు యత్నించును.
అటుల కుదరనిచో ఇద్దరు కక్షిదార్లను ఒక నియమిత ప్రదేశ
మున స్వయముగా నొకరితో నొకరు పోరాడవలెను. పోరా
టములో జయమొందినవారిపక్షమున న్యాయమున్నటుల
ఆయన తీర్మానించును. ఒక కక్షిదారు స్త్రీగాని వృద్ధుగాని
శిశువుగాని మతగురువుగాని అయినచో సీపోరాటమునకు ప్రతి
నిధిని బంపవచ్చును. ఆప్రతినిధి పోరులో గెల్చిన యజమాని

పక్షమున న్యాయముగలదనియు నోడినచో యజమాని పక్షమున న్యాయములేదనియు తీర్పు చెప్పబడును. కాని పైప్రభువుతో చెప్పుకొని అక్కడ పోరుసలుపుటకు బదులుగా ప్రభువులు తమకెవరయిన అపకారము గావించినచో ప్రతికక్షికి ముందుగా తెలిపి స్థలనిర్ణయముచేసికొని వారిమీదికి తామే పోరాటమునకు బయలుదేరసాగిరి. ఇట్లు ప్రభువులు తమలో తాము తరుచుగా పోరాడుచుండిరి. ఈ పోరాటపుపద్ధతి ప్రభువులు కానిసామాన్యప్రజలకుగూడ వ్యాపింపజేయబడెను. ఒకరిమీద నేరారోపణ జరిగినపుడు నేరమారోపింపబడిన ముద్దాయి తాను నిర్దోషినని ఋజువుచేసికొనుటకు మండుచున్న నిప్పులలో నుండి నడుచుటగాని మసలుచున్న నీటిలో చేతినుంచుటగాని ఎఱ్ఱగాకాలిన ఇనుపకడ్డీని చేతితో పట్టుకొనుటగాని చేయవలెను. నిర్ణీతమైన దినములలో కాలినదేహము స్వస్థత చెందినచో నాతడు నిర్దోషియనియు బాగుకానిచో దోషియనియు తీర్పు చెప్పబడును. ఈ విధమయిన విచారణాపద్ధతి యూరపుఖండములోని యన్నిదేశములలోను కొన్ని వందల సంవత్సరము లమలులో నుండెను.



ఫ్రెంచి

# స్వాతంత్ర్యవిజయము

## నాలుగవ అధ్యాయము

## ముసల్మానులకును క్రైస్తవులకును యుద్ధములు

ముసల్మానులపై క్రైస్తవుల మత యుద్ధము.

పదునొకొండవ శతాబ్దమున మతగురువుల ప్రాముఖ్య మెక్కువయినది. క్రైస్తవప్రధానమతాచార్యుని (పోపు) మాట యూరపుఖండమంతయు శిరసావహించినది. అంతకు పూర్వము కొంతకాలమునుండియు ప్రజలలో మతవిశ్వాస మెక్కువై యాత్రలుచేయు నభ్యాసము ప్రబలినది. ముఖ్యముగ యేసుక్రీస్తుప్రభువు యొక్క సమాధిగల జెరూసలేమునకు యాత్రపోవుట మిగుల పుణ్యకార్యమని తలచిరి. యూరపుఖండమునుండి యనేక లక్షలమంది క్రైస్తవులు ప్రతిసంవత్సరమును ప్రభువుయొక్క

సమాధిని దర్శించి వచ్చుచుండెడివారు. జెరూసలేము పట్ట
ణము చాలకాలమునుండియు ముసల్మానులవశమం దుండెను.
కాని బాగ్దాదు, కైరో ఖలీఫాలు మతసహనము గలవారు.
క్రైస్తవులకేమియు నిబ్బందులు కలిగించలేదు. యాత్రికులకు
అడ్డులేకుండనుండెను. కాని 1055 వ సంవత్సరమున నీఖలీ
ఫాల యధికారము పడిపోయినది. సెల్జూకి యను జాతికి
చెందిన తురుష్కులు బాగ్దాదును జయించిరి. కొలదికాల
ములో సిరియా, పాలెస్టైన్ దేశములు వీరి స్వాధీనమయ్యె
ను. జెరూసలేమును దర్శించుటకు వెళ్ళిన క్రైస్తవయాత్రికులకు
వీరు చాల యిబ్బందుల కలుగచేసిరి. ఈ యాత్రికులను ముసల్మా
నులు చాల బాధలు పెట్టుచున్నారని యూరపుఖండములోని
ప్రతిదేశములోను చెప్పుకొనసాగిరి. ఇంతలో తురుష్కులు ఆసియా
మైనరులో ప్రవేశించి 1071 వ సంవత్సరమున కాన్స్టాంటి
నోపిలునుండి వచ్చిన క్రైస్తవసేనల నోడించి గ్రీకుచక్రవర్తిని
ఖైదుచేసిరి. యూరపుకు తూర్పుననేగాక పశ్చిమమునగూడ
ముసల్మానులు చెలరేగిరి. 1086 వ సంవత్సరమున స్పెయిన్
దేశమున జెల్లకావద్ద క్రైస్తవులకును ముసల్మానులకును జరిగిన
గొప్పయుద్ధములో ముసల్మానులే పూర్తిగ జయమందిరి.
"క్రైస్తవమతము, క్రైస్తవనాగరికత, అపాయకరమగు స్థితి
యం దున్నవి; వెంటనే రక్షింపుడు," అను సందేశమును రో
ములో నున్న క్రైస్తవప్రధానాచార్యుడగు పోపు ఏడవ
గ్రెగరీ యూరపుఖండమున కంతకును పంపెను. పీటర్ ది
హెర్మిటు ఫ్రాన్సుదేశ మంతటను సంచారముచేసి క్రైస్తవ

యాత్రికులు పడుచున్న కష్టములనుగూర్చి బోధనలిప్పి, మహమ్మదీయులపై యుద్ధముచేసి ఏసుక్రీస్తుయొక్క సమాధిని జయించుటకు ప్రజలను పురికొలిపెను. ప్రతిచోటను ప్రజలు ముసల్మానులపైకి వెడలుటకు ఆయుధపాణులైరి. 1096 వ సంవత్సరమున పోపు ఒక గొప్ప క్రైస్తవసమావేశమును చేసి "నాస్తికులగు" మహమ్మదీయులపైన పవిత్రమైన యుద్ధము చేయవలసినదని బోధించెను. కొలదికాలములో పదిలక్షలమంది క్రైస్తవులు తమవస్త్రములపై నెఱ్ఱనిగుడ్డతో శిలువలను కుట్టుకొని ఈ 'పవిత్రమగు' ఉద్యమములో జేరిరి. 1093 వ సంవత్సరమున క్రైస్తవభక్తులు జెరూసలేము దండయాత్రకు బయలుదేరిరి. ఫ్రాన్సునుండియు జర్మనీనుండియు లక్షయేబదివేల పురుషులు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు పీటర్ ది హెర్మిటుయొక్క నాయకత్వముక్రింద మతావేశముతో బయలుదేరిరి. అందరియొద్దను ఆయుధములులేవు. భగవంతుడు తమ్ము ప్రత్యేకముగ సంరక్షించుననియు ప్రతిచోటను అద్భుతములు చేయుననియు నమ్మి బయలుదేరిరి. జర్మనీగుండ పోవునపుడు యూదులను నరికివైచిరి. భోజనముకొరకు త్రోవలో ప్రజలను దోచుకొనుచు అనేక దుష్కార్యములను చేయుచుండిరి. హంగెరీ దేశములో నీక్రైస్తవభక్తుల దుండగము లెక్కువైనందున అచటి క్రైస్తవప్రజలు వీరిపై తిరుగబడి పెక్కుమందిని చంపి తమ దేశములోనుండి వెడలగొట్టిరి. చావగ మిగిలినక్రైస్తవభక్తులు కాన్‌స్టాంటునోపిలు చేరగ చక్రవర్తి వారి అల్లరులనుండి తప్పించుకొనుటకు త్వరగ ఆసియామైనరుకు పంపెను.

అచటివారి నందరిని తురుష్కసేనలు నరికివేసిరి. పీటర్ ది హెర్మిటు తప్పించుకొని పోయెను.

జెరూసలేమును జయించుట.

ఈలోపున యూరపుఖండమునుండి ప్రభువుల క్రింద గొప్ప క్రైస్తవ సైన్యములు బయలుదేరి నలువైపుల నుండియు కాన్‌స్టాంటినోపిలును చేరిరి. వీరిలో ఇతర దేశీయులకన్న పరాసుప్రభువు లెక్కువమంది యుండిరి. తురుష్కసేనలనుండి జయించెడి దేశములను గ్రీకు చక్రవర్తికి సామంతరాజులుగ మాత్రమే స్వాధీనమును పొందెదమని ప్రమాణము గైకొని వీరు ఆసియామైనరులో ప్రవేశించి, త్రోవలో అడ్డగించిన తురుష్కసేన నోడించి, తుదకు జెరూసలేమును చేరిరి. పీటర్ ది హెర్మిటుయొక్క నాయకత్వము క్రింద ఈ క్రైస్తవ సేనలన్నియు జెరూసలేము పట్టణముచుట్టును ప్రదక్షిణముచేసి పట్టణమును ముట్టడించిరి. ముట్టడి అనేక దినములు పట్టెను. తురుష్కులు జాగ్రత్తగా పట్టణమును సంరక్షించుచుండిరి. తుదకు 1099 వ సంవత్సరము 15 వ జులై తేదీన క్రైస్తవులు మహావేశముతో గోడలనెక్కిరి. పట్టణములో ప్రవేశించిరి. క్రైస్తవులకు జయము కలిగెను. ముసల్మానులను చంపుట భగవత్ప్రీతియగు కార్యమని నమ్మి క్రైస్తవులు ముసల్మానుల నందరిని హత్యగావించిరి. "భగవంతుని యనుగ్రహమువలన" నడుములోతున పారుచున్న ముసల్మానుల రక్తప్రవాహముగుండ క్రైస్తవ భక్తులు వెళ్ళి "ఒక చెంప మీదకొట్టినచో రెండవ చెంపనుకూడ నిమ్ము," "నీశత్రువులను ద్వేషింపక ప్రేమింపుము" అను ప్రేమా సందే

శమును లోకమునకు ప్రసాదించిన ఏసుక్రీస్తు ప్రభువుయొక్క సమాధిని స్వాధీనమును పొందిరి. జెరూసలేములో క్రైస్తవ రాజ్యము స్థాపించబడెను.

[2]

రెండవ యుద్ధము. ముసల్మానులనుండి జయించిన చుట్టుపట్టుదేశము నాల్గు రాష్ట్రములుగ విభజించబడి క్రైస్తవప్రభువులచే పాలించబడు చుండెను. వీరు నలుగురును జెరూసలేములోని క్రైస్తవ ప్రభువుకు సామంతరాజులైరి. వీరు కాన్‌స్టాంటినోపిలులోని గ్రీకుచక్రవర్తికి చేసిన భక్తిప్రమాణమునకు వ్యతిరేకముగ స్వతంత్రరాజ్యమును స్థాపించుకొనినందున గ్రీకుచక్రవర్తి వీరియందు ద్వేషమువహించి తురుష్కులతో కుట్రలు సలిపెను. కొలదికాలములో ఈ నాలుగు క్రైస్తవ రాష్ట్రముల మధ్యనుకూడ భేదాభిప్రాయములు, మనస్పర్ధలు కలిగెను. ముసల్మానులీ సంగతి కనిపెట్టి వీరిపైదండెత్తి 1144 వ సంవత్సరములో ఎడెస్సా పట్టణమును పట్టుకొనిరి. దీనివలన యూరపుఖండమున భయముకలిగెను. పోపు ముసల్మానులపై యుద్ధమును ప్రకటించెను. ఫరాసుదేశపు రాజగు ఏడవ లూయి కొన్నిసైన్యములతో ముసల్మానులపైకి దాడివెడలెను. జర్మనీనుండియు కొన్నిసైన్యములు బయలుదేరెను. కాని యూరపుఖండము వెనుకటి యుత్సాహమును చూపలేదు. ఫ్రెంచి సైన్యములును జర్మనులును ఆసియామైనరులో చేరిరి. జర్మనులను క్రైస్తవులగు గ్రీకులు మోసపుచ్చి ముసల్మానులకు నొప్పగింతచేసిరి. జర్మనులు తురుష్కులచే వధించబడిరి. ఫరాసురాజగు లూయికూడ తురుష్కులచే నోడించబడెను. అతని

సామంతరాజులు వధింపబడి సైన్యములు చెల్లాచెదరయ్యెను. ఆతడు తనతోనున్న వేలకొలది క్రైస్తవయాత్రికులను వదలి గ్రీకుల పడవలలో నెక్కి కొలదిసైన్యముతోను, సామంత ప్రభువులతోడను అంటియోకు చేరెను. వెనుక విడచిపెట్టబడిన యాత్రికులు తురుష్కులచే చంపబడిరి. మూడువేలమంది యేసుక్రీస్తు తమ్ము మోసముచేసెనని నిందించి, తమ ప్రాణ సంరక్షణముకొరకు ముసల్మానులైరి. అంటియోకునుండి లూయీరాజు యాత్రకై జెరూసలేమువెళ్ళి యాత్ర పూర్తిచేసి కొని డెమాస్కసు పట్టణమును ముట్టడించెను. ఇచట ముసల్మానులచే నోడింపబడి చాలవరకు జనమును పోగొట్టుకొని తన దేశమునకు మరలి వచ్చెను. ఇటుల రెండవ దండయాత్ర వలన క్రైస్తవు లనేక వేలమంది వృథగా చంపబడిరి. ముసల్మానుల బలము హెచ్చెను.

మూడవ యుద్ధము.

ఇంతలో గొప్ప ముసల్మానురాజొకడు బయలుదేరెను. ఈజిప్టు రాజగు సాలడిను శూరుడు. ఔదార్యవంతుడు. దయాదాక్షిణ్యములకు ప్రసిద్ధికెక్కినవాడు. ఈయన ముసల్మానురాజ్యము విస్తరింపజేయుటకై బయలుదేరి, సిరియాను జయించి, క్రైస్తవుల నోడించి, 1187 సం॥న జెరూసలేమును, చుట్టుపట్ల క్రైస్తవరాష్ట్రములను ఆక్రమించుకొనెను. కాని ఆయన క్రైస్తవులను ఔదార్యముతో చూచి మతస్వేచ్ఛ నొసంగెను. జెరూసలేము ముసల్మానుచేతులలో పడుటవలన యూరపుఖండములో సంక్షోభము పుట్టెను. ఇంగ్లాండుయొక్కయు ఫ్రాన్సుయొక్కయు రాజులు, గ్రీకుచక్రవర్తి, అనేక

ప్రభువులు గొప్ప సైన్యములతో బయలుదేరిరి. కాని వీరిలో నైకమత్యము లేకపోయెను. గ్రీకురాజు త్రోవలో మరణించెను. ఇంగ్లీషురాజును ఫ్రెంచిరాజును కలిసి సాలడిన్ చక్రవర్తియొక్క సైన్యముల నోడించి ఏకరును పట్టుకొనిరి. అంతట వీరిలో కలహములు గలిగి ఫరాసురాజు తన దేశమునకు వెడలిపోయెను. ఇంగ్లీషురాజు కొంతకాలముండి ఏమియు చేయజాలక మరలిపోయెను. ఇంగ్లీషురాజు తాను పట్టుకొనిన ముసల్మాను ఖయిదీలనందరిని చంపెను. సాలడీను తాను పట్టుకొనిన క్రైస్తవఖైదీలను విడిచిపెట్టెను.

(3)

నాలుగవ యుద్ధము.

పోపు మూడవ యిన్నొసెంటు క్రైస్తవప్రపంచమునకంతకును ఐక్యత గలిగించి ముసల్మానుల నోడించదలచి తిరిగి యుద్ధమును ప్రకటించెను. ఈ పర్యాయము రాజులెవరును చేరలేదు. అనేకులు ప్రభువులు క్రైస్తవ సైన్యములతో ముసల్మానులపైకి బయలుదేరిరి. త్రోవలో ఆ క్రైస్తవసేనలు ఇటలీదేశములోని వెనీసుపట్టణమున దిగెను. సిరియాపైకి వెడలుటకు పడవలసివ్వమని వెనీసుపట్టణము యొక్క ప్రజాప్రతినిధిసంఘమును కోరిరి. వెనీసువారు క్రైస్తవులు. ఆకాలమున ఆసియాకును యూరపునకును మధ్య జరుగుచుండిన వర్తకమునకు వెనీసు ప్రధానస్థానముగ నుండెను. వెనీసువారికి మతయుద్ధములవలన వర్తకలాభము కలుగుచుండెను. వెనీసునకు ఏడ్రియాటిక సముద్రముయొక్క తూర్పుతీరముననున్న జారాయను క్రైస్తవపట్టణము వర్తకములో చాలపోటీగ నుండెను. ముసల్మానులపై వెడలుటకు

పడవలు కావలెనని కోరగ, క్రైస్తవభక్తులగు సేనలన్నియు ముందుగా తమకు శత్రువగు జారాపట్టణమును ముట్టడించినచో పడవల నిచ్చెదమని వెనీసుప్రభుత్వమువారు చెప్పిరి. క్రైస్తవసేన యొప్పుకొనెను. వెనీసువారును క్రైస్తవసేనలును పడవలలో వెడలి క్రైస్తవప్రజలదగు జారాను ముట్టడించిరి. జారాను జయించి వెనీసువారివశము చేసిరి. ఇక్కడనుండియైన క్రైస్తవసేనలు ముసల్మానులపైకి పోలేదు. కాన్‌స్టాంటినోపిలు చక్రవర్తియొక్క అన్నకుమారుడగు అలెక్సియస జారాకువచ్చి, తనకు తండ్రినుండి సంక్రమించిన రాజ్యము నక్రమముగా తన పినతండ్రి అపహరించెను గావున తనకు సహాయము చేయవలసినదని కోరెను. కాన్‌స్టాంటినోపిలుకూడ వెనీసునకు వర్తకములో పోటీగనున్నది. వెనీసువారి ప్రోత్సాహమున క్రైస్తవసేనలు ముసల్మానులను యూరపులో ప్రవేశింపకుండ చిరకాలమునుండి ఆపుచున్న ప్రధాన క్రైస్తవ రాజ్యమగు కాన్‌స్టాంటినోపిలుపై దండెత్తిరి. అచట రాజ్యమేలుచున్న చక్రవర్తినోడించి అలెక్సియసును చక్రవర్తిగా చేసిరి. కాని త్వరలోనే అచటి ప్రజలు తిరుగబడి అలెక్సియసును చంపివేసిరి. దీనిమీఁద క్రైస్తవసైనికులు కాన్‌స్టాంటినోపిలు ప్రజలను ముట్టడించి వారిని దోచుకొని ఘోర హత్యలపాలు చేసిరి. వచ్చిన క్రైస్తవ సైనికుల నాయకులలో నొకడగు ఫరాసుప్రభువు బాల్డ్విను చక్రవర్తిగా

చేసిరి. కొంత భాగమును వెనీసువారికిచ్చిరి. ఈవిధముగా ముసల్మానులపై యుద్ధముకొరకు బయలుదేరిన క్రైస్తవ సేనలు క్రైస్తవ పట్టణమగు జారాను ముట్టడించి క్రైస్తవ రాజ్యమగు కాన్స్టాంటినోపిలును మిగులబలహీనముగ గావించిరి. క్రైస్తవప్రజలను దోచుకొని వధించిరి. కాన్స్టాంటునోపిలులో వీరు స్థాపించిన క్రొత్తచక్రవర్తిని రాజ్యములోని చాలభాగము లంగీకరించక స్వతంత్రమును ప్రకటించెను. ఈక్రొత్తచక్రవర్తి యొక్క వంశమువారు మిగుల బలహీనులైరి. 1262 సం॥ న నీవంశముపై ప్రజలు తిరుగుబాటు జేసి తిరిగి గ్రీకువంశమును నిలువబెట్టిరి. కాని కాన్స్టాంటునోపిలు తన పూర్వబలమును కోలుకొనలేదు. తుదకు 1453 సం॥ న ముసల్మానుల స్వాధీనమాయెను.

(4)

తర్వాత 'పోపులు' ఇంకను కొన్ని దండయాత్రలు సలిపిరి. ముసల్మానులపైకి అయినను గాకున్నను "పోపులు" మతముపేర తర్వాత జరుపు దండయాత్రలకన్నిటికిని క్రైస్తవమత యుద్ధములు. యుద్ధములనియే పేరిడిరి. 1218 సం॥న ఈజిప్టులోని ముసల్మానురాజుపై యుద్ధము ప్రకటింపబడెను. "పోపు" యొక్క ప్రతినిధియే స్వయముగా క్రైస్తవులను నడపెను. "నైలు" నది ముఖద్వారముననున్న డెమియటాను క్రైస్తవులు జయించిరి. దానిని తవకు విడిచిపెట్టిన వో జెరూసలేమును క్రైస్తవులవశము చేసెదనని ఈజిప్టు సుల్తాను

సంధిరాయబార మంపెను. క్రైస్తవు లొప్పుకొనలేదు. ఈజిప్టు నంతను జయించి సుల్తానును క్రైస్తవునిగా జేయవలెనని వారి యాశ. సుల్తాను తనసేనలతో క్రైస్తవులపైకి వచ్చి వారి నోడించి డెమియట్టానుండి వెడలగొట్టెను. క్రైస్తవులు ఈజిప్టు నువదలి పారిపోయిరి. 1229 సం॥న సిసిలీరాజు రెండవ ఫ్రెడ రిక్కు క్రైస్తవసేనలతో పాలస్తైనులో ప్రవేశించెను. ఈజిప్టు సుల్తాను సంధికివచ్చి జెరూసలేముకు క్రైస్తవయాత్రికులు స్వేచ్ఛగా రాకపోకలు చేయునట్లు సంధి చేసికొనెను. ముస ల్మానులలో కొన్ని అంతఃకలహములు కలిగినపుడు జెరూసలే మును క్రైస్తవులు స్వాధీనమును పొందిరి. కాని 1244 సం॥ ఈజిప్టుసుల్తాను తిరిగి బలవంతుడై సిరియా, పాలస్తైను మొద లగు ఆసియామైనరుప్రాంతము లన్నిటిని వశపరచుకొని అక్కడ యెచటను క్రైస్తవరాజ్యము లేకుండచేసెను. తరువాత జెరూసలేము ముసల్మానులవశమందే యున్నది.

1235 సం॥న పరాసుదేశములో మతయుద్ధము ప్రక టింపబడెను. జెరూసలేముకు పోవుమార్గములో యేసుక్రీస్తు ప్రభువును సిలువవేసినవారివంశ్యులగు యూదుల నందరిని హత్యగావించి క్రైస్తవమతములో కొన్ని సంస్కరణములను గావింప యత్నించుచుండిన నూటయెనుబదిముగ్గురు క్రైస్తవు లను మంటలలో పడవేసి చంపి, క్రైస్తవసేనలు పాలస్తైనులో

చేరిరి. అచట గాజావద్ద తురుష్కులచే నోడింపబడి మరలి వచ్చిరి. 1244 సం॥న పరాసురాజగు సెంటులూయుకి చాల జబ్బుచేసెను. అపుడు తనకు వ్యాధి నెమ్మదించినచో ముసల్మానుల పైకి యుద్ధమునకు వెళ్ళెదనని దేవునికి మొ్రక్కుకొనెను. శరీరము నెమ్మదిఅయినది. 1249 సం॥న ఆయన 1800 పడవలలో సేనలుతీసికొని ఈజిప్టుమీదికి వెళ్ళెను గాని మహమ్మదీయులు వీరినోడించి సెంటులూయిని కొన్నిసేనలతో పట్టుకొని ఖైదుజేసిరి. విశేషముగు ధనముపుచ్చుకొని విడిచి పెట్టిరి. వెంటనే పరాసురాజు పాలస్తైనుకుపోయి మూడుసం॥లు యాత్రిలలో గడపెను. రాజు ముసల్మానులచే పట్టుకొనబడిన సంగతి తెలియగనే పరాసుదేశములోని ప్రభువు లూరకొనిరి. వ్యవసాయకూలీలు, వ్యవసాయకులు మొదలగు బీదవారు సముద్రముదాటి వెళ్ళి రాజును విడిపించి తెచ్చెదమని బయలుదేరిరిగాని త్రోవలో వీరు పరాసుప్రజలను దోచుకొనుటవలనను, హత్యలు గావించుటవలనను వీరిని ప్రజలు ప్రతిచోట నుండియు తరిమివేసిరి. అందువలన నేమియు చేయజాలక గృహములకు చేరిరి. సెంటులూయిరాజు 1254 సం॥న పరాసుదేశమునకు వచ్చెను. ఈరాజు 1270 సం॥న మరియొక మారు యుద్ధముచేయ యత్నించి ట్యూనిసుపట్టణముపై దండెత్తి అచట తనసైనికులతో గూడ ప్లేగువలన మరణించెను.

ఈ మతయుద్ధములవలన గలిగిన ఫలితము లేమి? ముసల్మానుల బలము తగ్గకపోగా వృద్ధిఅయినది. ఆసియా మైనరు, పాలస్తైను, జెరూసలేము, మొదలగు ప్రాంతములన్నియు ముసల్మానుల వశమందేయున్నవి. ముసల్మానులను తూర్పునుండి యూరపుఖండములో ప్రవేశించకుండ అరికట్టుచున్న కాన్‌స్టాంటునోపిలుసామ్రాజ్యము బలహీనమైనది. క్రైస్తవుల కేమియు లాభము గలుగలేదు. కాని యూరపులోని క్రైస్తవులు తమ ప్రభువగు యేసుక్రీస్తువలెను, ఆయన యొక్క గొప్ప శిష్యులవలెను, ధర్మసంస్థాపనకొరకు తాము ఇతరులచే బాధల ననుభవించు పద్ధతినివిడిచి, మతముపేర నితరులపై కత్తిదూయు అలవాటును నేర్చుకొనిరి. మత సహనమును బొత్తుగా మరచిపోయి యితరమతస్థులను చంపివేయు దురభ్యాసముల కలవాటుపడిరి.



# ఫ్రెంచి
# స్వాతంత్ర్యవిజయము



## అయిదవ అధ్యాయము

## నూరు సంవత్సరముల యుద్ధము

(1)

హ్యూజికాపెటు 987 సం॥ న ఫ్రాన్సుదేశమునకు రాజగుట చూచియున్నాము. ఫ్రాన్సుదేశములోని ప్రజలు రాజు కాపెటులను తీసివేయువరకును ఈకాపెటు వంశ్యులే వంశపురాజులు. ఫ్రాన్సును పాలించిరి. మొఖాసాప్రభువరంపరాపద్ధతివలన రాజులకు పోయిన బలమును తిరిగి సంపాదించుటకు కాపెటు వంశరాజులు ప్రయత్నించిరి. కాలక్రమమున ప్రభువుల బలమును తగ్గించి రాజులు నిరంకుశత్వమును పొందుటకు యత్నించిరి. రాజులు నిరంకుశులగుటకు కొన్ని శతాబ్దములు పట్టెను. 1060 సం॥న మొదటి ఫిలిప్పు రాజయ్యెను. 1066 సం॥ న యీ రాజునకు సామంతరాజగు నార్మండీరాష్ట్రప్రభువు

విలియము ఇంగ్లాండును జయించి యాదేశమునకు రాజయ్యెను. 1180 సం॥న పరాసుదేశమునకు రెండవ ఫిలిప్పు రాజయ్యెను. ఈయన పెక్కు యుద్ధములుచేసి తన సామంతరాజులనుండి చాల భూములను లాగికొని తన స్వంత భూములుగ చేసికొని మిగుల బలవంతుడయ్యెను. 1215 సం॥న జాన్ అను బలహీనుడగు రాజు ఇంగ్లాండును పాలించుచుండెను. పరాసు రాజుకు సామంతముగ అతనికి పరాసుదేశములో నార్మండీ అంజూవిన్ రాష్ట్రములుండెను. రెండవ ఫిలిప్పురాజు ఇంగ్లీషురాజుపై యుద్ధముచేసి యోడించి నార్మండీ అంజూవిన్ రాష్ట్రములను స్వాధీనము పొందెను. రెండవ ఫిలిప్పురాజు పరాసుదేశములోని అనేక పట్టణములకు స్వతంత్రపాలనా హక్కుల నిచ్చెను. వర్తకసంఘములకు కొంతవరకు ప్రత్యేక స్వపరిపాలనాసౌకర్యములను కలుగజేసి ప్రోత్సహించెను. పట్టణములును, వర్తకమును ఎక్కువయిన కొలదియు, ప్రభువులకు సంబంధములేని భాగ్యవంతులయినట్టియు, తెలివితేటలు గలిగినట్టియు, హక్కులకై రాజుల నాశ్రయించునట్టియు ప్రజలు పరాసు దేశమునందంతటను వృద్ధిజెందిరి. ఈపట్టణము లన్నియు సమయము వచ్చినపుడు రాజునకు పట్టుకొమ్మగా నిలిచినవి. రెండవ ఫిలిప్పు తన నౌకరీలోనుండి ప్రభువులను తీసివేసి మధ్యమతరగతి ప్రజలనుండి నౌకరుల నేర్పఱచుకొనెను. పట్టణములనుండియు వర్తకులనుండియు కొన్నిపన్నులు వసూలు చేసెను. సామంతరాజులు తనకుజేయు కొన్ని స్వంతనౌకరీలను మాన్పించి వానికి బదులు సొమ్ము పుచ్చుకొనెను. స్వంత

భూములనుండియు చాలసొమ్ము వచ్చుచుండెను. వీలైనంత వరకు ఆయన తన స్వంత సైన్యములను జీతములిచ్చి పెట్టుకొనెను. తన సామంతప్రభువులమీద ఆధారపడలేదు. ఆయన కాలమున రాజగౌరవము హెచ్చెను. ప్రభువులు రాజునకు భయపడుచుండిరి. ఈయన మనుమడగు సెంటులూయియొక్క పాలనమున 1242 సంవత్సరమున ఫరాసుదేశములోని సామంతరాజులేకమై రాజుమీద తిరుగబడగ రాజు వారినోడించి శిక్షించెను. ఇంతటినుండియు ఫరాసుదేశములోని ప్రభువులు రాజును ధిక్కరించెడి స్థితిలోలేరని చెప్పవచ్చును. సెంటులూయి కాలమున టూలోనురాష్ట్రమున కలతలుగలిగి యారాష్ట్రము సెంటులూయికి చేరెను. ఇందువలన విశాలమైనట్టియు భాగ్యవంతమైనట్టియు భాగములు రాజుయొక్క స్వంతభూములలో చేరెను.

ఈయన మనుమడగు నాల్గవ ఫిలిప్పుకాలమునకు రాజుయొక్క స్వంతభూములు ఫరాసుదేశములో మూడింట రెండు భాగము లుండెను. ఈయునకును క్రైస్తవ ప్రధాన మతాచార్యుడగు పోపునకును కలహము కలిగెను. పోపు ఈయనను వెలివేసితినని ఆజ్ఞాపత్రమును పంపెను. ఆ యాజ్ఞాపత్రమును ఈయన తగులబెట్టివేసెను. ఫరాసుదేశమును తనపక్షమున నుంచుకొనుటకై 1302 వ సంవత్సరమున స్టేట్సుజనరలు అను దేశప్రతినిధిసభను సమావేశపరచెను. మతగురువుల నొకసభగాను, ప్రభువుల నొకసభగాను, ప్రజాప్రతినిధు లొకసభగాను కూడునట్లు చేసెను. ఆసభలో

స్టేట్సు జనరలు.

“ఫిలిప్పురాజుగారికిని ప్రజలమైన మేము ఈ దేశవ్యవహారములలో భగవంతునితప్ప మీ రెవరియొక్క అధికారమును అంగీకరించవద్దని ప్రార్థించుచున్నాము,” అని ప్రజాప్రతినిధులు చెప్పిరి. దీని నాధారముచేసికొని ఆరాజు పోపును నిర్లక్ష్యము చేయగలిగెను. ఆసంవత్సరముననే పారిసునగరమున ప్రధాన న్యాయస్థానము నొకదానిని ఏర్పరచెను. దీనికి పారిసు పార్లమెంటు అని పేరు. ఈన్యాయస్థానములో పేరుపడసిన న్యాయవాదులను న్యాయాధిపతులుగ నియమించెను. వీరు రాజుయొక్క స్వంతభూములలోని ప్రజలపైనను, రాజుక్రిందనుండిన దేశములలోని యావత్తుపట్టణముల ప్రజలపైనను, రాజునకును క్రింది ప్రభువులకును గల తగాదాల విషయములోను విచారించి తీర్పుచెప్పుచుండిరి. ఇది క్రమముగా దేశమునకంతకును ప్రధానన్యాయస్థాన మయ్యెను. అన్ని తగవులను రాజు విచారించవచ్చునను నాచారము బయలుదేరెను. నాలుగవ ఫిలిప్పుకుమారుడగు పదియవలూయి కాలమున ప్రభువులు రాజుయొక్క మంత్రిలను చంపి తమ కిదివరకుగల హక్కులను తిరిగి చలాయించిరి. నాలుగవ ఫిలిప్పును, ఆయన కుమారుడును కొంతసొమ్ము పుచ్చుకొని చాలమంది వ్యవసాయకూలీలకు స్వేచ్ఛనొసంగిరి.

(2)

ఆకాలమున, యూరపుఖండమున ఇంగ్లాండు, ఫ్రాన్సు ఇంగ్లీషు పరాసుదేశ దేశములు ప్రధానములుగనుండెను. 1337 సం॥ములమధ్య నూరుసం నుండియు సిరెండు దేశములకును మధ్యమధ్య వత్సరములయుద్ధము. కొద్ది విరామములతో నూరు సంవత్సరముల

కాలము యుద్ధము జరిగెను. పరాసురాజగు నాలుగవ ఫిలిప్పు యొక్క ముగ్గురు కొమాళ్ళును నిస్సంతతిగా చనిపోయిరి. ఇంగ్లాండుదేశపురాజగు మూడవ ఎడ్వర్డు నాలుగవ ఫిలిప్పు రాజుయొక్క కూతురి కుమారుడు గావున ఫ్రాన్సు రాజ్యము తనకు రావలె ననెను. ఫ్రాన్సుదేశపు రాజుల ఆచారప్రకారము స్త్రీలగుండ స్థిరాస్తిసంక్రమణలేదని చెప్పి నాలుగవ ఫిలిప్పుయొక్క తమ్మునికుమారుడగు ఆరవఫిలిప్పు ఫ్రాన్సుసింహాసనము నధిష్ఠించెను. ఇంగ్లాండురాజగు ఎడ్వర్డు ఫ్రాన్సుపై దండెత్తెను. విదేశీయుడగు ఇంగ్లాండురాజును తమపై పాలనము చేయకుండ చేయవలెనని ఫ్రెంచివారి యుద్దేశ్యము. ప్రథమమున కొంతకాల మింగ్లీషువారికి జయములు కలిగెను. 1346 సంవత్సరమున క్రెస్సీవద్ద జరిగిన గొప్పయుద్ధములో ఇంగ్లీషువారు సంపూర్ణముగ జయమొందిరి. కేలేయను రేవు పట్టణము ఇంగ్లీషువారికి స్వాధీనమయ్యెను. ఇంగ్లాండులో ఘోర మగుప్లేగు వ్యాపించినందున కొంతకాలము యుద్ధము ఆగినది. తిరిగి 1356 సంవత్సరమున ఇంగ్లీషురాజుకుమారుడు ఫ్రాన్సులో గొప్ప సేనలతో ప్రవేశించి పాయిటీర్సువద్ద ఫ్రెంచిసేనల నోడించి అప్పటి పరాసురాజగు "జాన్"ను ఖయిదీగ పట్టుకొనెను. 1360 సంవత్సరమున సంధిజరిగెను. ఎడ్వర్డురాజుకు సంపూర్ణహక్కులతో పరాసుదేశములోని అక్విటైను రాష్ట్రమును, కెలేపట్టణమును ఇచ్చిరి. ఎడ్వర్డు పరాసుదేశపు రాజ్యమునకు హక్కును వదలుకొనెను.

పరాసురాజు "జాన్" చనిపోయినందున ఆయన కుమారుడగు అయిదవ చార్లెసు రాజ్యమునకు వచ్చెను. తిరిగి యుద్ధమును ప్రారంభించెను. 1372 సంవత్సరమున లా రొషేలువద్ద నింగ్లీషునౌకలను పరాసునౌకాదళ మోడించెను. 1377 సంవత్సరమున ఇంగ్లాండులో మూడవ ఎడ్వర్డురాజు చనిపోయెను. అప్పటికి ఫ్రాన్సులో కెలే మొదలగు కొన్ని పట్టణములు తప్ప మిగిలిన ఆంగ్లేయరాజునకుండిన రాజ్యమంతయు పరాసురాజు తిరిగి స్వాధీనపఱచుకొనెను. యుద్ధమువలన పరాసుదేశమునకు మితిలేని నష్టముగలిగెను. యుద్ధకాలమున ఆంగ్లేయ సేనలు పరాసు ప్రజలను దోచుకొని, ఇండ్లు తగులబెట్టి, దేశమును నాశనము చేయుచుండెను. పరాసురాజులు, ప్రభువుల సైన్యములు చాలక జీతములిచ్చి సైనికదళముల నేర్పరచుకొనిరి. యుద్ధములేనపుడీ సైనికులు దేశములో దోపిళ్ళు, హత్యలు జరుపుచుండిరి.

అయిదవ చార్లెసు చనిపోవునరికి ఆయన కుమారుడగు ఆరవ చార్లెసుకు పదునొకొండు సంవత్సరముల వయసుండెను. ఫ్రాన్సులో ఎటులనో రాజునకు యుక్తవయస్సు వచ్చువరకును అంతర్యుద్ధము. పాలనముజరిగెను. యుక్తవయస్సురాగనే రాజుకు పిచ్చియెత్తెను. ఆయనపేరట పరాసుదేశము నెవరుపాలించవలెనను విషయమున రాజబంధువులగు పరాసు ప్రభువులమధ్య కలతలేర్పడెను. బర్గండీప్రభువు తాను పాలించవలెననియు, ఆర్మగునాకు ప్రభువు తాను పాలించవలెననియు తగవులు పడి వారు కొందరిని, వీరు కొందరిని చేర్చుకొని దేశమును

రెండుకక్షులుగా విభజించి యుద్ధములు చేయుచుండిరి. ఈస్థితిని కనిపెట్టి 1413 సంవత్సరమున ఆంగ్లేయరాజగు అయిదవ హెన్రీ పరాసుదేశముపై దండెత్తెను. 1415 వ సంవత్సరమున ఎజినుకోర్టువద్ద జరిగిన గొప్పయుద్ధములో ఆంగ్లేయులచే పరాసుసేనలు పూర్తిగ నోడించబడెను. ఫ్రాన్సులోని అంతర్యుద్ధ మెక్కువయ్యెను. ఒక కక్షిదారగు బర్గండీప్రభువు ఆంగేయరాజుతో చేరెను. ఆంగ్లేయరాజుపని మంచిదయ్యెను. 1418 వ సంవత్సరమున ఆంగ్లేయరాజు నార్మండీరాష్ట్రమును జయించెను. పరాసురాజపక్షమువారు చేయునదిలేక ఆంగ్లేయరాజగు హెన్రీతో సంధిచేసికొనిరి. హెన్రీ పరాసురాజుయొక్క కూతురిని వివాహమాడునట్లును, రాజుయొక్క జీవితకాలములో పరాసుదేశము నాయనపేరున పాలించునట్లును 1420 సంవత్సరమున సంధిచేసికొనిరి. మరుసటి సంవత్సరము హెన్రీ పారిసుపట్టణమున ప్రవేశించెను. కాని 1422 సంవత్సరమున హెన్రీ చనిపోయెను. ఆసంవత్సరమే పరాసుదేశపు సిచ్చిరాజుకూడ మరణించెను. ఆయన కుమారుడగు ఏడవచార్లెసు పరాసుదేశమునకు రాజయ్యెను.

ఇంగ్లీషువారితో యుద్ధము జరుగుచునేయుండెను. ఇంగ్లీషువారే జయముల నొందుచుండిరి. పరాసుదేశములో ఉత్తర భాగము నంతను ఆక్రమించుకొనిరి. 1428 సంవత్సరమున ఆంగ్లేయసేనలును, బర్గండిప్రభుసేనలును కలిసి పరాసుదేశములోని దక్షిణభాగమునకు ముఖ్యమయినదగు అర్లియన్సుపట్టణమును ముట్టడించిరి. ఈపట్టణము

ఆర్లియన్సు ముట్టడి.

శత్రువుల చేతిలో పడిపోవుటకు సిద్ధమగుచుండెను. ఇది పడినచో పరాసురాజు పరాసుదేశమును విడిచి పారిపోవలసినదే.

(3)

ఇట్టిస్థితిలో విదేశీయులగు ఆంగ్లేయులనుండియు, దేశద్రోహులగు బర్గండీయులనుండియు పరాసుదేశమును రక్షిం జోన్ ఆఫ్ చుటకు ఒక యువతి బయలుదేరెను. ఈమెపేరు ఆర్క్. జోన్ ఆఫ్ ఆర్కు. ఆమె డెమ్రీ అను గ్రామములోని యొక వ్యవసాయకునికూతురు. ఆమె కప్పటికి పందొమ్మిది సంవత్సరముల వయస్సు. మిగుల సాధువు. పవిత్రహృదయురాలు. గొప్పభక్తురాలు. విదేశీయులు తన దేశీయులను గావించుచున్న హత్యలకథలను వినుచుండుట వలన ఆమెకు హృదయవేదన కలిగెను. తన దేశపురాజగు పదవచార్లెసుయొక్క దీనస్థితిని వినినకొలదియు ఆమె వేదన హెచ్చెను. ఎల్లపుడును దేవాలయములోను, అడవులలోను, తోటలలోను నొంటరిగా ఆమె తన దేశవిముక్తికొరకును, తన రాజునకు జయము కలుగవలెననియు ప్రార్థించుచుండెను. క్రైస్తవమహాత్ములు ధర్మయుద్ధములో పరాసు సేనలకు జయముకలుగజేయుటకై పోరను ఆశ ఆమెమనసులో నుండెను. పగలును రాత్రియు ఆమె కదియే పరితాపము. ఆమెహృదయము దేశాభిమానముతోడను, హింసింపబడుచున్నవారియందు కరుణారసముతోడను నిండియుండెను. ఒక్కరో జొక మధ్యాహ్న మొక దివ్యస్వరూప మామెకు గనబడి "జోన్! బయలుదేరుము. పరాసుదేశపురాజును రక్షింపుము. ఆయనరాజ్యము నాయనకిమ్ము." అని చెప్పినట్లు విన

బడెను. ఆమె భయపడి "అయ్యా! నేను బీదదాననగు యువతిని. యుద్ధములను నడిపించుట నాకెటుల సాధ్యమగును?" అని జవాబుచెప్పెను. "మహాత్ములగు సెంటు కాథరిన్, సెంటు మార్గరెటులు నీకు సహాయము చేతురు లెమ్ము." అని యాదివ్య స్వరూపము అదృశ్యమయ్యెను. ఇటుల అనేకసార్లు ఆమెకు మహాత్ములు ప్రత్యక్షమగుటయు "లెమ్ము, దేశమును సంరక్షింపుము. విదేశీయులను వెడలగొట్టుము. నీ రాజునకు జయము నిమ్ము" అని చెప్పుటయు ఆమె వినుచుండెను. ఆమెయొక్క పరితాపము హెచ్చెను. ఈ మహాత్కార్యమును చేయుటకే తాను జన్మించెనని ఆమెకు తోచుచుండెను. ఆమెతండ్రికీసంగతి తెలుపగా ఆమె సైనికులతోకూడ వెళ్లుట కాయన సమ్మతించలేదు. ఆమె పినతండ్రియింటికి వెళ్ళినది. ఈయుదంతమంతయు చెప్పినది. ఆయన అచటి సైనికాధికారి కీవృత్తాంతమెరింగించెను. సైనికాధికారి యిట్టి ఉన్మత్తురాలిని తనయొద్దకు పంపవలదని చెప్పెను. ఆమె తాను నడచియైన పోయి రాజదర్శనము చేసితీరవలెనని నిశ్చయించెను. ప్రజలామెపట్టుదలకు ఆశ్చర్యమును పొందిరి. ఆమె రాజదర్శనము చేయుటకు సైనికాధికారి అంగీకరించునటుల చేసిరి. ఆమె వెంట్రుకలను కత్తిరించి పురుషవేషమును ధరించి గుఱ్ఱమునెక్కి కత్తిని చేతిధరించి బయలుదేరెను. ఆరుగురు చక్రరక్షకులతో రాజదర్శనమునకై శత్రువులున్న ప్రదేశములను దాటిపోవలసి వచ్చెను. కూడనున్నవారి కామె ధైర్యమును చెప్పుచుండెను. "భయపడవలదు. భగవంతుడు వస్నికార్యమునకై నియో

గించినాడు” అని చెప్పెను. 24 ఫిబ్రివరి తేదిన రాజుండిన షినాన్‌పట్టణమును చేరెను. రెండుదినము లామెకు దర్శన మియ్యవలెనా లేదాయని రాజు ఆలోచించెను. తుదకు దర్శన మిచ్చుటకు నిశ్చయించెను. ఆమె నిర్భయముగా రాజునొద్దకు వెళ్ళినది. మోకరించినది. “రాజకుమారుడా! నన్నేల విశ్వ సింపవు? భగవంతునికి నీపైనను నీప్రజలపైనను జాలికలిగినది. నామాట నమ్ముము. నీపూర్వులగు సెంటులూయీ, సెంటు షార్లమేనులు నీకొరకు భగవంతుని ప్రార్థించుచున్నారు. నీవు నాకు సైనికుల నిమ్ము. నేను ఆర్లియన్సుముట్టడిని వదలించి శత్రువులను వెళ్లగొట్టి బర్గండీరాష్ట్రములోని రైమ్సువద్ద నీకు కిరీటధారణము చేయించెదను. శత్రువులగు ఆంగ్లేయులు నీదేశమును వదలిపోవుట భగవదుద్దేశ్యమై యున్నది,” అని రాజుతో చెప్పినది. రాజుగాని, ఆయనతోకూడ నుండిన మత గురువులుగాని ఆమెమాటలు విశ్వసించలేదు. అనేకప్రశ్నలు వేసిరి. ఆమె అన్నిటికిని సమాధానము చెప్పినది. అద్భుత ములుచేసి చూపమని వారు కోరిరి. “నాచేతకాదు. నేను ఒక అద్భుతముమాత్రమే చేసి చూపించెదను. నాకు సైన్యముల నిచ్చినచో ఆర్లియన్సునుండి శత్రువులను వెడలగొట్టెదను,” అని ఆమె చెప్పెను. ప్రజలు విశ్వసించిరి. ప్రజాభిప్రాయము ననుసరించి, రాజు ఆమె చెప్పినచొప్పున ఆమెతోకూడ సేన లను పంపుట కొప్పుకొనెను. 1429 సం॥న ఏప్రిల్ 29 వ తేదిన జోన్ ఆఫ్ ఆర్కు సేనలను వెంటగొని ఆర్లియన్సుపైకి వెడలెను. వరాసుసేనలు ప్రార్థనము సలిపిరి. తాము భగవ

దనుగ్రహమువలన జయించితీరెదమను దృఢవిశ్వాసము గలిగి యుండిరి. ఆమెపేరు విని దయ్యాలపోతనియు సైతానుయొక్క బలముచే తమ్మును నాశనముచేయుటకే వచ్చినదనియు ఆంగ్లేయ సైనికులు మిగుల భీతిఁజెందిరి. పరాసుసేనలు ఆమెయొక్క ప్రోత్సాహమువలన బహుసాహసముతో పోరాడి ఆంగ్లసేనల నోడించి ఆర్లియన్సులో ప్రవేశించిరి. లోపలనున్న ప్రజలుకూడ బయటికివచ్చి ఆంగ్లేయులను ముట్టడించిరి. మేనెల 8 వ తేదిన వారి సేనాధిపతులును చాలవరకు సైన్యములును హతులుకాగ ఆంగ్లేయులును, బర్గండీయులును మందుగుండుసామగ్రిని వదలి పారిపోయిరి. సేనలును ప్రజలును వారి వెంటనంటి చంపదలచిరిగాని, "వారిని పోనిండు; వారివెంటబడి చంపవలదు. ఈదినము సబ్బాతుదినము," అని జోను చెప్పినందున మానివైచిరి. మే 13 వ తేదిన ఆమె తిరిగి రాజును దర్శించి రైమ్సునకువచ్చి కిరీటధారణము గావింపుమని కోరెను. రైమ్సుకు రాజు బయలువెడలెను. త్రోవలో పేటేయివద్ద ఇంగ్లీషుసైన్యముల నోడించెను. ఇంగ్లీషుసైనికులలో చాలమంది హతులైరి. వారి సేనానులు పరాసువారిచే ఖయిదుచేయబడిరి. ఆప్రాంతము లన్నియు పరాసురాజుస్వాధీన మయ్యెను. ట్రాయిసు, పాలాన్సు పట్టణములు పరాసురాజువశ మయ్యెను. ప్రతిచోటను ప్రజ లామెనను ఆదరించిరి. తుదకు జులై 13 వ తేదిన జయప్రదముగా రాజు రైమ్సునుచేరెను. అది బర్గండిరాష్ట్రములోనిది. అచటి ప్రజలుకూడ పరాసురాజుకు లొంగిరి. జులై 17 వ తేదిన పరాసురాజగు ఏడవచార్లెసు పట్టాభిషిక్తుడై

కిరీటధారణము గావించెను. జోను తనకు భగవంతునిచే నియమింపబడిన కార్యమును ముగించెను. తన స్వగ్రామము నకుపోయి తన తండ్రియొక్క మేకలమందలను కాచుకొనెద నని చెప్పెను. కాని ఇంకను పరాసుదేశములో చాలభాగము ఆంగ్లేయులక్రింద నున్నదిగావున ఇంకను కొంతకాల మాగవల యునని రాజుకోరెను. ఆమె తక్షణమే పారిసుమీదికి వెడలుదు మని చెప్పెను. కాని రాజుయొక్క సలహాదారు లట్టిపని చేయు టకు ధైర్యముచాలక పారిసు చుట్టుపట్లనున్న చిన్నప్రదేశ ములను ముందుగా జయించ నిశ్చయించిరి. ఈప్రాంతము లన్నియు పరాసువారికి లోబడెను. పారిసును వీరు చేరుసరికి శత్రువులు పారిసులో బాగుగా స్థావరమేర్పరచుకొని పారిసు ప్రజలను తమవైపుకు త్రిప్పుకొనిరి. పరాసుసైన్యములు పారి సును ముట్టడిసల్పెను గాని నిష్ప్రయోజకమయ్యెను. బర్గండీ ప్రభువు కాంపైన్‌ను ముట్టడించెను. దీనిని జోను సంరక్షింప యత్నించెను. 1430 వ సంవత్సరము మేనెల 30 వ తేదీన ఆమె దీని దర్వాజాబయటకు వచ్చి యుద్ధము చేయించుచుం డెను. ఇంతలో దర్వాజా లోపలనుండి మూయబడెను. ఆమె శత్రువులమధ్య చిక్కెను. బర్గండీవా రామెను పట్టుకొనిపోయి పదివేలఫ్రాంకులకు ఇంగ్లీషువారి కమ్మివేసిరి. ఇంగ్లీషువా రామెను ఖైదులోవేసి తమకు లోబడిన ముగ్గురు పరాసుమత గురువులచేత విచారణచేయించిరి. పురుషులబట్టలు ధరించుట యు, తల్లిదండ్రుల అనుమతిలేక యుద్ధమునకు వెడలుటయు, మహాత్ముల దర్శనమయినదని చెప్పుటయు, మతమునకు వ్యతి

లేకమని నేరారోపణచేసిరి. ఆమె నిర్దోషియని చూపుటకు అవ
కాశమియ్యలేదు. పోవుకు అప్పీలుచేసికొనుటకు అవకాశమియ్య
లేదు. ఆమె పురుషవేషము ధరించినది, ఆమె సైనికులనుండి
మానమును గాపాడుకొనుటకై యుండెను. తక్కినసంగతుల
కన్నిటికిని ఆమె సమాధానముచెప్పెను. న్యాయాధిపతులామె
ను ఎటులైనను శిక్షించుటకొరకయియే నామకః విచారణను
జరిపిరి. ఆమెను కైస్తవమతములో వదలిపెట్టెదమని వాగ్దత్త
ముచేసి, ఇంకటినుండియు పురుషవేషము వేయుననియు, తాను
యుద్ధములో ప్రవేశించననియు ఆమెచేత వ్రాయించుకొని,
యావజ్జీవ మామె ఖయిదులో నుండునట్లు న్యాయాధిపతులు
శిక్షవిధించిరి. ఆంగ్లేయులఖయిదులో ఆమె యుండెను. ఆంగ్లే
యులు యుద్ధములలో ఓడిపోవుచుండిరి. ఆమె బ్రతికియుండు
ట ఆంగ్లేయుల కిష్టములేదు. ఆంగ్లేయసైనికులామెకు చెర
సాలలో పురుషవస్త్రముల నిచ్చి బలవంతముగ స్త్రీవస్త్రములను
లాగికొనిరి. ఆమె యెంతచెప్పినను వినలేదు. నిస్సహాయురా
లగు ఆయబల పురుషవేషము వేయుకతప్పినదిగాదు. ఏబట్టలు
లేకుండ నాయువతి ఎట్లుండగలదు? విధిలేక పురుషవస్త్రముల
ధరించినది. పురుషవస్త్రములు తిరిగి ధరించినదని ఆమెవిూద
నాంగ్లేయులు నేరారోపణచేసిరి. యథార్థము న్యాయాధిపతుల
కు తెలియునుగాని శిక్షించకుండ న్యాయాధిపతులెటులు విడిచి
పెట్టగలరు? తిరిగి మతద్రోహి అయినది గావున ఆమెను మంటల
లోవేసి తగులబెట్టవలసినదని శిక్ష విధించిరి. ఈఘోరశిక్ష విన
గానే తనవలన నెట్టిలోపము లేనిదే ఇట్టి మతద్రోహియొక్క

నీచమైనమంటలలో మరణించుశిక్ష తనకియ్యబడినదని ఆదిక్కు లేని పందొమ్మిదివత్సరముల యీడుగల ఆడుబిడ్డ వెక్కి వెక్కి యేడ్చెను. తనకు శిరచ్ఛేదముచేసిన చాల మేలని రోదనము చేసెను. ఆమెకు దిక్కెవ్వరు? ఆమెను బండిలో వేసికొని 800 మంది ఆంగ్లేయసైనికులు ఆయుధపాణులై ఇరుప్రక్కలను నడువగ చేపలబజారునకు తీసికొనిపోయిరి. అచట నెత్తుగా పేరుపబడియున్న కట్టెలపై యామెను బడవేసి బంధించి నిప్పంటించిరి. ఆమెదైవమును ఏసుక్రీస్తు ప్రభువును ప్రార్థించుచు తన శత్రువులను క్షమించుచు మంటలోకాలి ఘోరమరణమును పొందెను.

(4)

ఆమెను చంపినతర్వాత ఆంగ్లేయు లపజయములవెంట నపజయముల నొందిరి. పరాసువారిలో ప్రతిచోటను విదే
ఇంగ్లీషు వారి శీయులగు నాంగ్లేయులనుండి తమదేశమును
అపజయములు. సంరక్షించవలెనను దేశాభిమానము పుట్టెను.
జోన్ ఆఫ్ ఆర్కును పరాసుప్రజలు దేశముకొరకై ఘోరమరణము నొందిన మహాత్మురాలిగ జ్ఞాపకముంచుకొనిరి. బర్గండీప్రభువు ఆంగ్లేయరాజునుండి చీలివచ్చి పరాసురాజుతో సంధిచేసికొనెను. ఆంగ్లేయులబలము క్షీణించెను. 1436 వ సంవత్సరమున ఏడవచార్లెను (పరాసురాజు) పారిసుపట్టణము నాక్రమించెను. 1439 వ సంవత్సరమున నార్మండీరాష్ట్రము ఆంగ్లేయులపై తిరుగబడగ పరాసురాజు తిరుగుబాటును ప్రోత్సహించెను. క్రమముగా పరాసుదేశములోని ఉత్తరభాగము నంతను పరాసువారు స్వాధీనముచేసికొనిరి. గ్వాయనీరాష్ట్రము

కూడ పరాసురాజుకు వశమయ్యెను. తుదకు 1453 సంవత్సరమున కాస్టలానునొద్ద జరిగిన యుద్ధముతో నూరు సంవత్సరములయుద్ధము ముగిసినది. ఈ యుద్ధములో పరాసురాజు సంపూర్ణముగా జయమొందెను. కెలే అను రేవుపట్టణముతప్ప మిగిలినయావత్తు ఫ్రాన్సు దేశమునుండియు ఆంగ్లేయులు వెళ్లగొట్టబడిరి. ఫ్రాన్సు దేశమంతయు పరాసురాజగు ఏడవచార్లెసు రాజుక్రిందికి వచ్చెను. ఈ నూరుసంవత్సరముల యుద్ధము అంతరించుసరికి పరాసు దేశములో రాజు బలవంతుడయ్యెను. దేశమునకంతయు ఆయన ముఖ్యుడయ్యెను. దేశములోని వర్తకులును ప్రజలును రాజుపక్షమున చేరిరి. ప్రజలయొక్క యిండ్లమీదను భూములమీదను టాలీయను పన్ను వేసి రాజు స్వంతపటాలములను సమకూర్చుకొనెను. ఈయుద్ధములలో అనేకులగు ప్రభువులు చనిపోయి కొన్ని ప్రభువంశము లంతరించెను. ప్రభువులబలము తగ్గెను.



సైరించి

# స్వాతంత్ర్య విజయము

---

ఆఱవ అధ్యాయము

## యూరపియనులు హిందూ దేశమునకు వచ్చుట

(1)

తురుష్కులు కాన్స్టాంటినోపిలును వశపఱచుకొనుట.

పదుమూడవ శతాబ్దమున ముసల్మానులలో ఆటోమాను తురుష్కులు ప్రాముఖ్యమును వహించిరి. వారి నాయకులు 1398 సంవత్సరమున సర్బియాను జయించి యూరపుఖండములో స్థావర మేర్పఱచుకొనిరి. 1453 సంవత్సరమున ముసల్మాను సుల్తానగు రెండవ మహమ్మదు కాన్స్టాంటినోపిలుపై దండెత్తెను. కాన్స్టాంటినోపిలు 4 వ క్రైస్తవ మతయుద్ధమునాటి నుండియు బలహీనముగనుండుట చూచియున్నాము. అపుడు

కాన్‌స్టాంటినోపిలును కాన్‌స్టాంటైను అను చక్రవర్తి పాలించు చుండెను. తురుష్కులు లక్ష యేబదివేలమంది సైనికులతో ముట్టడిసలిపిరి. కాన్‌స్టాంటైను చక్రవర్తియొద్ద పదివేలకన్న సైన్యములేదు. ముసల్మానులు ఫిరంగులతో గోడలను పడ గొట్టి పట్టణములో ప్రవేశించిరి. మే 29 వ తేదిన యుద్ధము లో కాన్‌స్టాంటైను చక్రవర్తి మరణించెను. కాన్‌స్టాంటినోపిలు తురుష్కులవశ మయ్యెను. అచటి సెంటుసోఫియా యను క్రైస్తవ దేవాలయము స్వాధీనముచేసికొని దానిలో ముస ల్మానులు మహమ్మదీయమతప్రకారము ప్రార్థనలు సలిపిరి.

(2)

పదునేనవ శతాబ్దముతో మధ్యమయుగము ముగిసి యూరపుఖండమున నవీనయుగము ప్రారంభమయినదని చరి త్రకారులు వ్రాసియున్నారు. ఆ శతాబ్దములో యూరపులో నవీన యుగప్రారంభము. యూరపుఖండములోని అన్నిదేశములలోను విద్యావ్యాపకము బాగుగా జరిగెను. అచ్చువేయుట కనిపెట్ట బడినది. ఒక్కొక్క గ్రంథమునకు ఎన్నివేలప్రతులైనను, బహు సులికగను త్వరితముగను అచ్చువలన తయారుచేయుటకు వీల య్యెను. ఇది జ్ఞానవ్యాపకమునకు మిగుల తోడ్పడినది. ప్రాచీననాగరికత కాలవాలమగు గ్రీసుదేశము ముసల్మా నులచే జయించబడుటవలన నాదేశములోని చాలమంది పండితులును, తత్వశాస్త్రజ్ఞులును ముసల్మానుల పాలనము క్రింద నుండుటకిష్టములేక ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లాండు, స్పయిన్ మొదలగు క్రైస్తవదేశముల కనేక ప్రాచీన

గ్రీకుగ్రంథరాజములతోఁకూడ వెళ్లి పాఠశాలలను స్థాపించిరి. కళాశాలలలో కొంద రాచార్యత్వమును వహించిరి. యూరపు ఖండములోని చాలదేశములలో ప్రాచీనగ్రీకులయొక్క విజ్ఞానమును పఠించసాగిరి. క్రీస్తు పుట్టకపూర్వము గ్రీసుదేశములో ప్రాచీనహిందూదేశములోనవలె, స్వతంత్రమైన భావములతో నిండిన వాఙ్మయము, నాగరికత, ప్రకృతిశాస్త్రములు ప్రబలియుండెను. క్రైస్తవమతము వచ్చినతర్వాత మతగురువుల ప్రాబల్య మధికమై స్వతంత్రభావములను నిర్మూలింపజేసిరి. ప్రకృతిశాస్త్రములు సైతానుయొక్క విద్యలని క్రైస్తవమతగురువులు నిరుత్సాహపఱచిరి. గొప్ప ప్రకృతిశాస్త్రజ్ఞులను మతగురువులు కారాగృహములలో పడవేయించిరి. మతగురువుల యాధిక్యతక్రింద మధ్యమయుగములో యూరపుఖండము మూఢమైననమ్మకలలోను, అంధకారములోను మునిగియుండెను. పదునేనవ శతాబ్దములో ప్రాచీన గ్రీకులనాగరికత, విజ్ఞానము వ్యాపించినకొలదియు యూరపుఖండమునకు మానసికవికాసము కలిగెను. మూఢవిశ్వాసములు కొంతవరకు తొలగనారంభించెను. హేతువాదన, యథార్థమును కనుగొనవలెనను సంకల్పము కలిగెను. మతస్వేచ్ఛను, క్రైస్తవమతములో సంస్కరణమును కొందరు వాంఛించిరి. ప్రకృతిశాస్త్రశోధనలు ప్రారంభమయ్యెను. స్వాతంత్ర్యాంకురములు మొలకలెత్తసాగెను. పదునేనవశతాబ్దమున నిటలీదేశమున సుప్రసిద్ధులగు చిత్రలేఖకులు బయలుదేరి కళలకును, చిత్తరువులకును, రంగులు

వేయుటకును నూతనజీవమును కలుగజేసిరి. వీరిలో ముఖ్యులు మైకల్ యేంజిలో, రాఫేల్ లు.

(3)

ఆదివరకనేకశతాబ్దములనుండియు యూరపుఖండమునకు ఆసియాఖండముతో వర్తకము సాగుచుండెను. హిందూహిందూదేశమునకు దేశములో, చైనాదేశములో తయారుచేయఁ (బ)డిన దూది, ఉన్ని, పట్టు వస్త్రములును, ఇతర పారిశ్రామికసరకులును యూరపుఖండములోని వివిధదేశములకు నెగుమతియగుచుండెను. ఆసియామైనరు, ఈజిప్టు, బాల్కన్ రాష్ట్రములు, గ్రీసుదేశములగుండ సరుకులు యూరపునకు రవానాయగుచుండెను. తురుష్కులీప్రదేశముల నన్నిటిని స్వాధీనమును పొందినతర్వాత క్రైస్తవులగు యూరపుదేశములవారికి తమ శత్రువులగు ముసల్మానురాజ్యముగుండ వ్యాపారము సాగించుట దుర్భరమయ్యెను. తురుష్కసుల్తానుగారి యనుగ్రహమును పొందుట కష్టతరమయ్యెను. కావున ఆసియాఖండములోని తూర్పుప్రాంతమునకు, ముఖ్యముగా హిందూదేశమునకు సముద్రములమీద ప్రయాణముచేయుటకు త్రోవలు కనిపెట్టుటకై యూరపులోని వివిధదేశములవారును యత్నములు సలిపిరి. ఆకాలమున హిందూదేశము వ్యవసాయమునకును, పరిశ్రమలకును, కళలకును, శాస్త్రములకును, వర్తకవ్యాపారములకును, నాగరికతకును ప్రసిద్ధిజెంది మిగుల నైశ్వర్యవంతమైనదై లోకములోకెల్ల నగ్రస్థానము వహించియున్నది. "భూతలస్వర్గ"మని

ఘొంచబడినట్టియు, "సువర్ణమయ"మైనట్టియు, "రత్నగర్భ" అయినట్టియు, "వరహాల వృక్షములు" కలిగినట్టియు హిందూదేశముతో వర్తకము చేసికొనుట గొప్ప యదృష్టమని యూరపువారు భావించిరి. హిందూదేశముయొక్క చెప్పనలవిగాని యైశ్వర్యము యూరపియన్ జాతుల నాకర్షించినది. ఎటులైన హిందూదేశమునకు నూతనమైన త్రోవలు కనుగొనవలెనని యూరపుజాతులవారు గొప్ప ప్రయత్నములను చేసిరి. హిందూదేశమును దరిద్రస్థితినుండి బాగుచేయుటకుగాని, అనాగరిక స్థితినుండి యుద్ధరించుటకుగాని యీదేశమునకు యూరపుఖండవాసులు రాలేదు. తమకన్న యెక్కువ నాగరికతనుచెంది మిగుల భాగ్యవంతముగనున్న యీదేశముతో వ్యాపారము చేసికొని, తాము బాగుపడి, తమ దేశములకు సొమ్ము తీసికొనిపోవుటకయియే యూరపియను (తెల్లవార) లిచటికి విచ్చేసిరి. ఇప్పుడు హిందూదేశము లోకములోకెల్ల దరిద్రవంతమైనదై క్షామదేవతకు శాశ్వతనివాసమైనది. పరిశ్రమలన్నియు నశించినవి. కళలు రూపుమాసినవి. పౌరుషము పూజ్యమైనది. ప్రకృతిశాస్త్రములు మంటగలిసినవి. విజ్ఞానము అడుగంటినది. హిందూదేశీయులు ప్రపంచములో ప్రతిచోటను నీచముగ చూడబడుచున్నారు. హిందూదేశముయొక్క "ఐశ్వర్యము," "రత్నములు," "సువర్ణము," "వరహాలు" పరదేశీయుల పాలైనవి.

సముద్రములమీద ఆసియాకు చేరుటకు త్రోవలకై తెల్లజాతులవారు ఆరువైపులనుండి వెదకిరి. హెన్రీరాకుమారుని నాయకత్వముక్రింద పోర్చుగీసువారు ఆఫ్రికా ఖండముయొక్క పశ్చిమతీరమున దక్షిణముగ చాలవరకు ప్రయాణముచేసిరి. కొంచెము కొంచెముగా అఫ్రికాఖండముయొక్క సంగతి వీరికి తెలియసాగెను. తుదకు 1486 సం॥మున డయ్యాజు అనువాడు ఆఫ్రికాఖండమునకు దక్షిణాగ్రమున నున్న గుడ్ హోప్ అగ్రమును చేరెను. ఇంకను ఆపైన కనుగొనవలసినది చాలగలదని తెలిసికొని వెనుకకు వెళ్ళెను.

ఆఫ్రికాను కనుగొనుట.

ఇటలీలోని జినోవాకాపురస్థుడగు క్రిస్టఫరు కొలంబసు సూటిగ అట్లాంటికు మహాసముద్రముగుండ పడమరగా ప్రయాణముచేసినచో ఆసియాకు చేరవచ్చునని నిశ్చయించెను. భూమి గుండ్రముగా నున్నదని కొలంబసునకు తెలియును. కాని యూరపుఖండమునుండి పడమరగా పోయినచో ఆసియాకును యూరపునకును మధ్య అమెరికా యున్నదని అప్పటి కెవరికిని తెలియదు. కొలంబసు చాలమార్లు అట్లాంటికుమహాసముద్రములో ప్రయాణము చేసి కొంతదూరముపోయి తిరిగి వచ్చుచుండెను. ఒకసారి ఐస్‌లాండుద్వీపమును జేరి మరలివచ్చెను. ఇతనియొద్ద దూరప్రయాణము చేయుటకు ద్రవ్యములేక చాలకాల మాగవలసివచ్చెను. తుదకు స్పెయినుదేశములోని రాజపోషణవలనను, కొందరు వర్తకులసహాయమువలనను 1492వ సంవత్సరమున కొలం

అమెరికాను కనుగొనుట.

బసు మూడు నౌకలతోడను, ఎనుబదియెనిమిదిమంది సహచరుల తోడను బయలుదేరి అట్లాంటికుమహాసముద్రమున సూటిగా, పడమరగా రెండు నెలలతొమ్మిదిరోజు లొకేవైపున నడిసముద్రములో ప్రయాణముచేసి అక్టోబరు 12 తేది యుదయమున స్పెయిన్ ప్రభుత్వపుపతాకములతో నౌక నూతనప్రపంచమున దిగెను. కాని అది హిందూదేశమువలె లేదు. హిందూదేశమునుగూర్చి తాను వినినలక్షణము లేవియు నచట కానరావు. తాను దిగినది ద్వీపములు. అక్కడ మోటువారు నివసించి యుండిరి. హిందూదేశములో నున్నటుల ఉత్కృష్టమగు నాగరికతచెందిన ప్రజ లచట లేరు. కావున నీ నూతనప్రదేశమునకు పశ్చిమయిండియా ద్వీపములని పేరిడెను. అచటిప్రజలు తామ్రవర్ణము గలవారు. వారికి నెఱ్ఱయిండియనులని పేరు వచ్చెను. ఇండియా (భరతవర్షము) కొరకు అన్వేషించుటలో నీ ప్రదేశమునకు చేరుటవలన దీనికి పశ్చిమఇండియా అనియు, ఇచటి ప్రజలకు నెఱ్ఱయిండియనులనియు పేర్లు పెట్టబడెను. కొలంబసు ఆద్వీపములను స్పెయిన్ రాజునకు ప్రతినిధిగా పాలించెను. ఇదియే అమెరికాఖండమునకు ప్రథమమున యూరపు ఖండవాసులు చేరుట. పశ్చిమఇండియాద్వీపములు అమెరికా ఖండములోచేరిన ద్వీపములు. స్పెయిన్ దేశమునుండి అనేకులీద్వీపములలోనేగాక అమెరికాఖండమునకును వలసవచ్చి నివసించిరి. అమెరికాయొక్క నూతనభాగములలో చేరుచు నాక్రమించుచు వచ్చిరి.

ఇంతలో పోర్చుగీసువాడగు వాస్కోడగామా 1498 వ సంవత్సరమున ఆఫ్రికాఖండముయొక్క దక్షిణభాగమునుచుట్టి హిందూదేశములోని పశ్చిమతీరముననున్న కళ్ళికోట చేరెను. ఈజిప్టు కుత్తరమున సూయజు కాలువ త్రవ్వబడువరకును యూరోపుఖండమునుండి ఆసియాకు వచ్చుటకు ఆఫ్రికాఖండమును చుట్టివచ్చుటయే ప్రధానమైన త్రోవగ నుండెను.

హిందూదేశము చేరుట

ఆసియానుచేరుటకు ఇంకను కొన్ని త్రోవలు కనుగొనుటకు మరికొందరు ప్రయత్నించిరి. రుష్యాలోని యుత్తరభాగముగుండ ఆసియాయొక్క యుత్తరభాగము చేరుటకు యత్నించిరి. ఇవి అతిశీతలప్రదేశమై మంచుగడ్డలతో కప్పబడి ప్రయోజనకారి కాలేదు. కొందరు ఉత్తరఅమెరికాకు పడమరగా బయలుదేరి కొంతవరకువచ్చి మరలిపోయిరి. ఇతరులు దక్షిణ అమెరికానుండియు, మరికొందరు పనామా జలసంధిగుండను పోవ యత్నించిరి. ఈ ప్రయత్నములు జయప్రదములు కాకపోయినను ఆఫ్రికా అమెరికా ఖండములలో చాలభాగము యూరపియనుజాతులకు బాగుగా తెలిసెను. పదునారవ శతాబ్దాంతమువరకును ఆస్ట్రేలియాతప్ప మిగిలిన అన్నిఖండములును యూరపియనులకు తెలిసెను.

(4)

యూరపియనుజాతుల వ్యాపకము.

యూరపియనుజాతులలో నూతనప్రదేశములను కనుగొనుటలోను, ఆక్రమించుటలోను వర్తకము చేసికొనుటలోను ముందంజవేసినవారు స్పెయినువారును, పోర్చుగీసువారును. వర్తకలాభముకొరకును, రాజ్యస్థాపనకొరకును వీరుభయులలో పోరాటములు కలి

గెను. ప్రధాన క్రైస్తవ మతాచార్యుడగు పోపు ఒక కాగితము మీద గీతగీచి అమెరికాలోని కేపువర్డులంకలకు పశ్చిమమంతయు స్పెయినువారికిని, తూర్పునున్న ప్రపంచమంతయు పోర్చుగలువారికిని పంచి యిచ్చెను. అమెరికా ఆఫ్రికాఖండములు కనుగొనబడినవి. ఆసియాఖండముతో సులభముగ వర్తకము చేయుటకు త్రోవలు కనుగొనబడినవి. ఆసియాలోని స్వదేశ రాజుల నాశ్రయించి కొన్ని సముద్రరేవులలో గిడ్డంగులు కట్టుకొని వ్యాపారము సాగించుచుండిరి. ఆసియాఖండముతో వర్తకమువలన చాలలాభము వచ్చుచుండెను. అమెరికా శీతోష్ణస్థితి యూరపియనులకు మిగుల అనుకూలముగ నుండెను. అమెరికాలోని భూములు, గనులు, అడవులు వీరి వశమయ్యెను. అక్కడ అడ్డులేక వీరు దేశము నాక్రమించుచుండిరి. అనేకులు వలసవెళ్ళి సౌఖ్యముగా నివసించుచుండిరి. బంగారముతోడను, మేలయిన సరకులతోడను నిండిన పడవలతో తమ దేశములకు వచ్చుచుండిరి. ఆఫ్రికాఖండములోని నల్లజాతుల వారిని పట్టుకొని బానిసలుగా విక్రయించుచు, బానిసవ్యాపారమువలన చాల ద్రవ్యమును సంపాదించుచుండిరి. ఇటుల స్పెయినువారును పోర్చుగీసువారును ముందు ప్రారంభించగ వారి యైశ్వర్యాభివృద్ధిని చూచి యేబదిసంవత్సరములలోపలనే డచ్చివారును, ఫరాసువారును, ఆంగ్లేయులును, నింక నితర యూరపియనుజాతులవారందరును బయలుదేరి వారి మార్గములనే యవలంబించిరి. పోపుగీచిన కాగితపుపంపిణిని గౌరవించినవా రెవరును లేరు. ఆసియాఖండముతో జరుగు వర్తక

లాభముకొఱకును, సముద్రములమీద ప్రయాణముచేయుట కు త్రోవలకొఱకును, అమెరికా, ఆఫ్రికాఖండముల ఆక్రమణ కొఱకును వివిధయూరపుజాతులవారికిని పోటీలుగలిగి అనేక యుద్ధములు జరిగినవి. ఈయుద్ధములలో నోడిపోయినవారి కీనూతనఖండములను కనిపెట్టుటవలన కలిగిన లాభములలో తక్కువగ లభించెను. గెలిచినవారి కెక్కువగ లభించెను. వీరి మధ్య సైనికబలముతప్ప ధర్మనిర్ణయముచేయుటకు వేరుఉపా యము లేదయ్యెను. అమెరికా ఆఫ్రికాఖండములు పూర్తిగా యూరపియనుజాతులచే నాక్రమింపబడినవి. ఆఫ్రికాకు నుత్తరమున నాగరికతనుచెందిన ముసల్మానుప్రజలు గలరు. వీరుగూడ స్వతంత్రమును గోల్పోయి యూరపియనుజాతులచే పాలించబడుచున్నారు. ఇదిగాక మిగిలిన యావత్తుఆఫ్రికాఖండ ములోను, యావత్తుఅమెరికాఖండములోను యూరపియను జాతులు వలసవచ్చి కాపురముండిరి. ఆప్రదేశములలో నది వరకు నివసించుచుండిన నల్లజాతులు చాలవరకు యూరపియ నులచే నాశనముచేయబడిరి. చావగ మిగిలిన కొద్దిమందిని యూరపియనులు తమక్రింద బానిసలుగ చేసికొనిరి. పందొ మ్మిదవ శతాబ్దమున బానిసత్వము రద్దుపరచబడెను. అటుత రువాత నీ నల్లవారు యూరపియనుల వ్యవసాయకభూముల లోను, తేయాకు, కాఫీ, రబ్బరు, చెఱకుతోటలలోను, గనుల లోను పనిచేయు కూలీలుగ నున్నారు. ప్రపంచముయొక్క వర్తకమంతయు క్రమముగా యూరపియనులవశ మయినది. యూరపుఖండములో తయారగు సరకులుప్రపంచములోని మకా

ణములను నింపివేయుచున్నవి. ఆసియాఖండములోని బౌద్ధదేశ ములు స్వతంత్రమును గోల్పోవక నిలిచియున్నవి. మసల్మాను దేశములు చాలకాలము స్వతంత్రముగ నున్నవిగాని 1919వ సంవత్సరములో జరిగిన సంధివలన ముసల్మాను దేశములలో కొన్ని యూరపియనుల యాజమాన్యము క్రిందికి వచ్చి స్వాతంత్ర్యముకొఱకై పోరాడుచున్నవి. ఆసియాలోని మధ్య దేశమగు హిందూదేశముమాత్రము మొగలాయిరాజ్య మస్తమించగనే కలిగిన అరాజకమువలన యూరపియనుల పాలనముక్రిందికి వచ్చినది. కొలదిసంవత్సరములనుండియు మేల్కొని స్వరాజ్యమునకై కృషిసలుపుచున్నది. ఆఫ్రికా దేశ ములోని ఈజిప్టుదేశముకూడ తెల్లవారి ప్రభుత్వమునుండి స్వాతంత్ర్యమును బొందుటకు ప్రయత్నించి కొంతవరకు జయ మును బొందినది.



# ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయము

## ఏడవ అధ్యాయము

## ప్రొటెస్టెంటు మతస్థాపనము

(1)

**రాజుయొక్క అధికారము.**

ఫ్రాన్సుదేశపురాజగు పదునొకండవ లూయిరాజు క్రింద పట్టణములు వృద్ధియయ్యెను. పరిశ్రమలు హెచ్చి ధనము అధికమయ్యెను. అచ్చువేయుటను రాజు ప్రోత్సహించెను. విద్య వ్యాపించెను. తెలివిగలిగినట్టియు, స్వతంత్రజీవనములు కలిగినట్టియు మధ్యమతరగతిప్రజాసంఘము వృద్ధిచెందెను. వీరు ప్రభువులయధికారమునందు విముఖులై రాజుయొక్క అధికారవృద్ధికి తోడ్పడిరి. రాష్ట్రములన్నిటిలోను రాజుయొక్క అధికారముక్రింద న్యాయస్థానములు స్థాపించబడెను. ప్రజలందరును వీనిలో తమ కష్టములను చెప్పుకొనవచ్చునను ఆచారము ఏర్పడెను.

పదునొకొండవలూయి తరువాత 8 వ హెన్రీ రాజ్యమునకు వచ్చెను. అప్పుడు ఇటలీదేశములోనున్న రాష్ట్రములు తమ

ఇటలీలో యుద్ధములు.

లో తాము పోరాడుచు, నొక రాష్ట్రమువారు ఫ్రెంచిరాజుయొక్క సహాయమును కోరిరి. ఎనిమిదవ హెన్రీ ఫ్రెంచిసేనలతో ఇటలీదేశముపై దండెత్తి కొన్ని రాష్ట్రముల నాక్రమించెను. ఫ్రెంచివారు బలవంతులగుట కిష్టములేక ఫ్రాన్సుకు వ్యతిరేకముగ స్పెయిన్ దేశపురాజును, ఆస్ట్రియాచక్రవర్తియు బయలుదేరి వచ్చిరి. ఫ్రాన్సురాజులగు ఎనిమిదవ హెన్రీ, పండ్రెండవలూయి, మొదటి ఫ్రాన్సిసు రాజులకాలమున ఇటలీలో ఫ్రాన్సుకును, ఆస్ట్రియా చక్రవర్తికిని, స్పెయిన్ రాజునకును యుద్ధములు జరిగెను. కొన్ని జయములపుడపుడు పొందినను ఫ్రెంచిరాజులే మొత్తముమీద నోడిపోయిరి. 1494 మొదలు 1559 సంవత్సరమువరకు ఈ యుద్ధములు కొద్ది విరామములతో జరుగుచుండెను. 1558 వ సంవత్సరమున పరాసుదేశములో ఇంగ్లీషువారికుండిన "కలే" పట్టణమును ఫ్రెంచివారు లాగికొనిరి. 1559 వ సంవత్సరమున ఇటలీలోని యుద్ధములు కాటుకేంబ్రిసిసుసంధివలన ముగిసెను. ఇందువలన ఫ్రాన్సునకు ఈశాన్యముననున్న మెట్జు, టూలు, వర్డన్ ప్రాంతములు వశముచేయబడెను. ఇటలీదేశము విదేశీయులపాలనముక్రిందికి వచ్చెను. స్పెయిన్ రాజుకు ఇటలీలోని కొన్ని ముఖ్యరాష్ట్రములు స్వాధీనమయ్యెను. కాని స్పెయిన్ కును, ఫ్రాన్సుకును మధ్య శాంతి కుదురలేదు. రెండు వందల సంవత్సరములవరకును స్పెయిన్ ఫ్రాన్సు దేశములు కలహించుచునే యుండెను.

(2)

మహామహుడగు మార్టిను లూథరు జర్మనీలో ప్రొటెస్టెంటు మతమును స్థాపించెను. యూరపుఖండములోని క్రైస్తవమతమున కంతకును రోములోనున్న పోపు ప్రధానమతాచార్యుడుగా నుండెను. పోపులేమి, మతగురువులేమి శాశ్వతబ్రహ్మచారులుగా నుండిరి. పోపులలో కొంద రింద్రియవ్యసనములలో చిక్కి మిగుల అవినీతిపరులుగ నుండిరి. తమ బంధువులకు విశేషముగ సహాయము చేయుచుండిరి. 1517 సంవత్సరమున పోపు పదియవలియో రోములో నొక గొప్ప దేవాలయము కట్టించుచుండెను. దానికి సొమ్ము కావలసియుండెను. పోపు, పాపములు క్షమించబడెననియు, స్వర్గద్వారములు తెరువబడుననియు వ్రాసి దస్కతు చేసి కాగితములు అమ్మకమునకై పంపెను. జర్మనీలో నీపాపక్షమాపణటికెట్లు నమ్ముచుండగా మార్టిన్ లూథరను జర్మన్ సర్వకళాశాలలోని పండితు డాక్షేపించి ఖండనమును వ్రాసెను. ఈటికెట్లు కొనినవారు ఎట్టిపాపములు చేసినను నరకభయములేదని భావించసాగిరి. ఇట్టి అవినీతికరమైన మూఢాభిప్రాయములను ప్రజలలో వ్యాపింపజేయుట పోపుయొక్క గొప్పతప్పిదమని వ్రాసెను. అప్పటికి క్రైస్తవమతములో ప్రబలియున్న ఇంకను కొన్ని మూఢనమ్మకములను, మతగురువులలో ప్రబలియున్న అవినీతినికూడ మార్టిన్ లూథరు ఖండించెను. పోపు మార్టిన్ లూథరును క్రైస్తవమతమునుండి వెలివేసెను. పోపుపంపిన బహిష్కారపత్రికను లూథరు తగులబెట్టెను.

ప్రొటెస్టెంటు మతస్థాపన.

లూథరు పోపుయొక్క అధికారమును తిరస్కారముచేసి క్రైస్తవమతములో సంస్కారమును బోధింపసాగెను. క్రైస్తవవేదముగు బైబిలును జర్మనుభాషలోనికి తర్జుమాచేసెను. అదివరకు దానిని లాటిన్ భాషలోనే ఉంచవలెననియు, ప్రజలు చదువుటకు హక్కులేదనియు నను నమ్మికలు వ్యాపించియుండెను. మత గురువులు మాత్రమే చదివి ప్రజలకు నర్థమును, వ్యాఖ్యానమును చెప్పుచుండిరి. లూథరు బైబిలును ప్రజలభాషలోనికి మార్చి ప్రతివారును దానిని స్వయముగా చదువుకొనవచ్చునని ప్రకటించెను. జర్మనుప్రజలు విదేశీయులగు పోపులయొక్క అధికారమును త్రోసివేసి తమ యిచ్ఛవచ్చిన యోగ్యతగలగురువుల నెన్నుకొనవలెనని బోధించెను. గురువులు వివాహమాడవచ్చునని శాసించెను. బైబిలులోనున్న వాక్యములే ప్రమాణములుగాని పోపులు వ్రాసినగ్రంథములును, వారు జారీచేసినయుత్తరువులును ప్రమాణములుకావని చెప్పెను. విగ్రహారాధన బైబిలుకు వ్యతిరేకమని ఖండించెను. ఈ బోధలు జర్మనీలో దేశాభిమానమును స్వాతంత్ర్యేచ్ఛను పురిగొలిపెను. మూఢవిశ్వాసములను బంధనములను త్రెంచివైచి ఆత్మస్వాతంత్ర్యమును స్థాపించెను. అనేకులు మార్టిన్ లూథరుయొక్క ప్రొటెస్టెంటుమతమును స్వీకరించుచువచ్చిరి. అపుడు జర్మనురాష్ట్రములను నిరంకుశముగ పాలించుచున్న అయిదవ ఛార్లెసుచక్రవర్తికి నూతనమతసంస్కరణమును, స్వతంత్రభావవ్యాపకమును కంటకముగ నుండెను. మార్టిన్ లూథరును చంప యత్నించెను. లూథరు చాలకాలము తనస్నేహితులగు

జర్మనీలోని శాక్సనీరాష్ట్రాధిపతియొక్క రక్షణార్థము దాగుకొనెను.

(3)

ఇంతటినుండియు క్రైస్తవమతములో రెండుశాఖ లేర్పడెను. ప్రాతదానికి రోమన్ కాథలిక్కు మతమనియు, నూతన సంస్కరణమునకు ప్రొటెస్టెంటుమతమనియు పేర్లువచ్చెను. 1542 వ సంవత్సరమున చార్లెసురాజు స్పెయిన్ దేశములో ప్రారంభమున ఇన్ క్విజిషన్ అని మతవిచారణశాఖ నేర్పరచెను. ఇట్టి మతవిచారణశాఖలు పోపుయొక్క యుత్తర్వుల ప్రకారము రోమనుకాథలిక్కు దేశములన్నిటిలో స్థాపించబడెను. ప్రొటెస్టెంటులను విచారణచేసి ఖండించి యెర్రగా కాలిన యినుపస్తంభమునకు కట్టివేసిగాని, మంటలో పడవేసిగాని, శిరచ్ఛేదము జేసిగాని చంపుచుండిరి. అనేకులు తమ మనస్సాక్షికొఱకై యిట్టి ఘోరమరణములను పొందుటకు సిద్ధపడిరి. ప్రొటెస్టెంటుమతము వ్యాపించినకొలదియు ప్రొటెస్టెంటులగు రాజులుకూడ తమ దేశములలోని రోమనుకాథలిక్కులగు ప్రజలను ఘోరశిక్షలకే పాలుచేసిరి. "ఈశ్వరుని నారాధించుటకు అనేకమార్గము లున్నవి: ఎవరిబుద్ధికి బాగుగనున్న మార్గమున వా రారాధించవచ్చును," అను ధర్మమును యూరపుఖండవాసులు చిరకాలమువఱకును గ్రహించలేదు. దేశములోని మతగురువులయొక్కయు రాజుయొక్కయు మతము గాక ఇతరమతము నవలంబించినవారికి మరణశిక్ష విధించుచు వచ్చిరి. రోమనుకాథలిక్కులు ప్రొటెస్టెంటులను, ప్రొటెస్టెంటులు రోమనుకాథలిక్కులను మతముపేరిట చంపుకొనిరి.

వీరి యుభయులమధ్యను అనేకయుద్ధములు జరిగెను. ప్రేమా స్వరూపుడును సాత్వికమూర్తియు నగు ఏసుక్రీస్తుపేర యూరపు ఖండములో మానవరక్తము వెల్లువలుగా పారెను.

స్పెయిన్ దేశము మహమ్మదీయులగు మూరుజాతివారిచే జయింపబడి పాలింపబడుట చూచియున్నాము. ఈమహమ్మదీ స్పెయిన్ యారాజులు దేశములో శాంతిని నెలకొలిపి స్వాతంత్ర్యము తమపాలనలోని క్రైస్తవప్రజలకు మతస్వేచ్ఛ నొసంగి కళలను, విద్యలను, ప్రకృతిశాస్త్రములను వృద్ధిచేసి గొప్పనాగరికతను స్థాపించిరి. కాని స్పెయిన్ దేశములోని క్రైస్త వులు మతావేశముచేతను, దేశాభిమానముచేతను విదేశీయులు ను, ఇతరమతస్థులును నగు మహమ్మదీయులను స్పెయిన్ నుండి వెళ్లగొట్టుటకు ప్రయత్నించిరి. 732 వ సంవత్సరము మొదలు 1492 వ సంవత్సరము వఱకును క్రైస్తవులకును మహమ్మదీ యులకును పోరాటములు జరిగి క్రమముగా దేశము క్రైస్తవుల వశమయ్యెను. 1492 వ సంవత్సరములో జరిగిన యుద్ధములో ముసల్మానులు పూర్తిగనోడిపోయి స్పెయిన్ దేశమునుండి వెడలగొట్టబడిరి. స్పెయిన్ దేశమున కంతకును ఇజబెల్లా రాణి యయ్యెను. ఈమెమనుమడగు అయిదవ చార్లెసురాజు ఆస్ట్రి యాకు చక్రవర్తియై యూరపుఖండమున ప్రధానుడగు రాజుగ నుండెను.

(౪)

హాలెండు స్వాతంత్ర్య పోరాటము.

ఈయన పాలనలోనున్న హాలెండు దేశములో ప్రొటెస్టెంటుమతము కడుశీఘ్రముగా వ్యాపించెను. దాదాపుగా ప్రజలందరును ప్రొటెస్టెంటుమతము నవలంబించిరి. ఈయనకుమారుడగు రెండవఫిలిప్పు రోమను కాథలిక్కుమతస్థుడై హాలెండులోని ప్రొటెస్టెంటుమతమును మిగుల క్రూరమగు పద్ధతులచే నిర్మూలముచేయుటకు యత్నించెను. ఆయన విధించిన కారాగృహశిక్షలకు మరణశిక్షలకు మితిలేదు. హాలెండుప్రజలు మతస్వేచ్ఛకును దేశస్వాతంత్ర్యమునకును 1572 వ సంవత్సరమున విలియం ఆఫ్ ఆరెంజ్ అను ధీరుని నాయకత్వముక్రింద స్పెయిన్ రాజుపై తిరుగుబాటుచేసిరి. ఈ స్వాతంత్ర్యకలహము నలువదిసంవత్సరములు జరిగెను. ప్రథమభాగములో ప్రతిపోటను స్పెయిను వారే గెలుచుచువచ్చిరి. వారోడించిన ప్రొటెస్టెంటు ప్రజలపై చూపిన క్రౌర్యమునకు మేరలేదు. నాలుకలు పీకించియు, కన్నులు పొడిచియు, చర్మము నొలిచియు, మంటలలో పడవైచియు ఇంక ననేకవిధములగు వర్ణనాతీతములగు చిత్రవధలను చేసిరి. హాలెండుప్రజలనాయకుడగు విలియం ఆఫ్ ఆరెంజియొక్క ప్రాణమును తీసినవానికి గొప్ప బహుమానమిత్తునని స్పెయినురాజు ప్రకటించెను. ఆయనను చంపుటకనేక ప్రయత్నములు జరిగి తుదకు 1584 వ సంవత్సరమున నొకడు తాను ప్రొటెస్టెంటునని నమ్మించి ఆయన దరిజేరి, ఆయనను

పొడిచి చంపెను. హాలెండుప్రజ లిన్ని కష్టములమధ్య సహనముతో పోరున్ను సాగించిరి. విలియంయొక్క కుమారుడగు మారిసు హాలెండుప్రజలకు నాయకత్వమును వహించెను. కొంతకాలమునకు స్పెయినుకు శత్రువులగు ఫ్రాన్సు, ఇంగ్లాండు రాజులు హాలెండుప్రజల సహాయమునకు వచ్చిరి. స్పెయినువారోడిపోయిరి. 1609 వ సంవత్సరమున స్పెయినురాజు హాలెండు ప్రజలస్వాతంత్ర్యము నంగీకరించి సంధిచేసికొనెను. ఈపోరాటములో హాలెండుప్రజలు స్పెయినువారికి పోటీగ పడవలను నిర్మించి సముద్రములమీద ప్రయాణములు చేసి ఆసియాతోను అమెరికాతోను వర్తకమునందు ప్రధానస్థానమును పొందిరి. స్పెయిననుండి స్వాతంత్ర్యమును పొందిన తరువాత హాలండులో రాజరికపుకక్షియు ప్రజాస్వామ్యకక్షియు నను రెండు కక్షలు కొంతకాలమువరకు తగవులాడి రాజరికపుకక్షవారు ప్రాబల్యమునుపొంది, విలియం ఆఫ్ ఆరెంజి వంశ్యులు స్టాడ్టుహోల్డరులనుపేరుతో నొకవిధమగు రాజులయిరి.

(5)

ఫ్రాన్సుదేశములో మత కలహములు.

ఫ్రాన్సుదేశమున రెండవ హెన్రీరాజు ప్రొటెస్టెంటు మతముపై నిర్బంధవిధాన మవలంబించి ప్రొటెస్టెంటులయిన వారిని చంపివేయుచు, ఆ మతము తన దేశములో వ్యాపించకుండ జేసెను. కాని ఫ్రాన్సుదేశములోనే కాల్విను అను మతసంస్కర్త బయలుదేరి ఫ్రెంచి భాషలోగ్రంథములనువ్రాసెను. ఫ్రెంచి ప్రజలలో సంస్కరణము వ్యాపించజొచ్చెను. పరాసుప్రభువులలో ననేకులీమతములో

చేరిరి. పరాసుదేశములోని దక్షిణపశ్చిమభాగములు రోమను కాథలిక్కు మతమును విడిచి నూతన మతము నవలంబించెను. ఇదికూడ ప్రొటెస్టెంటుమతములో శాఖయే. ప్రొటెస్టెంటుమతములో నెన్నియో శాఖలుగలవు. పరాసు దేశములో ప్రొటెస్టెంటుమత మింకను వ్యాపించియుండును గాని రోమనుకాథలిక్కు మతములో ననేకసంస్కరణలు జరిగి, వారి యారాధన, జీవితము ఎక్కువ స్వచ్ఛమయినదిగ చేయబడి, మూఢనమ్మికలు తోసివేయబడి ప్రజలను ప్రొటెస్టెంటు మతమునవలంబించకుండ నాకర్షించిరి. ఫ్రాన్సుదేశములోని యధిక సంఖ్యాకులగు ప్రజలు రోమనుకాథలిక్కులుగనే యుండిరి. రోమనుకాథలిక్కు లిప్పటికిని రోములోని పోపుయొక్క పీఠమునకు లోబడి విగ్రహారాధకులైయున్నారు. ప్రొటెస్టెంటుల నమ్మికలను బలవంతముగా నణచివేయు ప్రయత్నములవలన మనస్సాక్షికొరకు బాధల నొందువారియందు ప్రజలలో గౌరవముకలిగి ప్రొటెస్టెంటుమతము ఎక్కువగా వ్యాపించెను. ఇందుకుమారుగ రోమనుకాథలిక్కుమతములో సంస్కరణము నుగావించి యారాధనను, జీవితమును ఎక్కువయుత్కృష్టమయినదిగా చేయుటవలన మాత్రమే రోమనుకాథలిక్కుమతము సంరక్షింపబడి ప్రొటెస్టెంటుమతవ్యాపన యారంభఖండములో నరికట్టబడినది.

రెండవ హెన్రీ చనిపోయినతరువాత తొమ్మిదవ చార్లెసు రాజ్యమునకు వచ్చెను. ఈయన చిన్నవాడైనందున రాజమాతయగు కాథరిన్ డి మెడీసి పాలనముచేసెను. ఈకాల

మున బోర్బాక్ ప్రభువులు కాల్విన్‌మతస్థులుగను, గైజుప్రభువులు రోమనుకాథలిక్కులుగను నుండిరి. రాజుయొక్క ప్రధానమంత్రియగు లహాపిటలు మతసహానమును వహించి కొన్ని నిర్బంధములకులోబడి ప్రొటెస్టెంటుఆరాధన జరుగవచ్చునని శాసించెను. ఇది గైజుప్రభువున కిష్టములేదు. 1562 సంవత్సరము మార్చినెలలో తన సేనలతో బయలుదేరి వాసీయను చిన్న పట్టణమున జరుగుచున్న కాల్విన్‌మతస్థుల యారాధనను బలవంతముగా చెదరగొట్టి అనేకుల ప్రొటెస్టెంటులను వధించెను. ఇందుమీఁద ప్రొటెస్టెంటుల పక్షమున బోర్బాక్ ప్రభువులు కత్తిదూసిరి. ఇంక ననేకులు ప్రభువు లిరుపక్షములను చేరిరి. ముప్పదిసంవత్సరముల వరకును ఫరాసుదేశములో రోమనుకాథలిక్కులకును ప్రొటెస్టెంటులకును యుద్ధములు జరిగెను. చాలవరకు రోమనుకాథలిక్కులకే జయములుకలిగెను. ఇంగ్లండు, జర్మనీ, స్విట్జర్లెండుదేశముల పాలకులు ప్రొటెస్టెంటులకు సహాయమునంపగ స్పెయినురాజు రోమనుకాథలిక్కులకు సహాయముచేసెను. 1570 సంవత్సరమున నొకసంధి జరిగెను. ప్రొటెస్టెంటుమతము నిచ్చవచ్చినవా రవలంబించవచ్చునని సంధివలన నిర్ణయించబడెను. తొమ్మిదవ చార్లెసురాజు యుక్తవయస్కుడై ఈ అంతర్యుద్ధమువలన తన దేశము క్షీణించిపోవుచున్నదనియు తన శత్రువగు స్పెయినును అభివృద్ధి చెందుచున్నదనియు గ్రహించి తాను రోమనుకాథలిక్కు మతస్థుడయ్యును ప్రొటెస్టెంటులగు ఇంగ్లాండురాణితోను హాలెండుప్రజలతోను స్నేహముచేసి స్పెయినుయొక్క-

ప్త్యాపకమున కడ్డుకలుగజేయ యత్నించెను. ఈసంగతి రాజ
మాత కిష్టములేక తిరిగి మతయుద్ధము కల్పించు తలంపుతో
కొందరు రోమనుకాథలిక్కుప్రభువుల సహాయమున నామె
1572 సంవత్సరము 24 వ ఆగస్టు తేదిన రోమనుకాథలిక్కు
ప్రజల నావేశపరచి వారిచే పరాసుదేశములోని పదివేల
మంది ప్రొటెస్టెంటులను హత్యగావించినది. పరాసుదేశము
లోని ప్రొటెస్టెంటులకు "హ్యూజినాట్లు" అని పేరు. ప్రొటెస్టెం
ట్లు ఆత్మసంరక్షణకొఱకై తిరిగి యుద్ధము ప్రారంభించిరి. యుద్ధ
ములు సాగుచుండెను. తొమ్మిదవ చార్లెసు చనిపోయెను.
మూడవహెన్రీ రాజ్యము చేయుచుండెను. ఈయనకు సంతతి
లేదు. ఈయనతర్వాతవారసు ప్రొటెస్టెంటుకక్షికి నాయకు
డగు నావరుప్రభువగు హెన్రీ అయియుండెను. హెన్రీ వార
సుగాకుండ నుండుటకై రోమనుకాథలిక్కుకక్షివారు పట్టు
పట్టిరి. ఇందువలన యుద్ధము తీవ్రమయ్యెను. మూడవహెన్రీ
రాజు నొకమతగురువు పొడిచిచంపెను. తర్వాతవారసును, నావ
రుప్రభువును నగు హెన్రీ నాలుగవహెన్రీరాజను బిరుదమును
ధరించెను. ఈయన ప్రొటెస్టెంటుమతస్థుడగుటవలన రోమను
కాథలిక్కుప్రాన్సు ఈయనను రాజుగ నంగీకరించలేదు.
రెండు సంవత్సరములు తన సైన్యములతో రోమను కాథ
లిక్కులను జయించి లోబరచుకొన యత్నించెను. రోమను
కాథలిక్కులకు స్పెయినురాజు సహాయము చేయుచుండెను.
స్పెయినురాజు పరాసురాజ్యము నాశించెను. ఇంతలో 1593
సంవత్సరమున నాలుగవ హెన్రీ ప్రొటెస్టెంటుమతమును వదలి

రోమను కాథలిక్కు మతమును స్వీకరించెను. క్రమక్రమముగా ఫ్రాన్సుదేశమంతయు నీయనకు లోబడి ఈయనను రాజుగా గ్రహించెను. కాని పోపు అంగీకరించనిది ప్రయోజనము లేదు. 1595 సంవత్సరమున నాలుగవ హెన్రీ రోమునకు పోయి పోపుగారు విధించిన ప్రాయశ్చిత్తమును చేసికొని పోపుగారిచే రోమను కాథలిక్కుగ నంగీకరించబడెను. నాలుగవ హెన్రీ రోమనుకాథలిక్కగు స్పెయినురాజుతో సంధి చేసికొనెను. ఫరాసుదేశములోని ప్రొటెస్టెంటు లందరును ప్రభుమందిరములలోను కొన్ని పట్టణములలోను ఆరాధనను సలుపుకొనవచ్చుననియు, సర్వకళాశాలలలో చదువుకొనుటకును ప్రభుత్వోద్యోగములలో ప్రవేశించుటకును అర్హులనియు, 1598 సంవత్సరమున నాంటిసు ఈడిక్టు అను శాసనము గావించెను. ఇది శాశ్వతముగ నుండవలెననికూడ శాసించెను. ఇందువలన రోమనుకాథలిక్కుమతగురువులలో నసంతృప్తిగలిగి కొందరీయనను చంపయత్నించిరి. అట్టివారి నీయన దేశములోనుండి వెడలగొట్టెను. 1610 వ సంవత్సరమున జర్మనీలో ప్రొటెస్టెంటులకును రోమను కాథలిక్కులకును పోరాటము కలిగెను. ఈయన ప్రొటెస్టెంటులపక్షమున సైన్యములతో బయలుదేరి వెళ్లుచుండగా నొక రోమను కాథలిక్కుమతస్థుడీయనను పొడిచి చంపెను.

తరువాత పదునాలుగవలూయిరాజు 1685 వ సంవత్సరమున నాంటిసుశాసనమును రద్దుపరచి ప్రొటెస్టెంటుల దేవాలయములను పడగొట్టెను. వారి యాస్తులను స్వాధీన

ము చేసికొనెను. వారు ఎచటను ఆరాధన జరుపుకొనుటకు వీలు లేదని శాసించెను. నయముననో భయముననో చాల మందిని రోమను కాథలిక్కు మతములో చేర్చెను. మిగిలిన వేలకొలది ప్రొటెస్టెంటులు ఇంగ్లాండు, హాలండు, జర్మనీదేశములకు పారిపోయిరి. ఫ్రాన్సు దేశములో ప్రొటెస్టెంటుమతము లేకుండ చేయబడెను.

(6)

జర్మనీలో కొందరు రాష్ట్రాధిపతులు ప్రొటెస్టెంటులును, తక్కినవారు రోమను కాథలిక్కులును నయిరి. చక్రవర్తి రోమను కాథలిక్కు మతస్థుడై ప్రొటెస్టెంటు రాష్ట్రాధిపతులతో యుద్ధముచేయుచు వచ్చెను. కొంతకాలమువరకు సంధి జరిగెను. తిరిగి 1594 మొదలు 1624 వరకు ముప్పది సంవత్సరముల కాలము ఎడతెగక రోమను కాథలిక్కులకును ప్రొటెస్టెంటులకును తీవ్రమైన యుద్ధము జరిగెను. ఒకరినొకరు ఘోరవధలను గావించుకొనిరి. జర్మనీదేశ మీ యంతఃకలహములవలన మిగుల క్షీణించెను. (ఈ ముప్పది వత్సరముల యుద్ధమునుగూర్చి కొంచెము విస్తారముగా రెండవ సంపుటములో జర్మనీనిగూర్చిన అధ్యాయమున వ్రాయబడినది.)

జర్మనీలో ముప్పది సం॥ల యుద్ధము.

(7)

మతసంస్కరణమునందు ఇంగ్లాండు దేశము మూడవ త్రోవతొక్కినది. ఎనిమిదవ హెన్రీరాజు ప్రథమమున లూథరుయొక్క సంస్కరణములను ఖండించుచు ఇంగ్లాండులో మత స్వేచ్ఛ లేకుండుట. వ్రాయగా పోపు రాజును మెచ్చుకొనెను.

కాని కొలదికాలములో హెన్రీరాజుకు పోపుతో కలహము గలిగెను. హెన్రీరాజు తనభార్యయగు కాథరీను విసర్జించి వేరుస్త్రీని వివాహమాడదలచెను. కాథరీనుతోడ జరిగిన వివాహము విచ్ఛేదముచేయుమని పోపును కోరెను. పోపు సమ్మతించలేదు. అందుపై రాజు పోపునెదిరించి తనదేశముమీద పోపుకు అధికారము లేదనెను. రాజు తనదేశములోని క్రైస్తవ దేవాలయములలోని ఆరాధనలో కొన్ని సంస్కారణములను గావించెను. ఇంగ్లాండులోని మతగురువు లెవరును పోపుకు లోబడగూడదనియు, ఐహికవిషయములలోవలె మతవిషయములలోగూడ రాజే సర్వాధికారియనియు శాసించెను. తన దేశములోని ప్రధానమతాచార్యునిచే కాథరీనువివాహము విచ్ఛేదము గావించుకొనెను. ఇంగ్లాండులోని అనేకములగు రోమను కాథలిక్ మఠములను దోచుకొని వానిని నాశనము చేసెను. గొప్ప విద్వాంసులగు మూరు, ఫిషరు మొదలగు వారును పెక్కుమంది రోమను కాథలిక్‌లును పోపుకు బదులుగా రాజుయొక్క నిరంకుశాధికారమును మతవిషయములలో నంగీకరించనందున మరణశిక్షలకు లోనైరి. రాజు రోమనుకాథలిక్ మతమునుండి మారెనేగాని తనదేశములోని నూతన సంస్కారణములను లూథరుకాల్విను గార్ల సిద్ధాంతములతో పాటు చేయలేదు. 1539 వ సంవత్సరమున రాజు ఆరు సిద్ధాంతములను నందరును నమ్మితీరవలెననియు, అవి నమ్మని వారు మంటలలో పడవేసి చంపబడుదురనియు శాసించెను. అనేకులు మంటల కాహుతియైరి. మత గురువులు వివాహ మా

డరాదనికూడ శాసించెను. బైబిలును నింగ్లీషుతర్జుమా చేయించెను. ఈయన చేసిన యేర్పాటులు రోమను కాథలిక్కులకును ప్రొటెస్టెంటులకును అసంతృప్తి కలుగజేసెను.

ఈయనకుమారుడగు ఆరవ ఎడ్వర్డురాజుకాలమున ప్రొటెస్టెంటుమతము బాగుగ వ్యాపించినది. చాలవరకు తక్కిన దేశములలోని ప్రొటెస్టెంటుసిద్ధాంతము లమలులో పెట్టబడెను.

తరువాత రాణియైన మేరి దృఢమైన రోమను కాథలిక్కు అయి స్పెయిను రాజగు రెండవ ఫిలిప్పును వివాహమాడి ప్రొటెస్టెంటులను తండోపతండములుగ మంటలలో పడవేయించి చంపివేయించెను. ఈమెతరువాత రాజ్యమునకు వచ్చిన ఎలిజబెత్తు ప్రొటెస్టెంటు అయ్యెను. లూథరు, కాల్విను సిద్ధాంతములను పూర్తిగ నవలంబించని ప్రొటెస్టెంటుమతము యింగ్లాండులో స్థాపించబడినది. దీనికి చర్చి ఆఫ్ ఇంగ్లాండు అని పేరు. రాణిచేసిన యేర్పాట్లప్రకారముతప్ప వేఱువిధమైన యెట్టి ఆరాధనయు నింగ్లాండులో జరుగరాదని 1558 వ సంవత్సరమున శాసించినది. రాణిచే స్థాపించబడిన దేవాలయములకు రానివారికి గొప్ప జుల్మానాలు వేయబడెను. అనేకమంది రోమను కాథలిక్కులు చంపబడిరి. ఎవరినైనను రోమను కాథలికుమతములోనికి చేర్చుకొనినవారికి మరణశిక్ష విధింపబడెను. కొంతకాలమయిన తరువాత తీవ్రమగు ప్రొటెస్టెంటులుకూడ మరణశిక్షలకు లోనయిరి. ఐర్లాండులోని రోమను కాథలిక్కులను ఎలిజబెత్తురాణి పెట్టిన హింసలు, విధించిన

ఘోరశిక్షలు వర్ణనాతీతములు. ఎలిజబెత్తురాణి ఐర్లండులోని విశాలవంతమగు ప్రదేశములను అందలి ప్రజలను వెడలగొట్టి స్వాధీనమును పొంది ఇంగ్లీషుప్రముఖులకు కాపురముండుట కిచ్చెను. ఈమె 1603 వ సంవత్సరమున చనిపోయెను.

తరువాత రాజ్యమునకు వచ్చిన జేమ్సు, చార్లెసు రాజులకాలములో తీవ్రమగు సంస్కరణములు కోరిన ప్యూరిటనుశాఖ ఇంగ్లాండుదేశమునందు విశేషముగ వ్యాపించెను. కాని యీరాజులా మతశాఖ నణచివేయ యత్నించినందున కొంతమంది దేశమునువిడిచి పారిపోయిరి. కొంతకాలమునకు ప్రజలు చార్లెసురాజుపై తిరుగుబాటుచేసి యాయనను శిరచ్ఛేదము గావించిరి. తరువాత స్థాపింపబడిన ప్యూరిటను ప్రజాస్వామ్యమువారు రోమనుకాథలిక్కులను హింసించిరి. కొంతకాలమునకు తిరిగి రెండవ చార్లెసు రాజై ప్యూరిటను మతగురువుల నందఱను తీసివేసి రోమను కాథలిక్కులకు స్వేచ్ఛ నియ్య యత్నించెను. కాని పార్లమెంటువారు రోమను కాథలిక్కుగురువులు దేశమును వదలిపోవలెనని శాసించిరి. చర్చి ఆఫ్ ఇంగ్లాండు శాఖయొక్క ఆరాధనకు భిన్నమగు ఆరాధనను ఐదుగురికన్న నెక్కువమంది సలిపినచో వారిని ఖైదులో వేసెదమనికూడ శాసించిరి. అనేకమంది ప్రొటెస్టెంట్లు తమ మనస్సాక్షికొఱకు కారాగృహములకు జనిరి. కొందరు చెరసాలలలో మరణించిరి. ఎల్లిను అను సుప్రసిద్ధగ్రంథకర్త టాంటన్ జైలులో పడిన బాధలవలన మరణించెను. జాన్ బనియను అను గొప్పగ్రంథకర్త పండ్రెండుసంవత్సరములు చెరసాలలో

షించెను. ఆయన వెళ్ళినజైలు ఇట్టి మతబోధలుచేసినవారితో నిండెను. ఆయనభార్యయు పిల్లలు విశేషముగు దరిద్రబాధకు లోనైరి. ఆంగ్లేయభాషలో మిగుల సుప్రసిద్ధగ్రంథరాజముగు “పిలిగ్రిమ్సు ప్రొగ్రెస్సు”ను ఆయన చెరసాలలోనే వ్రాసెను. 1672 వ సంవత్సరమున రెండవ చార్లెసు రాజు చెరసాలలలో నున్నవారి నందరను విడుదలచేసి కొంత మతస్వేచ్ఛ కలుగ చేసెను. కాని ఆంగ్లేయపార్లమెంటువారు సర్కారుద్యోగములలోనుండు ప్రతివారును సర్వకళాశాలలో పట్టపరీక్షకు వెళ్లువారును చర్చి ఆఫ్ ఇంగ్లాండుశాఖకు చెందినట్లు ప్రమాణము చేయవలెనని శాసించిరి. ఇందువలన చాలమంది యుద్యోగములను పోగొట్టుకొనిరి. రోమనుకాథలిక్కులు ఆంగ్లేయ పార్లమెంటులో సభ్యులుగా నుండగూడదనియు, బహిరంగముగా ఆరాధనను జరుపగూడదనియు చట్టములు చేయబడెను. 1678 వ సంవత్సరమున కుట్రలు చేయుచున్నారను నేర మారోపింపబడి ఇంగ్లాండులోని రోమనుకాథలిక్కులందరును అరెస్టు చేయబడిరి. వారిలో చాలమందిని విచారించి మరణశిక్ష విధించిరి. రెండవ జేమ్సురాజు రోమనుకాథలిక్కుల కుద్యోగములిచ్చి వారిని బహిరంగముగా ఆరాధనను జరుపుకొననిచ్చినందున పార్లమెంటువారు ఆయనమీద తిరుగుబాటుచేసి దేశభ్రష్టునిగావించి హాలెండుదేశమునుండి విల్లియము అను ప్రొటెస్టెంటుమతస్థుని రాజుగా తెచ్చుకొనిరి. ఐర్లాండుదేశపు కాపురస్థులలో నూటికి ఎనుబదిమంది రోమనుకాథలిక్కులైనను, ఐర్లాండుదేశము ఆంగ్లేయులక్రిందికి వచ్చినదిమొదలు

రోమనుకాథలిక్కులకు ప్రభుత్వోద్యోగములు చేయుటకుగాని న్యాయవాదివృత్తి నవలంబించుటకుగాని పార్లమెంటుకు సభ్యుల నెన్నుకొనుటకుగాని పార్లమెంటుకు సభ్యులగుటకుగాని హక్కులులేకుండ చేయబడెను. 1868 వ సంవత్సరమున రోమనుకాథలిక్కులు మొదలగువారిమీద గల నిర్బంధములన్నియు తీసివేయబడి ఆంగ్లేయరాజ్యములో సంపూర్ణమగు మతస్వేచ్ఛ నెలకొలుపబడెను. కాని ఇప్పటికిని ఆంగ్లేయరాజు మాత్రము చర్చి ఆఫ్ ఇంగ్లాండు శాఖకు చెందిన ప్రొటెస్టెంటు క్రైస్తవుడుగా నుండితీరవలెను. హిందూదేశములో బ్రిటిషు ప్రభుత్వము స్థాపింపబడుసరికి యూరపుఖండమున మతయుద్ధములాగిపోయి మతస్వేచ్ఛ బాగుగ నెలకొలుపబడినది. ప్రభుత్వములు పౌరులమతవిశ్వాసములతోను ఆరాధనాపద్ధతులతోను జోక్యము కలుగజేసికొనుట మానివేసిరి.

(8)

హిందూదేశమున మతస్వాతంత్ర్యము.

అనాదికాలమునుండియు హిందూదేశమున సంపూర్ణమగు మతస్వేచ్ఛ యుండెను. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అనగ "భగవంతు డొక్కడు; ఆయనను పండితులు అనేకనామముల పిలిచెదరు," అనియు "ఆకాశా త్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం, సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అనగ "ఆకాశమునుండిపడిన యుదకమంతయు సముద్రముననే చేరునటుల, నేపేరున నారాధించినను ఆ యారాధనము ఒక్కడగు పరమాత్మనే చెందును," అనియు మొదలగు సిద్ధాంతములు హిందూదేశము

నందు అనాదికాలమునుండియు నేటివఱకును స్థిరముగా నాటుకొనియున్నవి. కావున హిందూదేశచరిత్రిలో నెప్పుడును మతముకొఱకైగాని మతముపేరగాని యెట్టియుద్ధములును జరిగియుండలేదు. అన్యమతావలంబులను యెట్టిహింసలకు నెప్పుడును లోబఱచియుండలేదు. ఎప్పుడును సమస్తమతనమ్మికలందును సమానమే చూపఁగాడెను. విదేశములనుండి యేయన్యమతస్థులు వచ్చినను హిందూదేశవాసులు ఆతిథ్యము నిచ్చిరి. తమతమదేశములలో మతస్వేచ్ఛలేక కష్టములపాలై ఇచట శరణుజొచ్చిన యూదులకును పారసీలకును హిందూమతల్లి సంరక్షణనిచ్చి తన బిడ్డలనుగా స్వీకరించియున్నది. క్రీస్తుశకము ప్రథమశతాబ్దములో హిందూదేశమునకు వచ్చిన క్రైస్తవులు పశ్చిమసముద్రతీరమున స్థిరనివాస మేర్పఱచుకొనిరి. శాంతముగను చుట్టుపట్టునున్న వారితో స్నేహముగను కాలము గడపుచు తమమతమును కూడ వ్యాపింపజేసికొని యున్నారు. ప్రాచీనహిందూదేశములోని మతస్వేచ్ఛనుగూర్చి హిందూదేశచరిత్రను వ్రాసిన విన్సెంటుస్మిత్తు "పూర్వకాలమున హిందూదేశమునందు మతనమ్మికలకొఱకై మనుష్యులను బాధలుపెట్టి యెఱుగరు. వివిధమతావలంబకులు స్నేహముగా కాపురముండుటయేగాక రాజులందరిని నిష్పక్షపాతముగా చూచి ఉద్యోగముల నిచ్చుచుండిరి" అని వ్రాసియున్నారు. క్రీస్తుకుపూర్వము మూఁడువందలసంవత్సరములక్రిందట హిందూదేశమును పాలించిన చంద్రగుప్తచక్రవర్తికాలమున వ్రాయబడిన అర్థశాస్త్రములో "రాజు క్రొత్తదేశమును సంపాదించినచో, అచటి

ప్రజలయొక్క మతనమ్మకలను ఆచారములను గౌరవించి వారి మతసంబంధమయిన పండుగలలో పాల్గొనవలెను" అని వ్రాయబడినది. క్రీస్తుపూర్వము 273 మొదలు 232 వరకు, భరతవర్షమును పాలించిన అశోకచక్రవర్తి ఇతరుల మతనమ్మకలతో సానుభూతియు సహనమును చూపుట మానవుని కుండవలసిన సద్గుణములలో నొకటియని చెప్పుచుండెడివాడు. తన రాజ్యమందంతటను తన పండ్రెండవ ఆజ్ఞను "మా ప్రజ లెవరును తమ యిరుగుపొరుగువారి మతమునుగూర్చి నీచముగా మాట్లాడగూడదు. మతములలోని తిప్పలలో నెట్టి భేదాభిప్రాయములున్నను, అన్నిమతములును మానవులు ఇంద్రియనిగ్రహమును, మనోనైర్మల్యమును పొందుట యను పరమావధిని గలిగియుండి ముఖ్యోద్దేశ్యములలో నేకీభవించుచున్న వను సంగతి జ్ఞాపకముంచుకొనవలెను" అని వ్రాయించి శిలాశాసనములమీద చెక్కించెను. హిందూరాజులేమి, బౌద్ధరాజులేమి అన్నిమతములవారికిని దానధర్మములు చేయుచుండిరి. "ఆకాలమున హిందూదేశములోని రాజులు తమ ప్రజలలో వ్యాపించియున్న మతవిశ్వాసముల నన్నిటిని గౌరవించుచుండెడివారు" అని 'బుల్లరు' అను చరిత్రకారుడు వ్రాసియున్నాడు. "ఇదియే ప్రాచీనహిందూరాజుల పద్ధతి" అని విన్సెంటుస్మిత్తు వ్రాసియున్నాడు. చైనాదేశమునుండి ఫాహియాను అను బౌద్ధయాత్రికుడు హిందూదేశమును దర్శించుటకు వచ్చినపుడు పాటలీపుత్రమునందు విక్రమాదిత్యుడను హిందూరాజు పాలించుచుండెను. "బౌద్ధులును జైనులును హిందువులలోని శైవ,

వైష్ణవ, సౌర, శాక్తేయ, గాణాపత్యాది వివిధశాఖలవారును మిగుల స్నేహభావముతో మెలగుచుండిరి. పూర్తియగు మతస్వేచ్ఛ మతసహనములు ప్రబలియుండెను” అని ఫాహియాను వ్రాసెను. క్రీస్తుశకప్రారంభమున హిందూదేశములోని చాలభాగము నేలినఆంధ్రరాజులు హిందువులైనను బౌద్ధమతమునుగూడ మిగులగౌరవించి బౌద్ధమత ప్రతిష్ఠాపనలకును చాల సహాయము జేసిరి. తరువాత రాజ్యమునకు వచ్చిన గుప్తరాజులు వైష్ణవులగు హిందువులయినను ఆకాలమునందుండిన హిందూ, బౌద్ధ, జైనమతములను సమానముగా జూచిరి. 606 వ సంవత్సరమున రాజ్యమునకువచ్చిన హర్షచక్రవర్తి బ్రాహ్మణులను, బౌద్ధభిక్షులను గూడ తన రాజ్యములోని పాఠశాలల కుపాధ్యాయులుగా నియమించెను. ఈయన బౌద్ధమఠములను హిందూదేవాలయములనుగూడ కట్టించెను. హర్షునితాత శివుని పూజించెను. హర్షునితండ్రి సూర్యుని పూజించెను. హర్షుడు శివుని, సూర్యుని, బుద్ధునికూడ పూజించెను. అప్పటికే పౌరాణికహిందూమతము దేశమున బాగుగ వ్యాపించెను. ప్రతిమానవుడును తన యిచ్చవచ్చినమతమును స్వీకరించి తన యిచ్చవచ్చినదైవము నారాధించుచుండెను. అందఱును సోదరభావముతో మెలగుచుండిరి. ఈ రాజు పాలించుచుండగా చైనాదేశమునుండి హూయాను త్సాంగను మఱియొక బౌద్ధయాత్రికుడు హిందూదేశమును దర్శించుటకు వచ్చెను. ఈరాజు క్రీస్తుశకము 643 వ సంవత్సరమున ప్రయాగలో నొక గొప్పమతసమావేశమును గావించి

అన్ని మతముల ప్రతినిధులను గౌరవించి హిందువులకును బౌద్ధులకును జైనులకును సమానముగ ధర్మములు చేయు టనుగూర్చియు ఆకాలమునందుండిన పూర్తియగు మతస్వేచ్ఛ నుగూర్చియు హూయనుత్సాంగు వర్ణించియున్నాడు. "హిందూ దేశములో బౌద్ధమతము క్షీణించుటకు కారణము, హిందూ రాజులు బౌద్ధులను హింసించి వెళ్లగొట్టుటవలన కాదనియు అట్టివి యేమియు హిందూదేశములో నెన్నడును జరుగనే లేదనియు హిందూమతములోనికి ముఖ్యమగు బౌద్ధమతసిద్ధాంతముల నన్నిటిని జేర్చుకొని హిందూమతమునకు నూతనవికాసమునిచ్చి బోధించుటవలననే బౌద్ధమతము క్రమముగ హిందూదేశమునందు క్షీణించి చాలవరకు బౌద్ధులు నూతన హిందూమతమును స్వీకరించి" రనియు విన్సెంటుస్మిత్తు వ్రాసి యున్నాడు. బౌద్ధమతమునుగూర్చి పెక్కుగ్రంథములు వ్రాసిన రైసుడేవిడు "హిందూదేశములోని బౌద్ధులను హిందువులు బాధపెట్టిరనునది యథార్థముకాదు" అని వ్రాసియున్నాడు. క్రీస్తుశకము 6 వ శతాబ్దములో మధ్యఆసియానుండి 'హూను' లను జాతివారు దండెత్తివచ్చి ఘూర్జరరాష్ట్రములోను, మధ్య హిందూదేశములోను రాజ్యములను స్థాపించగా వారి నందరిని హిందూమతములోనికి చేర్చుకొని రాజపుత్రులనుగా జేసిరి. వీరు సూర్యవంశమునుండియు, చంద్రవంశమునుండియు పుట్టినటుల కట్టుకథలనుగూడ నల్లిరి. ఇపుడు రాజపుత్రస్థానము నేలు రాజపుత్రులయొక్క పూర్వులు వీరే.

పూర్వకాలమున హిందూదేశములో పూర్తియగు మతస్వేచ్ఛ యుండినటుల హిందూదేశచరిత్రనుండి ప్రబల నిదర్శనములు చూపియున్నాము. ఇక మహమ్మదీయులకాలమున ఎటులనుండెనో నిష్పక్షపాత బుద్ధితో చూడవలసియున్నది. మహమ్మదీయ పాలనము హిందూదేశములో స్థాపించబడక పూర్వము హిందూదేశముపై దండెత్తి దోచుకొనిపోయిన మహమ్మదు గజనీనిబట్టియు, మొగలాయిరాజ్యము పడిపోయినతరువాత దండెత్తి హిందూముసల్మానులను హింసలుగావించి దోచుకొనిపోయిన నాదర్షానుబట్టియు, మహమ్మదీయపాలనమును విమర్శించగూడదు. ఇటులనే అరాజకకాలమున దేశమును దోచుకొన్న మరాటాదండులనుబట్టి శ్రీ శివాజీఛత్రపతి స్థాపించిన మహారాష్ట్రరాజ్యమును విమర్శించగూడదు. మహమ్మదు గజనీయు, నాదర్షాయు కేవలము దోపిడిగాండ్రు. రాజ్యస్థాపకులు కారు. మహమ్మదీయులు హిందూదేశములో పాలన మేర్పరచుకొనిన తరువాత హిందువుల మతవిశ్వాసములతోను, ఆరాధనలతోను జోక్యము పుచ్చుకొనలేదని గట్టిగా చెప్పవచ్చును. యూరపులోవలె మతముపేర నిర్బంధములుగాని, హత్యలుగాని, యుద్ధములుగాని ముసల్మానులపాలనమున జరుగలేదు. జరిగిన యుద్ధములు స్వమతవ్యాపకము కొఱకును పరమతనాశనముకొఱకును గాక, కేవలము రాజ్యా

మహమ్మదీయపాలనమున మత స్వేచ్ఛ

ఔరంగజేబుచక్రవర్తి చేసిన పొరబాటులకు ఫలితముగ ఛత్రపతిశివాజి, రాజపుత్రులు మొదలగు హిందూరాజులు తిరుగుబాటులు ప్రారంభించగా ఔరంగజేబుచక్రవర్తికాలములో బలహీనమయి ఆయన మరణించగనే మొగలాయిరాజ్య మస్తమించెను.

మొగలాయిరాజులకాలమున హిందూదేశము మతస్వేచ్ఛను శాంతిని ఐశ్వర్యమును అనుభవించి లోకములో కెల్ల నగ్రస్థానము వహించియుండెను. ఆకాలమున నీదేశములో ప్రబలియున్న పరిశ్రమలు, వర్తకము, ఐశ్వర్యము, సురక్షితము ధనార్జనముకొరకై యూరపుఖండవాసుల నిచటికి నాకర్షించెను. మఱియు హిందూమహమ్మదీయమతముల రెంటిలోను గల యుత్కృష్టమగు సిద్ధాంతములను సమన్వయముచేసి నూతనోద్యమములను ప్రతిష్ఠించిన కబీరు, నానకు, తుకారాం, చైతన్యుడు మొదలగు సంస్కర్తలు పెక్కుమంది బయలుదేరిరి. హిందూమహమ్మదీయనాగరికతలు గంగాయమునల విశుద్ధ ప్రవాహములవలె సమ్మేళనముచెంది భరతవర్షముయొక్క ఇతిహాసమునకు నూతనశోభను కలుగజేసెను.



# ఫ్రెంచి
# స్వాతంత్ర్య విజయము



## ఎనిమిదవ అధ్యాయము

## రాజుల నిరంకుశత్వము

(1)

రాజులు నిరంకుశులగుట.

ఫ్రాన్సుదేశపురాజగు నాల్గవహెన్రీ సమర్థుడు. ఫ్రాన్సులో గలిగిన అంతర్యుద్ధములు రాజులయొక్క అధికారమును బలపరచినవి. స్టేట్సుజనరలు (దేశప్రతినిధిసభ) ను తిరిగి సమకూర్చనేలేదు. దేశప్రముఖుల నప్పుడప్పుడు పిలిచి రాజు సలహా నందుచుండెను. ప్యారిసుపట్టణములోని (పార్లమెంటు) న్యాయాధిపతుల సంఘసభ్యులమీద నొక పన్నువేయబడి వారియధికారము వంశపారంపర్యమైనదిగా చేయబడెను. ఇందువలన వారు తమపదవికి రాజానుగ్రహమునకు లోబడక కొంతవఱకు స్వతంత్రులైరి. నాల్గవహెన్రీకి మంత్రియగు సల్లీ ఆర్థికవిషయములలో బహు సమర్థుడై రాజునకు సర్వవిధములను తోడుపడెను.

1610 వ సంవత్సరమున నాల్గవ హెన్రీ చంపబడినందున ఆయన కుమారుడగు పదునొకొండువత్సరముల వయస్సుగల

పదుమూడవ లూయి

పదుమూడవ లూయి రాజయ్యెను. రాజమాత యగు మేరి-డి-మెడిసి రాజ్యభారమును వహించెను. ఆమెపాలనము ప్రథమమున ప్రజానురంజకముగ లేదు. కాని 1624 వ సంవత్సరమున అదృష్టవశమున గొప్ప మేధావి యగు కార్డినల్ రిష్లూ ఆమెకు మంత్రిగా లభియించెను. ఇంతటినుండియు ఫ్రాన్సు దేశము యూరపుఖండములో ప్రధాన స్థానమును వహించెను.

1524 మొదలు 1642వ సంవత్సరమున ఆయన చనిపోవు వరకును రిష్లూ మంత్రిపుంగవుడు యూరపుఖండపు రాజ్యాంగపు

రిష్లూమంత్రి

వ్యవహారములలో ముఖ్యుడుగ నుండెను. ఈయనయుద్దేశ్యములు రెండు: ఫ్రాన్సులో ప్రభువులయొక్కయు, న్యాయాధిపతులయొక్కయు, హ్యూగెనాట్లయొక్కయు అధికారములను, పలుకుబడిని అణచివైచి రాజును నిరంకుశునిగ చేయుట ఒకయుద్దేశ్యము. ఫ్రాన్సుకు పోటిగనున్న ఆస్ట్రియా, స్పెయిన్ దేశములకు నష్టము కలుగజేసి ఫ్రాన్సుదేశమును యూరపుఖండములోకెల్ల నుత్కృష్టమైనదిగ జేయుట రెండవ యుద్దేశ్యము. ఈయన ఫ్రాన్సులోని ప్రొటెస్టెంటులగు హ్యూగెనాట్ల నోడించి వారిని రాజునకు లోబఱచి పిదప వారికి మతస్వేచ్ఛ నొసంగుట మనము పైన చూచియున్నాము.

ఫ్రాన్సులోని ప్రభువులతో నెప్పుడును రిష్లూ పోరాటములు సలుపుచునే యుండెను. వారిహక్కులను కొంతవఱకు లాగికొనుటకు ప్రయత్నించెను. కాని ప్రభువులు కొంతవఱకైనను నిలువబడి తమ హక్కులను నిలువబెట్టుకొనిరి. ఫరాసు దేశములో తుదివఱకును రాజుతో హక్కులలో పోటీపడదగినవారు ప్రభువులే. పెక్కుమార్లు రిష్లూమంత్రిని చంపుటకు కుట్రలు జరిగెను. రిష్లూమంత్రి రాజప్రతినిధులుగను రాజుయొక్క పెద్ద యుద్యోగులుగను ప్రభువులకు మారుగ సామాన్యప్రజలనుండి యేర్పరచెను.

స్టేట్సు జనరలు (దేశప్రతినిధి సభ)ను రిష్లూ పిలువనేలేదు. వీలయినపుడెల్ల రాష్ట్రములలోని ప్రతినిధిసభలను ద్రిసివేసెను. న్యాయాధిపతులను (పార్లమెంటు)న్యాయవిచారణ విషయములలోతప్ప మరి యేవిషయములలోను జోక్యము పుచ్చుకొనకుండచేసెను. అప్పుడప్పుడు రాజ్యములోని కొందరు ప్రముఖులతో మాత్రము రాజు సంప్రదించునట్లు చేసెను. రాజుయొక్క కార్యనిర్వాహకవర్గము బలపరచబడి అదియే రాజ్యభారమును వహించెను. రాజు నిరంకుశు డయ్యెను.

జర్మనీలో రోమను కాథలిక్కు మతస్థుడగు ఆస్ట్రియా చక్రవర్తికిని ప్రొటెస్టెంటుమతస్థులకును జరుగుచున్న ముప్పది సంవత్సరముల యుద్ధములో రిష్లూమంత్రి రోమనుకాథలిక్కు మతస్థుడయ్యును ఆస్ట్రియాకు వ్యతిరేకముగ ప్రొటెస్టెంటులతో చేరెను. జర్మనీలో ప్రొటెస్టెంటుమతము నిలుచుటకు రిష్లూ ముఖ్యకారకు డయ్యెను. రిష్లూమంత్రికి మత

భేదములకన్న దేశమే ప్రధానముగ నుండెను. పోర్చుగలువారు స్పెయినురాజుపై తిరుగబడునట్లుచేసి రిష్లూ పోర్చుగలుకు సహాయముచేసెను. ఈ యుద్ధములన్నిటిలోను పరాసువారే జయము పొందుచుండిరి. 1642 వ సంవత్సరమున రిష్లూ మరణించెను. అదివరకు రిష్లూక్రింద పనిచేయుచున్న కార్డినలు మెజరీను ప్రధానమంత్రియయ్యెను. ఈయనయును రిష్లూవంటి మేధావియు సుప్రసిద్ధరాజ్యాంగవేత్తయు నైయుండెను. విదేశవ్యవహారములలో రిష్లూయొక్క అడుగుజాడలనే నడచెను. తరువాత ఆరునెలలకే పదుమూడవలూయిరాజు మరణించెను. ఆయనకుమారుడగు పదునాల్గవలూయి రాజ్యమునకు వచ్చెను.

(2)

పదునాలుగవలూయి రాజగుసరికి ఐదుసంవత్సరముల యీడుగలదు. ఈయనకు యుక్తవయస్సు వచ్చువరకును

మెజరీను. (1643-1661) తల్లియగు ఆని ప్రభుత్వమును వహించెను. కార్డినలు మెజరీను ప్రభుత్వమును నడపెను.

ఇదివరకు జరుగుచుండిన ముప్పదిసంవత్సరములయుద్ధము యథాప్రకారము జరుపబడెను. ఇరువదియొక్క సంవత్సరములయీడుగల కాండిసేనాని పరాసుసేనలను నిపుణతతో నడిపి 1643 సంవత్సరమున స్పెయిను వారిననేకయుద్ధములలో నోడించి, జర్మను, ఆస్ట్రియను సైన్యములను తరిమివేసి, ఫ్లాండర్సును జయించి, డన్కర్కు నాక్రమించి, ఫ్రాన్సునకు ఘనతను చేకూర్చెను. 1648 మే నెలలో పరాసుసేనలు ఆస్ట్రియారాజధాని

యగు వియన్నాపట్టణమున ప్రవేశించగనే ఆస్ట్రియావారు సంధినికోరిరి. 1648 సం॥ అక్టోబరు 24 వ తేదీన వెస్టుఫాలియాసంధి జరిగి ముప్పదిసంవత్సరములయుద్ధము అంతరించినది. ఈ సంధివలన ఆస్ట్రియాచక్రవర్తియొక్క ప్రాముఖ్యత తగ్గిపోయి యూరపుఖండములోకెల్ల పరాసుదేశము మిగుల ప్రాముఖ్యతను పొందినది. ప్రొటెస్టెంటుమతస్థులకు మతస్వేచ్ఛ కలుగచేయబడెను. పరాసుదేశము ఇదివరకే స్వాధీనమున బొందియున్న లోరెను, ఆల్సేసు రాష్ట్రములందు హక్కును సంపాదించినది. రైనునదిని దాటి తూర్పున జర్మనీలోనికిని, ఆల్ప్సు పర్వతములను దాటి ఆగ్నేయమున ఇటలీలోనికిని పరాసుదేశపు సరిహద్దులు విస్తరింపచేయబడినవి. జర్మనురాష్ట్రముల వ్యవహారములలో ఫ్రాన్సునకు ప్రవేశము గలిగినది.

స్పెయిన్‌వారు వెస్టుఫాలియాసంధిలో చేరలేదు. మెజరీను ఇంగ్లాండులో నూతనముగ స్థాపించబడిన ప్రజాస్వామ్యమున కధ్యక్షుడగు క్రాంవెలుతో నొడంబడిక చేసికొనెను. ఆంగ్ల పరాసు సేనలు స్పెయిను వారి నోడించెను. 1658 నవంబరు నెలలో స్పెయిను దేశము సంధిని చేసికొనెను. పదునాలుగవ లూయిరాజు స్పెయిన్‌రాకుమార్తె ఇన్‌ఫాంటా మేరియా థెరీజాను వివాహమాడెను. ఆమె అయిదులక్షలక్రౌనుల కట్నమును తెచ్చెను. ఇందుకు ప్రతిఫలముగ తండ్రియొక్క స్పెయిను రాజ్యపు వారసత్వపుహక్కును వదలుకొనెను. స్పెయిన్‌రాజు పూర్తిగా కట్నమును చెల్లించనందున ఆమె వారసత్వపుహక్కును వదలుకొనిన ఒడంబడిక చెల్లదని 1659 సంవత్సరమున మెజరీను తెలియపరచెను.

స్పెయిన్ రాజ్యమును ఫ్రాన్సునకు సంక్రమింపచేయవలెనను సంకల్పముతోనే యీ వివాహమును జరిపెను. 1657 వ సంవత్సరమున ఆస్ట్రియాచక్రవర్తి మూడవ ఫర్డినాండు మరణించెను. పదునాలుగవలూయిని ఆపదవికి ఎన్నుకొనెదరేమో ననుఆశ మెజరీను కుండెనుగాని అట్లు జరుగక మొదటి లియోపాల్డు చక్రవర్తిగ నెన్నుకొనబడెను. జర్మనురాష్ట్రాధిపతులను చాలమందిని చేర్చి ఫరాసురాజుసంరక్షణక్రింద నుండునట్లు (లీగ్ ఆఫ్ది రైను) రైనుసంఘము నేర్పాటుచేసెను. ఇందువలన జర్మనీలోను, ఆస్ట్రియారాజ్యములోను ఫరాసుదేశమునకు మంచి పలుకుబడి యేర్పడినది.

మెజరీను రాజుపేర నిరంకుశముగ పాలించెను. లూయిరాజునకు నిరంకుశత్వమును నేర్పెను. దేశప్రతినిధిసభ (స్టేట్సుజనరలు) నెప్పుడును సమావేశపరచనేలేదు. ప్రభువుల కుద్యోగము లిచ్చియు గౌరవములిచ్చియు లోబరచుకొనెను. ప్యారిసులోని పార్లమెంటను పేరుగల న్యాయాధిపతులసంఘము వారు కొంత స్వతంత్రముగ పనిచేయ యత్నించగ మెజరీను వారిలో ముఖ్యులను చెరసాలకంపెను. న్యాయాధిపతులును, కొందరు ప్రభువులును తిరుగబాటుచేసిరి. 1649 లో రాజమాత పిల్లలతోకూడ ప్యారిసును వదలి పారిపోవలసివచ్చెను. కొంతకాలము తిరుగబాటుదారులు జయమును బొందిరి. మెజరీను దేశభ్రష్టుడయ్యెను. కాని కొలదికాలములో తిరుగబాటుదార్లలో నైకమత్యము చెడి మెజరీను దేశములోనికి తిరుగ వచ్చెను. తిరుగబాటును పూర్తిగ నణచెను. రాజుయొక్క నిరంకుశత్వమును

స్థిరపరచెను. తిరిగి మెట్టి అడ్డులేకుండ రాజుయొక్క నిరంకుశాధికారము 1789 వ సంవత్సరపు విప్లవమువరకును అప్రతిహతముగ సాగెను.

మెజరీను విదేశవ్యవహారములలో సమర్ధత చూపెనే గాని పరాసుదేశపుప్రభుత్వముయొక్క ఆర్థికస్థితిని బాగుచేయ లేదు. ఈయన మరణించుసరికి పరాసుదేశము నలువది మూడుకోట్లఋణములో నుండెను. అవివాహితుడగు మత గురువయినను ఈయన విశేషముగ ధనము నపహరించి, చని పోవునపుడు పదికోట్లధనమును తనబంధువులకు విడిచిపెట్టెను. ఈయనకాలమున నొక గొప్పగ్రంథాలయమును నొక సర్వకళా శాలయు, శిల్పము, చిత్తరువులు, చిత్రలేఖనము నేర్పు కళా శాలను స్థాపించెను. ఈయన 1661 సంవత్సరమున చని పోయెను.

(3)

పదునాలుగవ లూయి రాజ్యభారమును వహించుట

1661 సంవత్సరమున లూయిరాజు స్వయముగ రాజ్యా భారమును వహించినపుడు ఇరువదిమూడు సంవత్సరముల వయసు గలదు. మెజరీను మరణించగనే మంత్రులీయనవద్దకు వచ్చి ఇంతటనుంచి యెవరికి జవాబు చెప్పవలసియుండునని యడుగగా తన కేనని యాయన ప్రత్యుత్తర మిచ్చెను. దినమునకు ఎనిమిది గంటలకాలము రాజ్యపాలనసంబంధమగు కార్యములలో వినియోగించి ప్రతిపనిని తాను స్వయముగ చేయుచువచ్చెను. రాజే ముప్పది సంవత్సరములవరకు ప్రధానమంత్రిగ నుండెను.

కాల్బర్టుమంత్రి

కాల్బర్టు 1619 సంవత్సరమున నొకగొప్ప వర్తకులయింట జన్మించెను. పరాసుప్రభుత్వపుకొలువులో ప్రవేశించి మెజరీను క్రింద పనిచేయుచుండెను. మెజరీను కాల్బర్టు యొక్క సమర్థతను బాగుగ గ్రహించి చనిపోక ముందు రాజునకీతనిని మిగులసమర్థుడని వప్పగించెను. కాల్బర్టును రాజు 1661వ సంవత్సరముననే ముఖ్యమంత్రిగ జేసెను. కాల్బర్టు గొప్ప విద్వాంసుడు. బహుయోగ్యుడు. మిగులకష్టపడి పనిచేయువాడు, ఆర్థికవిషయములలో మిగులసమర్థుడు. కాల్బర్టునందు రాజునకుగూడ విశేషమగు నమ్మకము గౌరవము గలవు. ప్రభుత్వముయొక్క యార్థికదుస్థితిని తొలగించుటకు కాల్బర్టు కృషిసలిపెను. ప్రతి సంవత్సరమును ముందుగనే ప్రభుత్వముయొక్క ఆదాయవ్యయపట్టికను తయారుచేసి ఆదాయమునకు తగినట్టులే ఖర్చుచేయుచువచ్చెను. కాల్బర్టు మంత్రియైన 1661 వ సంవత్సరమున ఆదాయము 8½ కోట్లు. వ్యయము పదకొండుకోట్లు. ఈయన మరణించిన 1683 సంవత్సరమున ఆదాయము పదకొండు కోట్లు, వ్యయము తొమ్మిదికోట్లు నయ్యెను. పరాసుదేశముయొక్క వ్యవసాయాభివృద్ధికిని పారిశ్రామికాభివృద్ధికిని కాల్బర్టు విశేషముగ తోడ్పడెను. విదేశములనుండి దిగుమతియగు సరుకులమీద పన్నులువేసియు, దేశములోని నూతనపరిశ్రమలకు ధనసహాయముచేసియు, నిపుణులైన పారిశ్రామికులను పరాసుదేశమున కాకర్షించియు, పారిశ్రామికులమధ్య తగాదాలను పరిష్కరించుటకు పంచాయితీల నేర్పరచియు పెక్కువిధముల దేశీయపరిశ్రమలను సంరక్షించెను. రోడ్లు, కాలువలు నిర్మించెను. రేవు

లను కట్టించెను. పరాసుదేశముయొక్క ఉన్నిపరిశ్రమ, లోహపుపనులు, చర్మపుసరుకులు, జరీపనులు, తివాచీలు, పట్టు, గ్లాసు, పింగాణీసామాను మొదలగు ననేకవిధములగు పరిశ్రమలు మిక్కిలి వృద్ధిచెయ్యెను.

దేశములోని వర్తకమునేగాక సముద్రముమీద విదేశవర్తకమునుకూడ పెంపొందించెను. 1665 సంవత్సరమున సముద్రములమీద వర్తకమును వృద్ధిచేయుట కొరకు యువసంఘమును నియమించెను. దానికి ప్రతి పదునైదుదినములకు రాజు స్వయముగ నధ్యక్షతను వహించుచుండెను. ఆకాలమున డచ్చి (వలాందా) వారు సముద్రవర్తకమునందు మిక్కిలి ఖ్యాతి వహించియుండిరి. వారికి పదునారువేలనావ లుండెను. వానిమీద ప్రపంచములోని వివిధదేశములతోను వర్తకముచేయుచు మిగుల ధనికులై యుండిరి. పరాసుదేశమునకు ఆరువందలకన్న నెక్కువ ఓడలులేవు. డచ్చివారితో పరాసులు తులదూగునట్లు చేయవలెనని రాజును, కాల్బర్టును నిశ్చయించిరి. శీఘ్రముగ పెక్కుపడవలను నిర్మాణము గావించిరి. పరాసురేవులకు వచ్చు విదేశపడవలమీద పన్నులను విధించిరి. సముద్రములమీద వర్తకముచేయు పరాసువర్తకులకు సహాయముచేసిరి. విదేశములతో వర్తకముచేయుట కైదు వర్తకసంఘముల నేర్పరచి వానికి వర్తకపుహక్కుల నిచ్చియు ఋణములనిచ్చియు ప్రోత్సహించిరి. హిందూదేశప్రాంతములతో వర్తకముచేయుటకు ఫ్రెంచిఈస్టుఇండియాకంపెనీని, అమెరికాతో వర్తకము చేయుటకు ఫ్రెంచివెస్టిండియా

కింపెనీని, ఉత్తరదేశములతో వర్తకముచేయుట కొక సంఘమును, లివాంటు, సెనిగలు అను మరి రెండుసంఘములను స్థాపించిరి. ఈస్టుఇండియాకంపెనీకి అరువదిలక్షలు ఋణమునిచ్చిరి. ఈవిధముగనే ఇతరసంఘములకును ఋణములనిచ్చిరి. పరాసుదేశముయొక్క వలసరాజ్యములనుకూడ వృద్ధిచేయుటకు ప్రయత్నించిరి. కయేనీలోను, కనడాలోను రాజ్యమును విస్తరింపజేసిరి. ఉత్తరఅమెరికాలోని టెర్రానోవ నాక్రమించుకొనిరి. 1680 వ సంవత్సరమున ఉత్తరఅమెరికాలోని మిసిసిపిచుట్టునున్న ప్రాంతములో పరాసులు వలస నేర్పరచిరి. ఆఫ్రికాలో 1665 వ సంవత్సరమున సెనెగలును, మడగాస్కరుయొక్క తూర్పుతీరమును స్వాధీనపరచుకొనిరి. తూర్పుఇండియావర్తకసంఘమువారు హిందూదేశములోని సూరతు, చంద్రనాగూరు, పుదుచ్చేరి పట్టణములను సంపాదించిరి. రాజును మంత్రియు పరాసుదేశముయొక్క నావికాదళమును విశేషముగ వృద్ధిచేసిరి. బలమైన నావికాదళము లేనిది వలసరాజ్యములు నిలువనేరవని బాగుగ గ్రహించిరి. నౌకానిర్మాణశాలలను కట్టించి నూతననౌకలను నిర్మాణము గావించిరి. టూలూనురేవును విస్తరింపజేసి ప్రపంచములో మిక్కిలి సొగసైన రేవులలో నొకటిగ చేయించిరి.

లవ్వేమంత్రి యుద్ధమంత్రిగనుండి సైనికాభివృద్ధిచేసి పరాసుకాల్బలమును గుఱ్ఱపుదళమును యూరపులోకెల్ల శ్రేష్ఠమైనవిగా గావించెను. వాబా అను సుప్రసిద్ధనిర్మాణకౌశలుడు పరాసుదేశపు సంరక్షణకై వివిధసరిహద్దులలోను బలమైన

కోటలను కట్టించెను. మరియు క్రొత్తరకపు యుద్ధపరికరము లనుగూడ కనిపెట్టెను. ప్రజల కెక్కువన్యాయమును కలుగ చేయుటకు దండశాస్త్రమునందును, న్యాయవిచారణాపద్ధతుల యందును మార్పులు కలుగజేసి వివిధములగు చట్టములను చేసిరి. జస్టినియను కాలమునకును, నెపోలియను కాలమునకును మధ్య పదునాల్గవ లూయీరాజును, కాల్బర్టుమంత్రియు కలిసి చేసిన చట్టములవంటివి పుట్టియుండలేదు.

1666 వ సంవత్సరమున ప్రకృతిశాస్త్ర పరిశోధనాల యమును, సంగీతకళాశాలను స్థాపించిరి. 1671 లో శిల్పమును చిత్రలేఖనమును గరపు కళాశాలలను, ప్రాగ్దేశభాషలను పరి శోధించు ప్రతిష్ఠాపనమును నెలకొల్పిరి. మెజరీను స్థాపించిన గ్రంథాలయమునకు పదివేలగ్రంథములను చేర్చి ప్రజలంద రా గ్రంథాలయమును స్వేచ్ఛగా వాడుకొనుటకై తెరచిరి. లూయీరాజు విద్వాంసులకును గ్రంథకర్తలకును చిత్రలేఖకుల కును ననేకవిధముల సహాయము చేయుచుండెను.

విదేశములలోకూడ లూయీరాజుయొక్క ఔదార్య ము, విద్యాపోషణము, కీర్తిని బడసెను. విదేశములనుండి విద్వాంసులు, చిత్రకారులు మొదలగువారు పరాసుదేశము నకు వచ్చి లూయీరాజుయొక్క సత్కారమును బడయు చుండిరి. పదునాల్గవలూయియొక్కకాలము సాహిత్యము యొక్కయు కళలయొక్కయు అభివృద్ధికి పరాసుదేశచరి త్రలో ప్రఖ్యాతిచెందినకాలము. కాల్బర్టుమంత్రి 1683 వ సంవత్సరమున మరణించెను.

(4)

ఫ్రాన్సుయొక్క గొప్పస్థితి.

పదునాల్గవలూయికాలమునకు యూరపులోకెల్ల ఫ్రాన్సుదేశమే అత్యుత్తమస్థితియం దున్నది. ఇంగ్లాండుదేశములో నాకాలమున ప్రజలకును రాజులకును గొప్ప పోరాటములు జరుగుచుండెను. 1649 వ సంవత్సరమ్మున మొదటి చార్లెసురాజును ప్రజాప్రతినిధిసభవారు విచారించి మరణదండన విధించిరి. రాజును తీసివేసి సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపించిరి. ప్రజానాయకుడగు అలివరు క్రాంవెలును సంరక్షకుడుగ నెన్నుకొనిరి. క్రాంవెలు 1658వ సంవత్సరమున చనిపోయినందున ఆంగ్లేయప్రజలను సరిగ నడుపు విశ్వాసపాత్రుడగు నాయకుడు లేకపోయెను. తుదకు శిరచ్ఛేదముగావింపబడిన మొదటి చార్లెసురాజుయొక్క కుమారుడగు రెండవచార్లెసును రాజుగా తెచ్చుకొనిరి. రెండవ చార్లెసునకును ఆంగ్లేయప్రజలకును కలహములే కలిగెను. రాజప్రతినిధిసభను సంప్రతించకయే తనయిచ్చవచ్చినటుల నిరంకుశముగ పాలించెను. రాజునకును ప్రజాప్రతినిధులకును పోరాటములుజరుగుచుండగనే 1685 సంవత్సరమున చార్లెసు చనిపోయి, రెండవజేమ్సు రాజయ్యెను. జేమ్సునకును ఆంగ్లేయప్రజలకును స్నేహభావములు కుదురనే లేదు. ఉభయులమధ్యను కలహములు వృద్ధికాగా మూడుసంవత్సరముల లోపలనే ఆంగ్లప్రజలాయనను వెడలగొట్టి హాలెండు దేశమునుండి విలియమును తమకు రాజుగా తెచ్చుకొనిరి. ప్రజాప్రతినిధిసభయొక్క సమ్మతిలేనిది పన్నులు

వేయుననియు సైన్యములను పెట్టుకొనననియు విచారణలేకుండ నెవరిని శిక్షించనననియు నీయన వాగ్దత్తముచేసి రాజయ్యెను.

ఈ కల్లోలములమధ్య చిక్కుకొని ఇంగ్లాండు దేశము, యూరపు వ్యవహారములలో విశేషముగ జోక్యముపుచ్చుకొను స్థితిలో లేదు. స్పెయినూ, ఆస్ట్రియా దేశములు మహాయుద్ధములవలన మిగుల బలహీనములయినవి. జర్మనీ ముప్పదిసంవత్సరముల మతయుద్ధములవలన క్షీణించుటయేగాక యనేకఖండములుగ చీలియున్నది. కావున పదునాల్గవ లూయి యూరపువ్యవహారములలో ప్రవేశించి ఫ్రాన్సుకు ఇంక నెక్కువ గౌరవము తేవలెననియు తాను విదేశములలో రాజ్యమును సంపాదించవలెననియు తలచి, అనేకయుద్ధములలోనికి దిగెను. విశేషభాగము జయములనంది కొంతప్రదేశమును సంపాదించెను, గాని ఈయుద్ధములవలనను దంభముగాను వైభవముతోను విశేషభోగపరాయణత్వములోను తాను సంచరించుటలో కలిగిన దుర్వ్యయములవలనను ఫ్రాన్సుదేశమును మితిలేని ఋణములలో ముంచివేసెను. ఆదాయముకన్న ఖర్చులెక్కువై ఋణము లపరిమితముగ పెరిగెను. కాని, గొప్ప విద్యాపోషకుడనియు యూరపుఖండములోకెల్ల కళలను, సాహిత్యమును, శాస్త్రములను, చిత్తరువులను వృద్ధిచేసినవాడనియు కీర్తిని సంపాదించెను. ప్రజాప్రతినిధిసభలను పిలువక తనదేశమును నిరంకుశముగా పాలించినను దేశములో శాంతిని, అభివృద్ధిని నెలకొలిపి ఎచటచూచినను ఫ్రాన్సుదేశపు గొప్పదనమును స్థాపించినవాడని పేరువడసెను.

స్పెయిన్‌తో యుద్ధము.

ఆయనచేసిన మొదటియుద్ధము స్పెయిన్‌దేశముతో నై యున్నది. 1665 వ సంవత్సరమున స్పెయిన్‌రాజగు నాలుగవ ఫిలిపు చనిపోయెను. ఫిలిపునకు మొదటికొమార్తె, కూతురు పదునాలుగవ లూయీ భార్య. రెండవ భార్యకుమారుడు రెండవచార్లెసు. పదునాలుగవ లూయీ తనభార్యకు అచటి చట్టములప్రకారము స్పెయిన్ రాజ్యము క్రిందనుండిన నెదరులాండ్సు రావలెననెను. రెండవ చార్లెసు కుమారుడు యావత్తును తనకే రావలెననెను. రెండవ చార్లెసుకును ఫ్రాన్సురాజునకును యుద్ధము జరిగెను. స్పెయిన్‌రాజు మిగుల బలహీనుడుగనుండెను. ఫ్రెంచిసైన్యములు, నెదర్లాండ్సులో అడ్డులేక జొరబడెను. విశేషభాగము నాక్రమించెను. ఒకనెలపదునైదుదినములలో ఫ్రెంచికౌంటీ స్వాధీనమయ్యెను. దీనితో తక్కిన దేశములవారికి కన్నుకుట్టెను. ఇంగ్లాండు, స్వీడను, హాలెండు దేశములవారు జోక్యముకలుగ జేసికొని సంధికుదిర్చిరి. స్పెయిన్ రాజగు రెండవ చార్లెసు విశేషముగ వ్యాధిగ్రస్తుడై యుండెను. ఆయనచనిపోయినతర్వాత ఆరాజ్యమంతయు వారసత్వముగ తనభార్యకే వచ్చునని పదునాలుగవ లూయీ తలచెను. తాను జయించినదానిలో కొంత యుంచుకొని తక్కిన దానిని వదలి లూయి సంధి కంగీకరించెను. యుద్ధము ముగిసెను.

హాలండుతో యుద్ధము.

హాలెండువారు తనకు వ్యతిరేకముగ నింగ్లాండులో కలిసివచ్చుటను పదునాలుగవలూయి సహించలేకుండెను. మరియు హాలెండువారు ఫ్రెంచివారికి విదేశ వర్తకములో ముఖ్యముగ పోటీగ నుండిరి. ఫ్రెంచి

దేశములో నిరంకుశత్వముండగా హాలండులో ప్రజాపాలన ముండెను. ఫ్రెంచి రాజుయొక్క నిరంకుశత్వమును ఖండించుచు వ్రాయబడినగ్రంథములు హాలండులో ప్రచురించబడెను. కావున 1672 వ సంవత్సరమున పదునాల్గవ లూయీరాజు హాలండుమీాదికి యుద్ధము ప్రకటించెను. ఇంగ్లాండు స్వీడెన్ రాజులకు లంచమిచ్చి హాలండునుంచి విడదీసెను. ప్రతిసాలున ఇరువదిలక్షల లివరీలు ఇంగ్లాండుయొక్క రాజునకు నిచ్చెను. జరిగిన యుద్ధములో ప్రతిచోటను ఫ్రెంచివారికి జయమును డచ్చివారికి (హాలెండు) అపజయమును కలిగెను. ఇంతలో డచ్చివారికి విలియమ్ ఆర్ ఆరెంజి నాయకుడయ్యెను. వారు సంపూర్ణ ప్రజాస్వామ్యమును తీసివేసి ఆయనను స్టాడ్టుహోల్డరుగ చేసికొనిరి. ఆయన యూరపులోని రాజులనందరిని నాశ్రయించి ఆస్ట్రియా, స్పెయిను, జర్మని, ప్రభువులు మొదలగువారు ఫ్రాంసుకు వ్యతిరేకముగా నొక మాదిరిగా చేరునట్లు చేయగలిగెను. కొంతకాలము యుద్ధముజరిగి యిరు పక్షములవారికిని విసుగుపుట్టి 167ం వ సంవత్సరమున నిం-వేగన్ సంధితో యుద్ధము ముగిసెను. ఈ సంధివలన ఫ్రెంచి కొంతప్రదేశము ఫ్రాన్సులో చేర్చుకొనబడెను. ఇంకను కొంతప్రదేశము ఫ్రాన్సుకు దక్కెను. ఫ్రాన్సుయొక్క ప్రతిష్ఠ అనేకమడుంగులు హెచ్చెను. 1688 వ సంవత్సరమున నింగ్లాండులోని ప్రజలు రెండవజేమ్సురాజును వెడలగొట్టి హాలండుస్టాడ్టుహోల్డరగు విలియం ఆఫ్ ఆరెంజిని రాజుగా చేసికొనిరి. పదునాల్గవ లూయీ రెండవ జేమ్సును దగ్గరకుతీసెను.

ఇంగ్లాండు, స్పెయిను, హాలెండు, ఆస్ట్రియా, సావాయ్, డెన్మార్కు, స్వీడెన్ యొకటిగా జేరెను. యుద్ధము ప్రారంభమయ్యెను. తొమ్మిది సంవత్సరములవరకు జరిగెను. భూమిమీదనుసముద్రముమీదను గూడఫ్రాన్సుకే జయముకలిగెనుగాని యిందరితో పోరాడుటవలన ఫ్రాన్సుకు అపరిమితమైన ధనవ్యయము కలిగెను. తుదకు 1697 వ సంవత్సరమున రెస్విక్ వద్ద సంధిజరిగెను. విలియమును నింగ్లాండునకు రాజుగా పదునాల్గవ లూయీ అంగీకరించెను. ఫ్రాన్సుదేశము జయించిన దానిలో కొంతభాగమువదలివేసెను. యూరపులోకెల్ల సైనికబలమునందు ఫ్రాన్సుప్రథమస్థానము వహించినదని స్థిరపడినది.

స్పెయిన్ దేశపురాజగు రెండవచార్లెసు మూడుసంవత్సరములు వ్యాధిగ్రస్తుడుగ నుండెను. ఆయనకు పిల్లలులేరు.

స్పెయిన్ వారసత్వము.

ఆయన చనిపోయిన తరువాత వారసులెవ్వరు? పదునాల్గవ లూయీరాజుయొక్క కుమారుడును, ఆస్ట్రియాచక్రవర్తియగు లియోపాల్డును, బవేరియా రాష్ట్రాధిపతియు నీముగ్గురును వారసులమని తలచుచుండిరి. స్పెయినురాజుక్రిందనుండిన రాజ్యమంతయు ఫ్రాన్సురాజకుమారునకుగాని ఆస్ట్రియాచక్రవర్తికిగాని వచ్చినచో వారు యూరపులోకెల్ల బలవంతులగుదురను భయమువలన నింగ్లాండు మొదలగు దేశములరాజులు స్పెయిన్ రాజ్యమును యీవివిధవారసులకు పంపిణీచేసికొనునటుల రెండు పంపిణీ యేర్పాటులను చేయించిరి. ఇందుకు పదునాల్గవలూయీ కూడ సమ్మతించెను. కాని యీపంపకము లేవియు స్పెయిన్

రాజుయొక్క అనుమతితో జరుగలేదు. ఇంతలో స్పెయిన్ రాజు చనిపోయెను. ఒక (వ్రుయిలు) మరణశాసనమును వ్రాసెను. దానిప్రకారము రాజ్యమంతయు పదునాల్గవలూయీయొక్క రెండవమనుమడగు ఫిలిప్పునకు సంక్రమింపజేసెను. పదునాల్గవలూయీ మరణశాసనముప్రకారము యావత్తు రాజ్యమును తన మనుమనికి కోరునా? లేక పంపకపు యేర్పాటులపక్షమున నిలుచునా? పదునాల్గవలూయీరాజు తన మనుమనికి యావత్తురాజ్యమును వశపరచెను. ఫిలిప్పు స్పెయిన్ దేశమునకు రాజయ్యెను. వెంటనే యింగ్లాండు, హాలండు, ఆస్ట్రియా, జర్మనీ ప్రభువులు, పోర్చుగల్ దేశపురాజు లొక్కటై యుద్ధమునకు వెడలిరి. ప్రథమమున ఫ్రాన్సునకు జయము కలిగెను. తరువాత అపజయము లుకలుగనారంభించెను. పదునాల్గవలూయీ సంధికోరెను. మిత్రమండలివారు తిరస్కరించిరి. వెంటనే లూయీ ఫ్రాన్సుదేశప్రజల నుద్బోధించి గొప్ప సేనలను తయారుచేసి శత్రువుల నోడించెను. 1713 వ సంవత్సరమున ఉట్రెక్టువద్ద జరిగిన సంధివలన ఆల్సేసు, ఫ్రెంచికంటి మొదలగు ప్రదేశముల నన్నిటిని ఫ్రాన్సు దక్కించుకొనెను. ఖైదులోనున్న ప్రొటెస్టెంటులను లూయీ విడుదలజేసెను. స్పెయిన్ రాజ్యము లూయీరాజుయొక్క మనుమడగు ఫిలిప్పునకు స్థిరపడెనుగాని అతడు ఫ్రాన్సురాజ్యపు హక్కును త్యజించెను.

పదునాల్గవలూయీరాజు డెబ్బదిరెండు సంవత్సరములు రాజుగానుండి, 1715 వ సంవత్సరమున చనిపోయెను.

ఆయనకన్న ముందే ఆయనకుమాళ్లును, మనుమలును మరణిం చినందున ఆయనతరువాత మునిమనుమడు, అయిదు సంవత్సరముల యీడుగల పదునేనవలూయియీ రాజ్యమునకు వచ్చెను.

(5)

పదునాల్గవలూయియీరాజు ఫ్రాన్సుదేశమును నిరంకుశముగ పాలించెను. "నావిష్ణుః పృథివీపతిః" అనగా "రాజు దైవాంశ సంభూతుడు" అను సిద్ధాంతము నాయన నమ్మెను. ప్రజలను పాలించుటకు తనకు దైవము ప్రసాదించెననియు తాను దైవమునకుతప్ప మనుష్యులకెవరికిని జవాబుదారుడను కాననియు ఆయన తలంచెను. ఆయనకాలమున స్టేట్సు జనరలు (దేశప్రతినిధిసభ) ను సమావేశపఱచనేలేదు. "రాజుయొక్క చిత్తమే చట్టము," "రాజునకు సర్వాధికారము గలదు," "రాజునకడ్డుచెప్పువా రుండగూడదు" అని ఆయన తలంపు. ఇట్టి అభిప్రాయములనే యింగ్లాండునుపాలించిన మొదటిజేమ్సురాజు కలిగియుండెను. ఆంగ్లేయప్రజ లెదిరించిరి. తమ ప్రతినిధిసభయొక్క అనుమతి లేనిది తమమీద పన్నులువేయుటకు వీలులేదనిరి. రాజు ఒప్పుకొనలేదు. ఆయన కుమారుడగు మొదటిచార్లెసు కాలమున నీపోరాటము హెచ్చెను. చార్లెసు తన యిచ్చవచ్చిన పన్నులనువేసి వసూలుచేయుదలచెను. ప్రజ లెదిరించిరి. తిరుగబడిరి. రాజును దేశద్రోహపు నేరముక్రింద విచారించిరి. శిరచ్ఛేదము గావించిరి. ఇటుల ఇంగ్లాండుప్రజలు రాజుయొక్క నిరంకుశత్వముతో పోరాడుచున్నకాలమున యూరపుఖండమంతయు రాజుల నిరంకుశత్వముక్రింద పాలింపబడుచుండెను.

నావిష్ణుః పృథివీపతిః.

లూయీరాజు తనక్రిందిప్రభువులును సామంతరాజులును తన చుట్టును చేరి తన్ను స్తోత్రపాఠములు చేయుచు తనతోపాటువిలాసములలోను క్రీడలలోను నింద్రియవ్యసనములలోను రాజమందిరములో కాలముగడపునటులు చేసెను. రాజునకు దూరముగనున్న ప్రభువును ఏదోపేరుపెట్టి రాజు శిక్షించెను. రాజుచుట్టు చేరిన ప్రభువులకు బిరుదములిచ్చి సంతోషపరచెను. ప్రభువులు తమ భూములమీదవచ్చు ఐవజును తెచ్చుకొని రాజుసమ్ముఖమున ఖర్చుచేసికొని ఋణగ్రస్తులైరి. రాజు మునిసిపాలిటీలహక్కులను తగ్గించెను. వర్తకులు ప్రతివిషయమునను రాజుమీద ఆధారపడునట్లు చేసెను. సామాన్యప్రజలు ప్రభువులయొత్తిడినుండిసంరక్షణకొరకు రాజుమీదనే ఆధారపడిరి. రోమనుకాథలిక్కు మతగురువులు, రాజు రాజ్యవ్యవహారములకేగాక మతమునకు గూడ దైవాంశసంభూతుడగు నిరంకుశప్రభువని తీర్మానించిరి. ఇందుకు ప్రతిఫలముగ రాజు ప్రొటెస్టెంటుమతావలంబులను ఘోరశిక్షలపాలుచేసి రోమనుకాథలిక్కు మతగురువులను సంతోషపెట్టెను. ఈవిధమున సమస్తవిషయములలోను రాజు నిరంకుశుడయ్యెను. పదునాలుగవలూయీయొక్క అనుగ్రహమునుకోరి జయజయధ్వనులుచేయుచు అన్నిజాతులప్రజలు మెలంగిరి. ఆయనయొక్క పరిపాలనాసామర్థ్యము యుద్ధజయములు, వైదుష్యము, పేరు ప్రతిష్ఠలు—ఇవి ఆయనయొక్క యింద్రియలోలతను, దుర్వ్యయమును, ఆర్థికదుస్థితిని, నిరంకుశత్వమును తాత్కాలికముగా కప్పిపుచ్చినవి. అతనివారసులకాలమున ఈలోపములన్నియు బయటపడినవి.



ఫ్రెంచి

# స్వాతంత్ర్య విజయము

తొమ్మిదవ అధ్యాయము

## ఫ్రాన్సు హైందవసామ్రాజ్యమును గోల్పోవుట

(1)

ఆర్లియన్సు ప్రభువు రాజ సంరక్షకుడు.

పదునేనవ లూయి చిన్నవాడైనందున రాజబంధువు డగు ఆర్లియన్సుప్రభువు రాజుయొక్క సంరక్షకుడుగ రాజ్యమును చేసెను. ఆర్లియన్సుప్రభువు విషయాసక్తుడు, భోగపరాయణుడు. పదునేనవలూయిరాజు కూడ ఇంద్రియవ్యసనములలోనే పెరిగెను. పదునాల్గవలూయియొక్క సమర్థతగాని విద్యావ్యాసంగముగాని యుద్ధకౌశలముగాని వీరి కెవరికిని లేదు.

దుర్వ్యయములోను చెడుప్రవర్తనములోను నిరంకుశత్వములోను ఏ రాజునను మించిరి. ఆర్లియన్సుప్రభువు, దుర్గుణ

ములకెల్ల ఖనియని చెప్పదగిన అబిద్యూబాయిచేతిలో పూర్తిగనుండెను. అబిద్యూబాయి విదేశరాజ్యాంగమంత్రిగ నుండెను. ఇంగ్లాండుతో సఖ్యముగ నుండి ఇంగ్లాండుకు లాభకరముగ బనిచేయుటకు ప్రతిసంవత్సరమును * ఆంగ్లేయప్రభుత్వమువారు అబిద్యూబాయికి ఏబదివేలు మొదలు పదిలక్షల వరకు క్రౌనులను లంచమిచ్చుచుండిరి. తనకు సముద్రముల మీాద పోటీగనున్న స్పెయినుతోడ ఇంగ్లాండు యుద్ధముచేయుటలో ఫ్రాన్సుదేశము స్పెయిన్‌తోచేరక ఇంగ్లాండుపక్షమున చేరుట కీలంచము నిచ్చెను. ఫ్రాన్సుప్రభుత్వము ఇంగ్లాండు పక్షమున చేరెను. స్పెయిను ఓడిపోయెను. సముద్రముల మీాద ఇంగ్లాండునకు మంచిబల మేర్పడెను. ఈసముద్రముల మీాద బలమువలననే ఇంగ్లాండు ముందుముందు ఫ్రాన్సును అణగగొట్టనున్నది. ఆర్లియన్సుప్రభువును అబిద్యూబాయియు, రోమనుకాథలిక్కు మతగురువులను సంతోషపరచుటకై ప్రాటెస్టెంటులను విశేషముగ నిర్బంధములకు లోబడజేసిరి.

పదుమూడవయేటనే ఫ్రాన్సురాజులకు మైనార్టి వెళ్లును గావున పదుమూడవయేట పదునేనవలూయి రాజ్యభారమును వహించెను. ఆర్లియన్సుప్రభువును అబిద్యూ

బోర్బన్ ప్రభువు

బాయియుమరణించిరి. మూడుసంవత్సరముల కాలము బోర్బోక ప్రభువు ప్రధానమంత్రిగా రాజ్యమును పాలించెను. ఈయనయు అవినీతిలోను దుర్వ్యయములోను ప్రాటెస్టెంటులను నొత్తిడిచేయుటలోను ఆర్లియన్సుప్రభువును మించెను.

* ద్యూరియొక్క ఫ్రాన్సుచరిత్రమును జూడుము.

ఈయనయుంపుడుకత్తెయగు ప్రియువతికి, ఆంగ్లేయప్రభుత్వమువారు ఆబిడ్యూబాయికిచ్చుచుండిన *లంచమునే ఇచ్చుచుండిరి. ఫ్రాన్సుప్రభుత్వము ఇంగ్లాండుతో సఖ్యముగా నుండెను.

1726 మొదలు 1743 వరకును ఫ్లూరి యను ముసలి మతగురువు రాజుయొక్క ప్రధానమంత్రి యయ్యెను. ఇతడు

పోలండు.

విశేషసమర్థుడు గాకపోయినను యోగ్యుడు. రాజు సమస్తమును మంత్రికి వదలి స్త్రీలోలుడై మెలంగుచుండెను. రాజుయొక్క మామగారగు స్టానిస్లాసు పోలండు రాజ్యమునకు హక్కుదారుడయ్యెను. సాక్సనీప్రభువు పోలండు రాజ్యము తనకు రావలెననెను. ఆస్ట్రియా రుష్యాలు సాక్సనీ పక్షమునను, ఫ్రాన్సు, స్పెయిన్, సావాయి ప్రభుత్వములు స్టానిస్లాసుపక్షమునను చేరి యుద్ధము సలిపిరి. ఫ్రెంచిపక్షము విజయముగాంచెను. కొంతదేశము స్టానిస్లాసున కిప్పించి సంధి చేసికొనిరి. ఈయుద్ధమువలన ఫ్రాన్సు ఇంకను యూరోపులో కెల్ల బలవంతమయినదని తేలెను.

ఆస్ట్రియా యుద్ధము

ఆస్ట్రియాచక్రవర్తియగు ఆరవచార్లెసు 1740 వ సంవత్సరమున మరణించెను. తన రాజ్యమంతయు తన కుమార్తెయగు మేరియా థెరీజాకు సంక్రమించవలెనని శాసనముచేసెను. కాని ఆయన మరణించగనే ఆస్ట్రియాసామ్రాజ్యమునకు అయిదుగురు హక్కుదారులు బయలుదేరిరి. యూరపురాజులమధ్య గొప్పయుద్ధము జరిగెను.

---

* డ్యూరయొక్క ఫ్రాన్సుచరిత్రము చూడుడు.

చనిపోయిన చక్రవర్తియొక్క కుమార్తె, ఇంగ్లాండురాజు ఒక పక్షమునను; ప్రష్యారాజగు ఫ్రిడరిక్ ది గ్రేటును, ఫ్రాన్సు ప్రభుత్వమును మరియొకపక్షమునను చేరి యుద్ధములుసలిపిరి. యుద్ధము కొంతవరకు సాగగనే ఫ్లూరీమంత్రి చనిపోయెను. పదునేనవలూయీరాజే స్వయముగ రాజ్యపాలనము చేసెను. ఈయన తన ఉంపుడుకత్తెలచేతిలో కీలుబొమ్మవలె నాడించబడు చుండెను. వారిసలహా ననుసరించి మంత్రులను సేనాధిపతులను నియమించుచు, తిరిగి చపలచిత్తముతో తీసివేయుచు నుండెను. ఈయనపాలనమున సమర్థులగు మంత్రులకుగాని సేనానులకు గాని ప్రోత్సాహము కలుగలేదు. పదునెనిమిది సంవత్సరము లలో ఇరువదియైదుమంది మంత్రులు మారిరి. ఈయుద్ధము 1748 వరకును జరిగి ఏలాషేపెలువద్ద సంధిజరిగెను. సైలీషియా రాజ్యము ప్రష్యాకు దక్కెను. మేరియాథెరీజా ఆస్ట్రియాకు రాణియయ్యెను. ఫ్రాన్సుదేశము తనరాజుయొక్క స్త్రీలోల త్వమున యూరపుఖండములో నగ్రస్థానమును గోల్పోయిన దని ఈయుద్ధములో బయటపడినది. ఫ్రాన్సుదేశపు సైన్య ములు వెనుకటిపటుత్వమును చూపలేదు.

(౨)

ఈకాలము ఫ్రాన్సునకు ప్రపంచకవర్తకములోను వల స రాజ్యములలోను మిగుల ముఖ్యమగుకాలము. పదునాలుగవ లూయికాలమున పెంచివర్తకసంఘములు ప్రోత్స హించబడి హిందూదేశములోను అమెరికాలో ను స్థాపించబడుట చూచియున్నాము. ఉత్తర అమెరికాలోని

రాజుయొక్క అవినీతి.

కనడాదేశములో ఫ్రెంచివలసరాజ్యము స్థాపించబడి పెరుగుచు న్నది. అచట ఫ్రెంచివారికి విశేషలాభము కలిగినది. హిందూ దేశములో ఫ్రెంచి వర్తకస్థానములు బాగుగ వృద్ధిచెందుచు న్నవి. పుదుచ్చేరి గవర్నరగు డూప్లే అనునతడు, అప్పుడు హిందూదేశములోని స్వదేశ సంస్థానాధీశులలో ప్రబలుచున్న అంతఃకలహములలో ప్రవేశించియు, హిందూదేశీయులను ఫ్రెంచిసేనాధిపతులక్రింద సిపాయిలుగ శిక్షణమునిచ్చి ఉప యోగించియు, హిందూదేశములో గొప్ప ఫ్రెంచిసామ్రాజ్య మును స్థాపించవలెనని యత్నముచేయసాగెను. అమెరికాలోను హిందూదేశములోనుగూడ ఇంగ్లీషువర్తకసంఘములే ఫ్రెంచి వారికి పోటీగనుండెను. హిందూదేశములో ఆంగ్లేయవర్తకులు గూడ స్వదేశ రాజుల అంతఃకలహములలో ప్రవేశించియు, హిందూదేశీయులను ఆంగ్లేయసేనాధిపతులక్రింద సైనికులుగ తరిబీయతుచేసియు ఆంగ్లేయరాజ్యమును ఏర్పరచవలెనని తల చిరి. కాని ఫ్రెంచివారిస్థితియే అధిక్యతను పొందియుండెను. ఫ్రెం చిరాజుమాత్రము కొంతకాలము పాంపడారుయువతియొక్క యు, మిగతకాలము డుబెర్రియువతియొక్కయు చేతులలో నుండెను. ఈ యువతులకర్చులనిమిత్తము సాలుకు నలుబది లక్షలు వరహాసుప్రభుత్వబొక్కసములోనుండి ఖర్చగుచుండెను.

ఇట్టిస్థితిలో 1756 వ సంవత్సరమున ఏడు సంవత్సరములయుద్ధము ప్రారంభమయ్యెను. ఆస్ట్రియారాణి సైలీషియాను హిందూదేశమును ప్రష్యారాజున కువదలివేయుట కిష్టములేకయు పోగొట్టుకొనుట. ద్ధమునకు వెడలెను. ప్రష్యారాజుపక్షమున ఇంగ్లాండుచేరెను. ఆస్ట్రియారాణిపక్షమున ఫ్రాన్సుచేరెను. 1763 వరకు ఏడు సంవత్సరములు యుద్ధముజరిగెను. ఇంగ్లాండుయొక్కయు, ఫ్రాన్సుయొక్కయు చరిత్రలలో వింతప్రాముఖ్యమైన యుద్ధము మరియొకటిలేదు. ఆస్ట్రియాయు, ప్రష్యాయు, యూరోపులో నాధిక్యతకొరకు పోరాడుచుండ ప్రపంచరాజ్యముకొరకు ఫ్రాన్సు, ఇంగ్లాండుదేశములు పోరాడుచుండెను. ఫ్రాన్సునకును ఇంగ్లాండునకును ముఖ్యయుద్ధములు ఉత్తరఅమెరికాలోను హిందూదేశములోను జరిగినవి. ఇంగ్లాండుదేశపు ప్రధానమంత్రియగు విలియంపిట్ బహుసమర్థతతో కార్యభారమునువహించి సరిగా సైన్యములను నౌకాదళములను పంపి యుద్ధమును జాగ్రత్తగా నడిపెను. ఫ్రాన్సురాజగు పదునేనవలూయి చపలచిత్తలగు ఉంపుడుకత్తెలచే నడుపబడి సరిగా హిందూదేశమునకును అమెరికాకును ద్రవ్యమును సేనలను పంపక యుద్ధమును పాడుచేసెను. యూరపులో ప్రష్యా జయమంది ఆస్ట్రియాకన్న ప్రముఖ్యమైనది. హిందూదేశములో సమర్థుడగు డూప్లేను ఫ్రెంచిప్రభుత్వమువారు సహాయము చేయకపోగా ఫ్రాన్సుకు పిలిపించుకొని అవమాన

పరచిరి. రణకౌశలుడగు ఫ్రెంచిసేనాని లాలీకి తగినసహాయ
మురాక ఆంగ్లేయసేనానియగు క్లైవుకు లొంగవలసివచ్చెను.
అమెరికాలోను ఇటులనే ఫ్రాన్సునుండి సహాయమురాక సమ
ర్థులగు ఫ్రెంచిసేనానులు ఆంగ్లేయులచేత నోడించబడిరి.
1763 వ సంవత్సరమున పారిసువద్ద సంధిజరిగెను. అమెరికా
ఖండములోని కనడాదేశమును ఇంక కొన్ని ముఖ్యమగు ద్వీప
ములను, హిందూదేశసామ్రాజ్యమును ఫ్రెంచివారు ఇంగ్లీషు
వారికి వదలివేసిరి. ఫ్రెంచివారు హిందూదేశములోని రాజుల
కలహములలో జోక్యముకలుగ జేసికొనకుండునట్లును హిందూ
దేశములో నెచటను కోటలు కట్టకుండునట్లును పరతులతో
వర్తకముకొరకై మాత్రము పుదుచ్చేరి, చందనగరం,
మాహి, కారెకాలు, ఏనాం పట్టణములు ఫ్రెంచివారికి వశము
చేయబడినవి. ఇంతటితో హిందూదేశసామ్రాజ్యమును,
ప్రపంచరాజ్యమును ఫ్రాన్సు కోల్పోయి ఆంగ్లేయులకు సంక్ర
మించినది.

పదునేనవలూయికి ఆదాయముకన్న ఖర్చు లెక్కువ
యయ్యెను. ప్రభుత్వపుఋణములు చాల వృద్ధిచెందెను.
చెడు పరి- ఋణములను తీర్చుమార్గము కనుపించలేదు.
పాలనము. నిరంకుశముగ పన్నులను రెట్టింపుచేసెను. ఉద్యో
గములను లంచమిచ్చువారి కిచ్చెను. ప్రజలు పన్నులబాధల చే
కృంగిరి. అసంతృప్తి మిగుల వ్యాపించెను. పారిసులోని

పార్లమెంటు అనబడెడి న్యాయాధిపతులసంఘమువారు రాజు నెదిరించ ప్రారంభించిరి. ఒకరోజున ఆంగ్లేయులచే శిరశ్ఛేదము గావింపబడిన మొదటిచార్లెసు బొమ్మనుచూపి, "అటులనే మిమ్ములనుగూడ నీపారిసుపార్లమెంటువారు చేయదలచుకొన్నారు. జాగ్రత్త," అని దుబెర్రియువతి లూయీరాజుతో చెప్పెను. లూయీ రాజు అదుమీద భయపడి న్యాయాధిపతులను అరెస్టుచేయించి దేశభ్రష్టులను గావించెను. న్యాయాధిపతులసంఘమును రద్దుపరచెను.

పదునేనవలూయీరాజు 1774 వ సంవత్సరమున మరణించెను. ఆయనమనుమడగు ఇరువది సంవత్సరముల ఈడుగల పదునారవలూయీ సింహాసన మధిష్ఠించెను.



# ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయము

## పదియవ అధ్యాయము

## ఫ్రెంచి విప్లవకారణములు

(1)

పదునాఱవ లూయీరాజు నిష్కళంక చారిత్రుఁడు. కాని పిఱికివాఁడు. సదుద్దేశ్యములు గలవాఁడుగాని తన యుద్దేశ్యము

పదునాఱవ లూయీరాజు.

లను తన చుట్టునున్నవారికి వ్యతిరేకముగా నమలు జరుపుటకు ధైర్యము లేనివాఁడు. ఈయనభార్యయగు మేరిఆంటనెటు ఆస్ట్రియారాజుయొక్క కూతురు. ఈమె మిగుల సౌందర్యవతి. విలాసములయం దనురాగము గలది. ఈమెకు భర్తమీఁద చాల పలుకుబడి గలిగి యుండెను. ఆమె దుర్వ్యయము చేయుచుండెను. దుర్గుణములు కలదని చెప్పుటకన్న, దూరాలోచన లేనిదని చెప్ప నొప్పును.

పదునాఱవలూయీరాజుకాలమున ప్రపంచచరిత్రము నందు మిగుల గొప్పదగు రాజకీయసాంఘికవిప్లవము జరిగి, ఆయన శిరచ్ఛేదము గావింపబడెను. ఆయనపూర్వుల పరిపాలనాలోపములవలన దేశమునం దేర్పడిన దుష్టమగు పరిస్థితులును, ఆకాలమునందు పరాసుదేశప్రజలలో వ్యాపించిన స్వాతంత్ర్యభావములును ఇందుకు కారణములు.

పదునాలుగవ లూయీరాజు మిగుల సమర్థుఁడై తన రాజరికమును సంపూర్ణముగ నిరంకుశముగా చేయుట చూచి

దుష్టమగు పాలనము.

యున్నాము. పదునేనవ లూయికాలమునకూడ రాజరికము పూర్తిగ నిరంకుశముగనే యున్నది. ప్రభువులు, మతగురువులుకూడ తమ మొఖాసాలలో నివసించు ప్రజలపై విచారణాధికారమును కలిగియుండిరి. రోజు అవసరములేకుండ విశేషసంఖ్యాకులగు ఉద్యోగస్థులను పెట్టుకొనెను. వీరి కందఱకును చేయఁదగినపనిలేక వంతులప్రకారము పనిచేయుచుండిరి. పదమూఁడు పార్లమెంటులును, నాలుగు రాష్ట్రీయసంఘములును సివిలు, క్రిమినల్ విచారణచేయుచుండెను. క్రిమినల్ కేసులలో ముద్దాయియగువాడు తప్పించుకొనుట కష్టము. నేరముచేసినట్లొప్పుకొనువరకును మిగుల ఘోరమగు హింసలకు లోబడఁజేసిరి. వకీలును పెట్టుకొని యెదుటిసాక్ష్యము క్రాసుపరీక్షచేయు హక్కు లేదు. మరణశిక్షలే గాక అంగవైకల్యముచేయు శిక్షలును, శరీరములో కొంత భాగము కోసివేయు శిక్షలునుకూడ ఇచ్చుచుండిరి. న్యాయాధిపతి తీర్పులలో కారణముల వ్రాయ నవసరములేదు. విచా

కలు రహస్యముగా జరుగవచ్చును. బహిరంగవిచారణ జరుప నక్కఱలేదు. చెఱసాలలోనికి మేజస్ట్రీటులు వచ్చి విచారించుచుండిరి. చెఱసాలలోపెట్టినవారి నేదోవిధముగా శిక్షించుటయే న్యాయాధిపతుల ముఖ్యకర్తవ్యము. యథార్థము కనుగొనుట కాదు. న్యాయాధిపతులకు స్వాతంత్ర్యములేదు. పై ప్రభుత్వోద్యోగులు చెప్పినప్రకారము శిక్షలు వేయుచుండిరి. ఒక క్రైస్తవదేవాలయమున కపచార మొనర్చినందున కొక పందొమ్మిదిసంవత్సరముల కుఱ్ఱవానినాలుకను, చేతిని కోసివేసి బ్రతికియుండగా మంటలలో బడవేసి చంపిరి. తఱచుగా ఎట్టి విచారణ లేకుండగనే రాజు అనిర్దిష్టమగుకాలమువరకును ఖైదుశిక్షగాని, దేశాంతరవాసశిక్షనుగాని, ఇచ్చుచుండెను. మేజస్ట్రీటులకు జీతములు లేవు. ఇచ్చినచోటుల తక్కువజీతము లిచ్చుచుండిరి. వారు ఇష్టము వచ్చినవిధమున కక్షిదార్లయొద్ద సొమ్మును వసూలు చేసిరి. రాజు ఉద్యోగముల ద్రవ్యమిచ్చినవారి కమ్ముచుండెను. ప్రభుత్వమున ఆదాయవ్యయపట్టికలు లేవు. ప్రభుత్వబొక్కసములోనుంచి రాజు తన యిచ్చవచ్చినంత తీసికొనుచుండెను. రశీదుమాత్ర మిచ్చుచుండెను. రాజుయొక్క యుంపుడుకత్తెలకు పాలునకు నలుబదిలక్షలు ఖర్చగుచుండెను. ప్రభుత్వపు ఆదాయముకన్న వ్యయ మత్యధికముగ నుండెను. ప్రభుత్వపు ఋణము ఎంతయున్నదో చెప్పుటకు మంత్రులకుకూడ కష్టముగ నుండెను. సరియైన లెక్కలులేవు. రాజు ఇంద్రియలోలుడై అత్యధికముగ దుర్వ్యయము చేయుచుండెను. ఆయనచుట్టును

దుర్వ్యసనములలో చిక్కి దుర్వ్యయముచేయుచు విలాసములలో కాలముగడుపు స్త్రీపురుషు లుండిరి. రాజమందిరము అవినీతిలోను కుట్రలోను మగ్నమై యుండెను. ప్రభుత్వమునకు ఋణములిచ్చువారు దొరకక నూటికి సంవత్సరమునకు ఇరువది చొప్పున వడ్డికి తాకట్టులమీద ఋణములు తెచ్చుచుండిరి. ప్రభుత్వమువారు ప్రజలకు జేయు వాగ్దత్తముల నెప్పుడును చెల్లించకుండుటవలన ప్రజలకు ప్రభుత్వమం దెట్టివిశ్వాసము లేకుండనుండెను. పదునేనవలూయి ఒక్క సంవత్సరములోపల తన యింద్రియసౌఖ్యములకొరకు పదునెనిమిదికోట్ల ద్రవ్యమును తీసికొనెను. కొన్ని పన్నులను పది సంవత్సరములకు ముందుగానే తాకట్టుపెట్టెను. కొన్ని పన్నులు ప్రభుత్వమువారు వసూలుచేయక ఇజారాకిచ్చుచుండిరి. ఇజారాదార్లు ప్రజలయొద్ద ఎక్కువ వసూలుచేసికొని కొంతమాత్రమే ప్రభుత్వమున కిచ్చుచుండిరి. ఇజారాదార్లు గొప్ప యుద్యోగస్థులకు లంచమిచ్చి తక్కువ ఇజారాకు పుచ్చుకొనుచుండిరి. పన్నులు బాకీయున్నవారిని ఖయిదులలో నుంచుచుండిరి. ప్రభుత్వఆదాయములో చాలభాగము వృథాగా పటాలములక్రింద ఖర్చు అగుచుండెను. అనవసరముగ పటాలములను రాజు పెట్టుకొని యుండెను. రాజుచిత్తమువచ్చినటుల పన్నులను వృద్ధిచేసెను. ఏమనుష్యునియొక్కయు ప్రాణమునకును, ఆస్తికిని, స్వేచ్ఛకును ప్రభుత్వముయొక్క నిరంకుశత్వమునుండి సురక్షితము లేదు. ఎవరి నెట్టి నిర్బంధములకు లోనుజేసినను అడుగువారు లేరు. చట్టములు సమానముగ లేవు. ఒక్కొక్క ప్రదేశములో

ఒక్కొక్కవిధమగు శాసనములుండెను. మనుష్యులనుబట్టియు, జాతులను బట్టియు శిక్షలు వేయుచుండిరి.

పరిభువులలో గొప్పవారు తమ మొఖాసాలను వదలి అందలి ఆయివజును తీసికొనిపోయి రాజమందిరముచుట్టు చేరి కేళీవిలాసములలో కాలముగడుపువారు. రెండవరకమువాదు తమ మొఖాసాలలోనే కొద్ది ఆదాయములతో కాలము గడుపువారు. మతగురువులలో మొదటితరగతివారు మిగుల భాగ్యవంతులుగను, రెండవతరగతివారు మిగుల బీదవారుగను నుండిరి. సామాన్యజనులలో రాజునకు ద్రవ్యమిచ్చి, వంశపారంపర్యమగు మేజిస్ట్రేటుపదవులను కొనుక్కొనిన ఏబదివేలకుటుంబములు గలవు. వీరికి సంఘములో నెక్కువ గౌరవముగలదు. మధ్యమతరగతి ప్రజలు కాయకష్టముచేసి జీవించువారిని హేయముగజూచిరి. అందరికి అడుగున చెమటకార్చి కష్టించుచు, పైసంఘము యావత్తుయొక్క బరువుక్రిందబడి నలుగుచున్న రయితులు దారిద్ర్యములోను అజ్ఞానములోను మునిగియుండిరి. వీరందఱి క్రిందను అడుగున వ్యవసాయ బానిసలును, వారికన్న తక్కువగ ఎట్టి పౌరహక్కులును లేకుండ ప్రొటెస్టెంటు మతస్థులును, యూదులును ఉండిరి.

ప్రజల దుస్థితి.

పరిభువులు పెద్దయుద్యోగము లన్నిటిని వశపఱచుకొనియుండిరి. సైనికోద్యోగములన్నియు పరిభువులకు మాత్రమే యియ్యబడెను. పరిభువులే న్యాయాధిపతులుగ నుండిరి. పరిభువులలో ఆస్తి పెద్దకుమారునికి

పన్నుల బాధలు.

మాత్రమె సంక్రమించుచున్నందున చిన్నకుమారులును కుమా
ర్తెలును తరుచుగా మతపీఠములలో మతగురువులుగను సన్యా
సినులుగను చేరిరి. ఈవిధముగా గొప్ప మతపీఠములును మత
ఉద్యోగములును ప్రభువులకే చెందెను. చిన్నమతగురువులు
గనే సామాన్యజనులు ప్రవేశించిరి. మతగురువులకు దేశము
లోని ప్రతిభూమిమీదను పదవవంతు ఐవజు ఇయ్యవలెను.
ఇదిగాక మతగురువులకును మతపీఠములకును విశేషముగు ఆస్తు
లుగలవు. ఈ ఆస్తులన్నియు పన్నులనుండి మినహాయింపు కాబ
డినవి. ప్రభువులయొక్క భూములమీద పన్ను ఇయ్యవలసి
నపనిలేదు. దేశములోని రెండువంతులభూమి పన్నులులేకుండ
ప్రభువులచేతిలోను మతగురువులచేతిలోను ఉండెను. మూడవ
వంతుభూమి మాత్రమే సామాన్యప్రజలచేతిలోనుండెను. వీని
మీదనే భూమిపన్ను (టాలే) తొమ్మిదికోట్లు; పైగా పండిన
పంటలో కొంతభాగము చెల్లించుటవలన పదుమూడుకోట్లు;
ఇతరపన్నులు అయిదుకోట్లన్నర వ్యవసాయకులచేత చెల్లించ
బడుచుండెను. ఒకే నేరమునకు ప్రభువునకు మిగుల దేలికయగు
శిక్షయు, సామాన్యునకు మిగుల కఠినమగు శిక్షయు, ఇయ్య
బడుచుండెను. ప్రభువుకు రెండు సంవత్సరముల శిక్ష వేయగ,
సామాన్యుని కానేరమునకే మరణదండన విధించబడుచుండెను.
కొన్ని రాష్ట్రములకు కొంత స్వాతంత్ర్యముండెను. మరికొన్ని
రాష్ట్రములు రాజుయొక్క నిరంకుశత్వమునకు లోబడెను.
కొందఱు వర్తకులును వర్తకసంఘములును రాజునకు ద్రవ్య
మిచ్చి కొన్ని ప్రత్యేక వర్తకహక్కులను కొనుక్కొనిరి. కొన్ని

రాష్ట్రములు స్వేచ్ఛగా సరుకులను ఎగుమతి దిగుమతులు చేసి కొనవచ్చును. మరికొన్ని రాష్ట్రములు మెట్టును సుంకపుశాల లేర్పఱచి సరకులు పన్నిచ్చిగాని రాకపోకలు చేయుటకు వీలులేకుండ చేసిరి. కొలపాత్రలు తూనికరాళ్ళును అన్ని రాష్ట్రములలో సమానముగ లేవు. ధాన్యము దేశములోని ఒకచోటనుండి మఱియొకచోటికి ధారాళముగ పోవుటకు వీలు లేకుండ నిర్బంధములకు లోనయ్యెను. పరిశ్రమలు కొన్ని సంఘములకే యిచ్చియుండుటవలన అందరికిని అందుబాటులో లేక చాలమంది ప్రజలకు నష్టముగనుండెను. వ్యాపారస్వేచ్ఛ, పరిశ్రమలస్వేచ్ఛ అండలేని లేకుండెను.

వ్యవసాయము క్షీణించెను. రయితులు విశేషముగ పన్నులబాధచే కృశించుచుండిరి. రాజయొక్క నిరంకుశత్వము ఉప్పుపన్ను. కన్నను ప్రభువులయొక్కయు మతగురువుల యొక్కయు నొత్తిడి ఎక్కువగనుండెను. భూమిపన్నులను ఇతర పన్నులను చెల్లించుచు, ధాన్యము ధారాళముగ రాకపోకలు చేయుటకు వీలులేక, ప్రభువుల విలాసార్థము పావురములను, వేటలును ఉంచవలసియుండి, ప్రభువుల ద్రాక్షపండ్లను గానుగలలో త్రిప్పుట, ప్రభువుల ధాన్యమును విసరుట, ప్రభువుల రోడ్లను మరమ్మతుచేయుట, ప్రభువుల పొలములలో పని చేయుట మొదలగు పనులను చేయవలసియుండియు, రైతులు గొప్ప భారమును బాధలను అనుభవించుచు పైగ మిగుల తక్కువవారుగ చూడబడుచుండిరి. వీరికిందనుండిన వ్యవసాయ కూలీల సంగతి చెప్పనక్కఱలేదు. వీరు పశువులకన్న హీన

ముగ చూడబడిరి. భూమివిడిచి వెళ్ళుటకు వీలులేక ఎల్లప్పుడును స్త్రీలును పురుషులును అధికశ్రమతో పనిచేయుచున్నను, మిగుల ఘోరమగు దారిద్ర్యమునే యనుభవించుచుండిరి. ప్రభువు లెప్పుడుతలచిన నప్పుడు రైతులపొలములలో గూడ వేటాడుచు పోవచ్చును. పంటనష్టమునకు పరిహారమియ్యనక్కరలేదు. ప్రభువులు తమ న్యాయస్థానములలో రయితులను కూలీలను సామాన్యజనులను విచారించి శిక్షలు వేయవచ్చును. భూమిపన్నులుమాత్రమేగాక పేదలను పీడించుటకు ఉప్పుపన్నుగూడ గలదు. ప్రభుత్వమువారే ఉప్పును తయారుచేసి అమ్మువారను. ఇతరులు తయారుచేసిన ఖయిదులో నుంచుచుండిరి. మతస్వేచ్ఛ బొత్తిగ లేదు.

ప్రభుత్వము ప్రజలను రక్షించుటలేదు. దుష్టమగు పరిపాలనా పద్ధతులవలనను పన్నుల భారమువలనను ప్రజల ప్రభుత్వమునందు [illegible] యినుమడించుచుండెను. [illegible] స్వేచ్ఛ. దేశములో స్థాపనచేయబడుచుండెను. రోగములు విశేషమయ్యెను. ప్రాణములకును ఆస్తులకును స్వేచ్ఛకును సురక్షితము లేదు. ప్రజలలో మరణము హెచ్చయ్యెను. ఆయుష్యము క్షీణించుచుండెను. ఎక్కడచూచినను భోజనములేనట్టియు గృహములు లేనట్టియు బిచ్చగాండ్రగుంపులు కన్పించుచుండెను. తమయొక్క దుఃఖముల కన్నిటికిని ప్రభుత్వమే కారణమనియు, దీనిని తలక్రిందుచేసి మఱియొక ప్రజాహితకరమగు ప్రభుత్వమును స్థాపించుకొనినగాని తమ కష్టములు తొలగవనియు ప్రజలు తలచిరి. మరియు ప్రజలు తమ్ము నొత్తిడిచేయుచు

పుట్టుకవల్ల తమకన్న నధికులమని యెంచుచు తమ్ము నీచముగ చూచుచున్న ప్రభువులయందును ద్వేషమును గలిగియుండిరి. ప్రభువులలోఁగూడ కొందఱు నూతనస్వాతంత్ర్య భావములను పొందియుండిరి. చిన్న మతగురువులును చాలవఱకు సామాన్య ప్రజలభావములనే కలిగియుండిరి. పట్టణములలో నూతన భావములు తీవ్రముగా వ్యాపించినవి. పదునేనవ లూయిరాజు సుమారు అఱువదిసంవత్సరములు రాజ్యముచేసెను. అంత దీర్ఘపాలనమున ప్రజానుకూలమగు ఎట్టి సంస్కరణములును జరుగకపోఁగా, రానురాను ప్రభుత్వము ప్రజలవిశ్వాసమును గోల్పోయి దేశములో తీవ్రమగు అసంతృప్తి, ఆందోళనము వ్యాపించియుండెను.

(2)

ఈదీర్ఘపాలనమున ప్రభుత్వపద్ధతులను సాంఘిక అసమానత్వమును విమర్శించుచు వ్రాసినగ్రంథకర్తలు పెక్కండ్రు స్వాతంత్ర్యభావ బయలుదేరిరి. పదునేనవలూయిరాజుయొక్క ములవ్యాపనము. పసితనమునందున్న సంరక్షకులును తరువాత నా లూయిరాజును దుర్వ్యసనములలో జిక్కుకొని మొత్తము మీఁద నితరవిషయములలో నుపేక్షాభావము వహించి యుండినందున, ఆకాలమున మానవస్వాతంత్ర్యమునుగూర్చియు, మత, సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయములమీఁదను అనేక గ్రంథములును, ప్రకృతిశాస్త్రములును బయలువెడలి దేశము నందంతటను స్వతంత్రాభిలాషను వ్యాపింపజేసెను. కావున అప్పుడు నిలిచియున్న ప్రతిష్ఠాపనలకును, ఆచారములకును

ప్రజలలో వ్యాపించిన భావములకును సంబంధము లేకుండెను. దేశములో పదుమూడవ శతాబ్దపు ప్రతిష్ఠాపనలు, ఆచారములు నిలిచియుండెను. ప్రజలలో పదునెనిమిదవ శతాబ్దపు కోరికలు, భావములు వ్యాపించియుండెను. కావున గొప్పవిప్లవము రాకతప్పదని తలచుచుండిరి. పదునేనవలూయిరాజు 'మాతరువాత ప్రళయము వచ్చు'నని చెప్పుచుండెను.

ఆకాలమున ఫ్రెంచివాఙ్మయము కవిత్వముతోడను భాషావిషయికగ్రంథములతోడను తృప్తిచెందక, సమస్తవిధములగు జ్ఞానవ్యాపకములకు తోడ్పడినది. ప్రజాక్షేమముకొఱకు మిగులసమర్థులగువారు గ్రంథములను వ్రాసిరి. సంఘములోనిలోపములను వెక్కిరించుటకు మానుగ సంస్కరించు పద్ధతులను సూచించిరి. వాఙ్మయమును సాధనముగగొని విద్వాంసులు తమయభిప్రాయములను వ్యాపింపజేయ యత్నించిరి. చుట్టును వ్యాపించియున్న ఘోరమగు అక్రమములు, అనీతికరమగుప్రవర్తనలు, అమానుషమగు అసమానత్వము, విశేషమగు దౌర్భాగ్యము వీనింగూర్చి విమర్శించుటకు బూనుకొనిరి. రాజుయొక్క మంత్రులలోగూడ కొందఱు ప్రభుత్వమున గొప్పసంస్కరణములు కోరుచు గ్రంథములు వ్రాసిరి. 1739వ సంవత్సరముననే అర్గెన్సన ప్రభువు రాచకీయసంస్కరణములను కోరుచు నొకగ్రంథమును వ్రాసి "ఈ గ్రంథములోనిసిద్ధాంతములు ప్రజాపాలనమున కనుకూలముగానున్నవనియు, ప్రభుపరంపరయొక్క నాశనమునకుతోడ్పడునని

గ్రంథకర్తలు.

యు తలపవచ్చును. ఎట్టిసందేహమును పొందనక్కఱలేదు. ప్రభుత్వక్షేమమున కావశ్యకమగు రెండువిషయములు స్థాపించుటకు అడ్డము వచ్చు బుద్ధిహీనమగు విశ్వాసములను తొలగద్రోయవలెననియే నేను కోరునది. ఆ రెండువిషయము లేవన:—ఒకటి: అందఱు పౌరులును తమలో తాము సమానులుగ నుండుట; రెండవది: మనుష్యులు తాము కష్టపడి సంపాదించినదానిని అనుభవించుట. ప్రభువులు సోమరిపోతులు," అనివ్రాసెను. రాజు యొక్క మంత్రియగు మహాట్టు అనునాయన టూర్గో అను భూమిపన్నును తీసివేసి ప్రభువులు, మతగురువులు, సామాన్యజనలు మున్నగువారందఱును తమ తమ భూములవిరాప సమానముగ చెల్లించునటుల నొక పన్నును ఏర్పాటుచేయవలెనని వ్రాసెను. ఘాయిసెలు అను మంత్రికూడ సంస్కారములు కావలెనని వ్రాసెను. మతపీఠములు చాల ఎక్కుడుగనున్నవనియు వీనియన్నిటిమీదను సరిగా పన్నులు వేసినచో ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితి బాగుపడుననియుకూడ ఈయన వ్రాసెను.

ఫరాసుదేశములో స్వతంత్రవిప్లవమునకు కారకులగు గ్రంథకర్తలలో మిగులముఖ్యులు వాల్టేరు, రూసో అను వారు ఇద్దఱు.

వాల్టేరు 1694 గవ సంవత్సరమున పారిసునగరమున జన్మించెను. ఆయనతండ్రి యొక న్యాయాధిపతిగ నుండెను.

వాల్టేరు.

పదునాలుగవ లూయిరాజు ప్రొటెస్టెంటులను బాధించుటనుగూర్చి వాల్టేరు ఆక్షేపించెను. ప్రహసనములు వ్రాయుటలో వాల్టేరు అసమానప్రజ్ఞగల

వాడు. ఇరువదియొక్క సంవత్సరముల వయస్సున పదునాలుగవ లూయిరాజును వెక్కిరించుచు ప్రహసనము వ్రాసినాడని ఈయనను బాస్టిల్ కోటలో కొంతకాలము ఖైదుచేసిరి. ఈయన తన కెప్పుడు అపాయము కలుగునని తోచిన సమయమున జర్మనీలోనికి లేచిపోవుటకు వీలుగ నుండుటకై ఫ్రాన్సుయొక్క సరిహద్దుననున్న ఫెర్నీస్థానమున నివసించెను.

ఈయన కవిత్వము, నాటకములు, నవలలు, ప్రహసనములు, వ్యాసములు, చరిత్రలు, తత్త్వశాస్త్రము, రాజకీయశాస్త్రము, ప్రకృతిశాస్త్రములు మొదలగు సర్వవిషయములను గూర్చియు ననంఖ్యాకములగు గ్రంథములు వ్రాసెను. ఏబదిసంవత్సరములకాలము ఎడతెగకుండ గ్రంథములు వ్రాయుటచే యూరోపుఖండమునందంతటను ప్రభువుల చేతను, ప్రజలచేతను గౌరవాభిమానములతో నీయనగ్రంథములు చదువబడుచుండెను. ఈయన వ్రాసినగ్రంథములు ఎనుబదితొమ్మిది సంపుటములయ్యెను. సామాన్యజనులు చదువగలుగుటకై గ్రంథములు చౌకగ నమ్మించెను. గ్రంథవిక్రయమువలన విశేషధనమును సంపాదించెను. యూరోపులోని పెక్కుమంది రాజులును, ప్రభువులును, రాజకీయవేత్తలు నీయనకు స్నేహితులుగ నుండిరి. పరిపాలనలోను, శాసనములలోను, రాజ్యాంగవిధానములోను గల లోపములను మిగుల కఠినముగ విమర్శించెను. సాంఘికదోషములను అసమానత్వమును తీవ్రముగ ఖండించెను. నీతియు న్యాయమును వర్ధిల్లవలెననియు, మానవులకు సమానత్వమును స్వాతంత్ర్యమును

కావలెననియు తన ప్రతిగ్రంథమునందును వ్రాసెను. అన్నితరగతులప్రజలును చదువుకొనుటకు వీలుగ ననేకవిధముల వ్రాసెను. ఆకాలమున మానవులఆస్తియందు మాన ప్రాణములయందు ప్రభుత్వములకుగాని, మతగురువులకుగాని ఎట్టిలక్ష్యమును లేకుండెను. ప్రభుత్వముచేసెడి అక్రమములను నిర్భయముగ చూపినందునకును, రాజకీయాభిప్రాయములు వెల్లడించినందునకును శిక్షించుట మిగుల దుర్మార్గమగు అనాగరికపద్ధతియని వాల్టేరు వ్రాసెను. మతస్వేచ్ఛ లేకుండ జేయుట గొప్ప పాపకృత్యమనియు ఆయన వ్రాసెను. మానవజన్మము మిగుల ఘనమైనదనియు, అభిప్రాయములను వెల్లడించినందులకు మానవుని కష్టపెట్టుటకన్న అమానుషకృత్యము మరియొకటి యుండనేరదనియు ఆయన చూపెను. వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, మతస్వేచ్ఛ—ఈమూడును సంపూర్ణముగ నుండవలెనని ఆయన తీవ్రముగ వ్రాసెను. ప్రభుత్వములును, మతగురువులును ప్రజలస్వేచ్ఛను, నీతిని వృద్ధిచేయుటకై పుట్టినవారుగాని, ప్రజలస్వాతంత్ర్యము నణచుటకును. ప్రజలను భయపెట్టి మనసులోని యభిప్రాయములకు వ్యతిరేకముగ మాటలాడు కపటవేషధారులను గావించుటకు పుట్టినవారుకారని ఆయన విమర్శించెను. ఏబదిసంవత్సరములు ఆయన ఫ్రాన్సుదేశమున గొప్ప జ్ఞానజ్యోతియై ప్రకాశించెను. మానవులు పోగొట్టుకొనిన స్వాతంత్ర్యమును తిరుగ సంపాదించుటకు సంతతము కృషిసలిపెను. తన దేశములో రెండుతరములవారి అభిప్రాయములను భావములను ఉద్రేక

ములను పూర్తిగ మార్చివేసెను. "మేము విప్లవమునకు విత్తులు వెదజల్లుచున్నాము. విప్లవము రాకతప్పదు" అని వాల్టేరుపండితుడు 1762 వ సంవత్సరమున వ్రాసెను. 1778 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో ఎనుబదియేండ్ల సంవత్సరముల వయస్సున నీ మానవస్వాతంత్ర్యవాది పారిసునగరమును దర్శించెను. అపుడు ప్రజలు గొప్ప యుత్సవము చేసిరి. ప్రజలు గుంపులు గుంపులుగ నాయనదర్శనమునకై వచ్చి, యాయన యింటిముందట నాదినమంతయు వేచియుండిరి. "వాల్టేరు చిరజీవి యగుగాక!" అను ధ్వనులే ఏమూలజూచినను చెలరేగెను. దీనితో "రాజులు కూలిపోయెదరుగాక! తత్వజ్ఞులు ప్రబలుదురుగాక!" అను కేకలుకూడ మిళితములయ్యెను. అమెరికా స్వాతంత్ర్యవాదియగు బెంజమిన్ ఫ్రాంక్లిను తనమనుమని వాల్టేరు యొక్క యాశీర్వచనముకొఱకు గొనిపోయెను. ఆపిల్లవానిశిరమున తన హస్తముంచి "భగవంతుని యనుగ్రహమును, స్వాతంత్ర్యమును పొందుదువుగాక!" యని యా జగద్విఖ్యాతపురుషు డాశీర్వదించెను. మార్చి 30 తేదిని ప్యారిసునందలి యొక ప్రసిద్ధనాటకశాలలో నాయన రచించిన "ఐరీన్" అను నాటకమును ప్రదర్శించిరి. ఆయనశిరమున పుష్పకిరీటము నుంచిరి. స్త్రీలు తమ రెక్కలమీదనే యాయనను నాటకశాలనుండి బండిలోనికి గొనిపోయిరి. పురుషులాబండిని ఆయనయింటికీడ్చుకొనిపోయిరి. ఆయనమీదపడిన పుష్పగుచ్ఛములకును విరిదండలకును మేరలేదు. "నాబిడ్డలారా! నన్ను గులాబిపుష్పములక్రింద సమాధి వేయదలచుకొన్నారా!" అని యాముదుసలి ప్రశ్నించెను

తరువాత రెండునెలలకే మాపండితోత్తముఁడు ప్యారిసునగరమున చనిపోయెను. అతనిదేహమును సమాధిచేయుటకు రోమనుకాథలిక్కుమతగురువులు నిరాకరించిరి. ఆయన మేనల్లుఁడగు నొక మతగురువు రహస్యముగా నాయనకళేబరమును గొనిపోయి తనయాజమాన్యముక్రింద నున్న దేవాలయపుదొడ్డిలో పాతిపెట్టెను. ఇందునకై యీమతగురువు తనయుద్యోగమును గోల్పోయెను. మతస్వేచ్ఛను బోధించినందులకై ఆయనశవముమీఁద మతగురువులు తీర్చుకొనిన కసి యిది:

రూసో.

ఫ్రెంచివిప్లవమునకు అధికకారకుఁడగు రూసో 1712 వ సంవత్సరమున జన్మించెను. అతఁడు స్విడ్జరులాండులోని జెనీవాపట్టణమునందలి గడియారములుతయారుచేయు నొకకార్మికునికుమారుఁడు. చిన్నతనమున దిన్నగ చదువుకొనక, పనినైనను నేర్చుకొనక కొంతకాలము చెడుసాంగత్యములతో దేశదిమ్మరిగా నుండెను. ఆయనజీవితమంతయు కడుపేదరికమున గడచెను. ఆరోగ్యముకూడ సరిగా లేక అనేకకష్టములకు లోనగుచు, సంతోషమనునది యెఱుంగక, మనోవ్యాకులము కలిగియుండెను. అప్పుడప్పుడు ఆత్మహత్య గావించుకొనఁ దలచుచువచ్చెను. కాని, యెవరినికూడ లెక్కపెట్టక అత్యధికమగు ఆత్మగౌరవము కలిగియుండెను. ప్రభువైనను, మఱి యేయితరులైనను తనకు సహాయము చేయ యత్నించినచో దానిని తిరస్కరించుచుండెను. అవసరములను తగ్గించుకొని తాను కష్టపడి సంపాదించుకొనినదానితోమాత్రమె ఆయన జీవించెను. తనపిల్లల నయిదుగురిని అనాథశర

కాలయాపనము నొనరించెను. కపట వేషములలోనే నీతివంతమైన మనుష్యత్వము గలదనియు, సంఘమువలన వేషములుగనే తనపిల్లలు పెరుగవలయుననియు, అట్లు కాక ప్రయాసముగ కష్టపడి సంపాదించుకొనుదానితోడనే జీవింపవలెననియు ఆయనతలంపు. ఆయన మిగుల స్వతంత్రుడును, స్వభావపరిశీలకుడును నగు గ్రంథకర్త. పదునెనిమిదవశతాబ్దములోని ఫ్రాన్సుదేశప్రజలను మఱొకగ్రంథము ఉద్రేకపఱచినంతగ మఱి యేగ్రంథములు నుద్రేకపఱుపలేదు. ఈయనగ్రంథములు మిగుల తీవ్రభావములుగలిగి, యుద్రేకపూరితములై ప్రజాసమూహముల హృదయములను పూర్తిగ నాకర్షించెను. ఎల్లప్పుడును రాజులను ప్రభువులను గూర్చి యాయనకుం డత్యంతద్వేషమును, ప్రజాసమూహముపై యాయనకుం డత్యంతగౌరవమును గలిగి యుండెను. ఈయన విశేషముగ తోటలలోను కొండలలోను అడవులలోను సెలయేర్ల యొడ్డును పచ్చనిబయళ్ళమీదను కాలముగడపుచు సృష్టిసౌందర్యముల నత్యధికముగ ప్రేమించెను. మనుష్యుల సాంగత్యమునుండి దూరముగ నుండుటను ఒంటరితనమును కోరుచుండెను. మానవులను నాగరికత యనునది నైజధర్మములనుండి దూరముగజేసి మాలిన్యమును కలుగజేసినదనియు, నాగరికత యను విషవృక్షమును నరకివైచి మానవులు స్వచ్ఛమగు సహజస్వభావమును తిరిగి పొంది, సృష్టికర్తయొక్క యుద్దేశ్యములను నెరవేర్చవలెననియు నాయనముఖ్యసిద్ధాంతము. "సృష్టిలో అందఱు సమానులు. ఎక్కువ తక్కువలు లేవు. స్వభావముగ, నీతిగలవారు, శరీర

దార్ఢ్యము, స్వేచ్ఛ గలవారు. నాగరికత యనునది అసమానత్వమును అనీతిని తెచ్చినది. శరీరదార్ఢ్యమునుకూడ పాడు చేసినది. కొద్దిమంది స్వార్థపరులు విశేషమందిని దాసులుగ జేసికొనినారు. కావున నాగరికతను నిర్మూలముచేసి మనుష్యులలో స్వభావజన్యమగు నీతి, స్వాతంత్ర్యము, సమానత్వములను తిరిగి స్థాపించవలెను. విద్యగలవారికన్న విద్యలేనివారును. నాగరికులకన్న అనాగరికులును, భాగ్యవంతులకన్న బీదవారును ఎక్కువ నీతిమంతు" లని ఈయన వ్రాసెను. ఈయనయు, వాల్టేరును క్రైస్తవమతములోని మూఢనమ్మికలను తీవ్రముగ ఖండించిరి. మతసహనముకొరకు వాదించిరి. వాల్టేరు దేవుని నమ్మని నాస్తికుడు. రూసో దయాస్వరూపుడగు సృష్టికర్త గలడని నమ్ము ఆస్తికుడు. దాదాపుగ ఆయన ఏబదిసంవత్సరములవయస్సు వచ్చువరకును మంచిగ్రంథములు వ్రాయలేదు. అప్పుడాయనకు తీవ్రమగు సంకల్పముగలిగి 'న్యూహెలాయిసా' యను నవలను ప్రథమమున వ్రాసెను. దానిని ఫ్రాన్సుదేశములోని స్త్రీలును పురుషులును అత్యుత్సాహముతో చదివిరి. రూసో నాగరికత లేనపుడున్న స్వభావస్థితిని వర్ణించుటలో అసమానుడు. దానిని చదివినవారు రూసోయొక్క యభిప్రాయములలో పరవశులైపోయిరి. ఎన్నిగ్రంథములైనను కొద్దిగంటలలో ఖర్చగుచుండెను. ఫ్రాన్సుదేశములోనేగాక జర్మనీలోకూడ నీయన కీర్తి యత్యంతముగ వ్యాపించెను. ఈయనస్వదస్తూరి గలకాగితమును ముద్దుపెట్టుకొననిచ్చినందునకును, ఈయన నీరుత్రాగినపాత్రలో త్రాగనిచ్చినందునకును

స్త్రీలు దుకాణవాళ్ల కెంతసొమ్మయిన నిచ్చిరి. ఆయన వ్రాసినమాటలు ఒక గొప్ప పవిత్రతయొక్క సందేశములని ప్రజలు నమ్మిరి. సంఘములో గొప్పవారమని అనుకొనువారియొక్కయు, పుట్టుకవలన అధికులమని అనుకొనువారియొక్కయు, ధనికులయొక్కయు, బిరుదులు గలవారియొక్కయు దురాశ, మోసములు, దేశద్రోహములు హృదయాకర్షణముగ వర్ణించి సామాన్యప్రజలలో వారియం దగౌరవమును గలుగజేసెను. "గ్రామములను విడువవద్దు. బస్తీలలో చేరవద్దు. బస్తీలలో చెడిపోవుటకు మార్గములనేకములు గలవు. పల్లెటూళ్లే స్వచ్ఛమయినవి, నీతిమంతమయినవి," అని ఆయన, వ్రాసెను. పల్లెటూళ్ళలో కాయకష్టమువలన జీవించు పేదలయొక్క ఆడంబరములేక నీతిమంతమైనట్టియు, దురాశాప్రేరితములు కానట్టియు, మితవ్యయము గలిగినట్టియు, జీవితముగా సౌఖ్యవంతమయినవనియు ఈశ్వరునికి మిక్కిలి ప్రీతికరమనియు చూపెను. 1762 వ సంవత్సరమున ఆయన 'సోషల్ కంట్రాక్టు' అను గ్రంథమును వ్రాసెను. ఇది ఆయన వ్రాసిన గ్రంథములలోకెల్ల ముఖ్యమైనది. రాజులు దైవాంశసంభూతులనుసిద్ధాంతము స్వార్థపరులచే కల్పింపబడినదని వ్రాసెను. "దేశము ప్రజలది. ప్రజలు మొదట ప్రభుత్వములు లేక ఎవరి యిష్టమువచ్చిన విధమున వారు ప్రవర్తింపుచు సంపూర్ణ స్వేచ్ఛను గలిగియుండిరి. కాని కలహములు కలుగుచుండెను. శాంతి కలిగియుండుటకై ప్రజలందఱును కలిసి ప్రభుత్వము నేర్పఱచుకొనిరి. రాజులుగాని మరి యే ప్రభు

త్వమువారుగాని ప్రజ తేర్పఱచుకొనగ వచ్చినవారు. ప్రజలలాభమునకై ఏర్పడినవారు. ప్రజలకు నౌకరులు. తమ్ముగూ తాము పాలించుకొనుహక్కు ప్రజలది. ప్రజలచి త్తమే చట్టము. ఏప్రభుత్వమునందు ఎప్పుడు ప్రజల క్షేమము లేక పోయినను ఆప్రభుత్వమును కూలద్రోసి తమ యిచ్ఛవచ్చిన ప్రభుత్వమును ప్రజలు స్థాపించుకొనవచ్చును,'' అనునది ఆయన వ్రాసిన రాజకీయతత్వము. "ఏప్రభుత్వమును ప్రజల యిష్టమునకు వ్యతిరేకముగ ప్రవర్తించుటకు హక్కు లేదు. ప్రజల స్వాతంత్ర్యమును పాడుచేయుటకు అర్హతలేదు. స్వాతంత్ర్యము ప్రజల సహజధర్మము. ప్రజల స్వాతంత్రతను కాపాడుకొనుటకును ప్రజలచిత్తమునకు లోబడి నడచుకొనుటకును ప్రథమమున యొడంబడిక జరిగి ప్రజలు ప్రభుత్వముల నేర్పర చుకొన్నారు. కాలక్రమమున రాజులును ప్రభువులును ఇతర ప్రభుత్వములును మొదటి యొడంబడికకు భిన్నముగ ప్రజల స్వాతంత్రతను హరించి ప్రజలను దాసులనుచేసికొని, నిరంకు శత్వమును స్థాపించియున్నారు. ప్రజలు తమహక్కులనుగూర్చి మరచిపోయి బాధలకు లోనయినారు. తిరిగి స్వాతంత్రతను సంపాదించుకొనుట ప్రజలవిధియై యున్నది. దేశములోని ప్రజలందరును ఒకేజాతి. ఎక్కువ తక్కువలులేవు. అందరికిని దేశాభిమానమును తిరిగి బోధించవలెను. దేశాభిమానము స్వభావసిద్ధమయినది. దానిని ప్రజలు ప్రభుత్వముల యొత్తిడి క్రిందను, ప్రభుత్వములు చూపించు తప్పుడుత్రోవలలో పడియు మరచిపోయినారు. దేశములోని ఎక్కువ సంఖ్యాకుల

యభిప్రాయప్రకారము దేశప్రభుత్వము సాగవలెను. ఎక్కువమందియభిప్రాయప్రకారము భిన్నాభిప్రాయమిచ్చిన తక్కువమంది నడుచుకొనవలెను. ప్రభుత్వమునకును, ఏమతమునకును సంబంధ ముండకూడదు. ప్రజలు తమయిచ్ఛవచ్చిన ఏమతమునయినను అవలంబించుటకు సంపూర్ణమగు స్వాతంత్ర్య గలదు," అని ఆయన వ్రాసెను.

1762 వ సంవత్సరము మేనెలలో ఎమిలియాసు అను గ్రంథము నాయన రచించెను. ఈమూడుగ్రంథములును పరాసుప్రజలలో విశేషముగ దేశాభిమానమును పురిగొల్పి తీవ్రముగ స్వాతంత్ర్యభావములను కలుగజేసెను. అందరును ఈగ్రంథములను చదువుచుండిరి. 1762 వ సంవత్సరము జూన్ నెలలో నీయన గ్రంథములను తగులబెట్టుటకును, ఈయనను ఖైదుచేయుటకును ఫ్రెంచిరాజు తాకీదుచేసెను. ఈయన పరాసుదేశము విడిచి భార్యతోకూడ పారిపోయెను. యూరోపులో నేదేశమునకు పోయినను ఈయనను ఖైదుచేయుమని ఆప్రభుత్వమువా రుత్తరువిచ్చుచుండిరి. నిలుచుటకు నీడలేక ఎనిమిదిసంవత్సరము లీయన ఒకదేశమునుండి మరియొకదేశమునకు తిరిగెను. హాలండుదేశములో నీయనగ్రంథము లచ్చువేసి పరాసుదేశములోనికి వేలకొలది దిగుమతియగుచుండెను. సమస్తజాతులవారును ఆత్రతతో చదువుచుండిరి. గ్రంథము లచ్చొత్తించువారు ధనమును సంపాదించుకొనిరి. దీనిని పరాసుప్రభుత్వమువా రాపజాలకపోయిరి. కొంతకాలమున కీయనకు ప్రష్యారాజగు ఫ్రెడరిక్ ది గ్రేటు తనరాజ్యములో నివసించుటకు అనుజ్ఞయిచ్చెను. ఫ్రెడరిక్ రాజు

ఉదారస్వభావుడు. విద్యాపోషకుడు. ఈగొప్పగ్రంథకర్త కవపరమైన గృహనిర్మాణముగావించి యిచ్చెదననియు, ఈ యనపోషణ కగుఖర్చు తానే భరించెదననియు ఫ్రెడరిక్కు రాజు రూసోపండితునికి కబురుచేసెను. కాని రూసో యెట్టిధన సహాయము పొందుటకును నిరాకరించెను. "ఆకలి యయినచో గడ్డినిగాని చెట్లవేళ్లనుగాని తిని బ్రతికెదను. కాని ఎవరికిని పనిచేయకుండ ద్రవ్యమును పుచ్చుకొనను. రాజులకు వ్యతిరేకుడను; వ్యతిరేకముగ వ్రాసినాను; ఇంకను వ్రాయదలచుకొన్నాను. రాజులనుండి బొత్తుగా ధనసహాయమును పుచ్చుకొనను" అని రూసో ప్రత్యుత్తరము వ్రాసెను. ఇక్కడ ఫ్రెడరిక్కుది గ్రేటుయొక్క యౌదార్యమును రూసోపండితుని యొక్క ఆత్మగౌరవమును విశదమగుచున్నవి. ఆత్మగౌరవమును కాపాడుకొనుటకొరకు పేదరికమును స్వీకరించిన ఆంధ్రదేశపు మహాకవి బమ్మెర పోతనామాత్యుడు వ్రాసిన:

"బాలరసాలసాల నవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుగూడు భుజించుటకన్న సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసిమల గందమూలకౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై."

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము బాసి కాలుచే
సమ్మెట వ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్."

అను పద్యములలోని భావములనే ఫ్రాన్సుదేశపు మహాగ్రంథ కర్తయగు రూసోకూడ తెలిపియున్నాడు. సుప్రసిద్ధుడగు గ్రంథ కర్తను అతని యభిప్రాయములతో నేకీభవించనంతమాత్ర ముచేత కష్టములపాలు సేయుట అవివేకియని ఫ్రెడరిక్కురాజు తలంచి తనరాజ్యములో రూసోకు నిలువనీడ నిచ్చెను.

ప్రష్యాలోని యొక సరస్సునొడ్డుననున్న మోటియరుస్సు అను నొక చిన్నగ్రామములో రూసో యొక చిన్నకుటీర మును నిర్మించుకొని తన భార్యతోగూడ కాపురముండెను. అచటి సృష్టిసౌందర్యములకు మిగుల సంతోషించెను. అచటి అడవులలోను కొండలలోను సంచరించుచుండెను. అచట తనకు ఆత్మశాంతి కలిగినదని ఆయన ఎంచెను. తన పుస్తక ములు కొనినవర్తకుడు తనకు పంపుచున్న నెలకు పదునారు రూప్యముల రాబడితో ఆయన తృప్తినొందెను. మరియు ఆయనయు ఆయనభార్యయు చేతితో జరీనితయారుచేసి విక్రయించి నెలకు అయిదారురూప్యములను సంపాదిం చుచుండిరి. యూరపుయొక్క అన్నిజాతులకు చెందినప్రజ లేమి, విద్వాంసులేమి, ఇన్ని ప్రభుత్వములవారిచే బహిష్క రింపబడిన ఈ ప్రఖ్యాతపురుషుని దర్శించుటకు వచ్చుచుం డిరి. అనేకవిషయములలో ఆయనయభిప్రాయముల నరయు చుండిరి. తన నాలుగునెలలకుమార్తెను ఎటుల పెంచవలెనని వర్టెంబర్గుప్రభువు రూసోపండితునియభిప్రాయము కను గొనెను. తమ ప్రభుత్వముపై తిరుగబడి ప్రజాస్వామ్యము నేర్పఱచుకొనిన కార్సికను ప్రజలు తమకొక రాజ్యాంగవిధా

నమును తయారుచేసి యియ్యవలెనని రూసోను కోరిరి. కాని కొలదికాలములో మోంటియర్సునుండికూడ రూసో పారిపోవలసివచ్చెను. అచటిజనులు రోమనుకాథలిక్కు క్రైస్తవులు. మతగురువుల పలుకుబడిలో నుండిరి. రూసో 'ఎమిలియసు' అను గ్రంథములో క్రైస్తవమతములోని కొన్ని మూఢవిశ్వాసములను ఖండించి, క్రైస్తవమతగురువులు మతము పేర చేయుచున్న అక్రమములను తీవ్రముగా విమర్శించి, సర్వమతములకును సమానగౌరవస్వాతంత్ర్యములు కావలెనని వ్రాసెను. ఈగ్రంథమును తగులబెట్టవలెనని ప్యారిసులోని ప్రధానక్రైస్తవాచార్యు డాజ్ఞాపించెను. రూసో నాస్తికుడనియు క్రైస్తవమతమునుండి వెలివేసితిమనియు ప్రకటించెను. స్విట్జర్లాండులోని క్రైస్తవమతగురువులు రూసోపండితుని దూషించుచు వ్రాసిన కరపత్రములు మోంటియర్సు గ్రామము చేరెను. మోంటియర్సులోని రోమనుకాథలిక్కుమతగురువు "నాస్తికుడగు" రూసోపై ప్రజలలో నాగ్రహము కలిగించెను. రూసో నిజముగా నాస్తికుడు కాడు. త్రిత్వమును నమ్మక ఒక్కడగు భగవంతుని నమ్మువాడు. అయినను క్రైస్తవగురువులీయనను నాస్తికుడనిరి. మోంటియర్సుప్రజలు రూసోను చంపుటకు యత్నించిరి. రూసో తన భార్యతోగూడ అచటినుండి పారిపోయి, స్విట్జర్లండుదేశములోని బర్నిపట్టణపుపాలనలో చేరిన చాల కొద్దియిండ్లుగల యొక చిన్నద్వీపములో నివసించుటకు వెళ్లెను. కాని కొద్దిరోజులలో బర్నిప్రభుత్వమువారు అచటినుండి పదునైదుదినములలో లేచిపోవలసినదని రూసోకు ఉత్తర్వు

చేసిరి. "నన్ను వెళ్ళిపొమ్మను ఉత్తరువును దయచేసి రద్దుపరుపుడు. నాయావజ్జీవమును మీచెఱసాలలో నన్నుంచుడు. ఒకచోటనుండి మరియొకచోటకు, అచటినుండి మరియొకచోటకు పారిపోజాలను. నాస్వంతఖర్చుమీద నాస్వంతభోజనము చేసికొనుటకు అనుజ్ఞనిచ్చి నన్ను యావజ్జీవమును ఖైదులోనుంచిన అచట ఆత్మశాంతి గలిగియుండెదను" అని ఈమహాపురుషుడు వ్రాసిన యుత్తరము జెర్మినిప్రభుత్వముయొక్క హృదయమును కరిగించలేకపోయెను. అందుమీద రూసో యాప్రదేశము విడిచి భార్యతోకూడ నెచటకో పోనుద్దేశించి త్రోవలో ప్యారిసులో దిగెను. అచటిప్రజలలో గలిగిన ఉత్సాహము వర్ణనాతీతము. ఫ్రెంచిమంత్రులును ఈయనయందు విశేషగౌరవము గలిగియుండిరి. రహస్యముగా నీయనదర్శనము చేసిరి. దేశమంతయు నీయనను పూజించుచున్నందున ప్రభుత్వమువారు కూడ చూచిచూడనట్టూరకొనిరి. ఇరువది దినములలోనే యీయన ఆంగ్లేయపండితులఆహ్వానముమీద నొకరాత్రివేళ బయలుదేరి ఇంగ్లాండుకు వెళ్లెను. లండనులో దిగగానే ఆంగ్లేయప్రజలును ఆంగ్లేయపండితులును ఈయనకు అసమానమగుగౌరవము జూపిరి. ఇంగ్లాండులోని కొండలప్రదేశమున నొకగ్రామమున ఈయన స్థావరమేర్పఱచుకొని శాంతముగా కాలము గడపుచుండెను. ఇంతలో ఇంగ్లాండులోని కొందఱు పండితులకును రూసోకును కలహములుకలిగెను. అయిదునెలలలో ఇంగ్లాండును వదలిపెట్టి తిరిగి ఫ్రాన్సును చేరెను. ప్రజలకును ప్రజానాయకులకును ఈయనయందు

గల గౌరవముచేత ఫ్రెంచిరాజు ఆయనజోలికి రాలేదు. ఫ్రాన్సులో అనేకచోటులతిరిగి తుదకు ప్యారిసును చేరెను. ఇచట పదెనిమిది సంవత్సరములు నివసించెను. అనారోగ్యమువలనను పేదరికమువలనను విశేషముగ బాధపడి, 1778 సంవత్సరము జులై నెల 2 వ తేదీన ప్యారిసుకు సమీపమునన్న ఎర్మినన్‌విల్లి యనుగ్రామమున మరణించెను. ఈయనశవమును పాతిపెట్టుటకు మతగురువులు రాలేదు. దాని నొక చిన్నసరసులోని ద్వీపమున మిత్రులు పాతిపెట్టిరి. తరువాత పదునారు సంవత్సరములకు, ఈయనసిద్ధాంతముల ననుసరించి ఫ్రాన్సులో విప్లవముకలిగి రాజులుపోయి ప్రజాప్రభుత్వ మేర్పడిన కాలమున, ప్రజాప్రభుత్వమువారు ఫిరంగుల మ్రోతలతోను వాద్యములతోను, గొప్పయుత్సవముతోను ఈయనఅస్థుల నీద్వీపమునుండి తెచ్చి ప్యారిసులోని గొప్పవారిసమాధు లుంచబడిన ప్రదేశములో ప్రజలజయజయధ్వానములమధ్య పాతిపెట్టిరి.

వాల్టేరు రూసోపండితులు మాత్రమేగాక మాంటెస్క్యూ మొదలగు పెక్కుగ్రంథకర్తలు సుప్రసిద్ధగ్రంథములను వ్రాసిరి. ఆకాలమున డిడ్రో మొదలగు గ్రంథకర్తలు ఫ్రెంచివిజ్ఞానసర్వస్వమును బయలుదేరదీసి అందులో సమస్తవిషయములను గూర్చియు ప్రజలకు జ్ఞానమును కలుగజేసిరి. తత్వజ్ఞులని కొందరును, ఆర్థికశాస్త్రజ్ఞులని కొందఱును, గ్రంథకర్తలు అనేకగ్రంథములను వ్రాసిరి. మొత్తముమీద ఆకాలపు అందఱుగ్రంథకర్తలును ప్రజ లనుభవించుచున్న సమస్తకష్టములకును స్వతంత్రతను పొందుటకన్న వేరుతరుణోపాయము

లేదని వ్రాసిరి. సమానత్వము, సోదరత్వము, స్వాతంత్ర్య అనునవి సర్వదుఃఖనాశనకరమగు మంత్రములుగ ప్రజలచె జపించబడెను.

(౧)

యూరపుఖండములోని వివిధదేశములు వివిధరాజుల క్రిందనుండి వేరువేరు పరిపాలనలను గలిగి రాజకీయైక్యత లేకపోయినను యూరపుఖండమున కంతకును

నవీన యుగ ధర్మములు

రెండు ప్రతిష్ఠాపనలు మతవిషయిక సాంఘిక ఐక్యతను కలుగచేసినవి. ఒకటి రోములోనున్న క్రైస్తవ ప్రధానమతాచార్యుడగు పోపుయొక్క పీఠము. రెండవది మొఖాసాప్రభుపరంపర. మధ్యమయుగమున ఈరెండు ప్రతిష్ఠాపనలకును యూరపుఖండమంతయు సంపూర్ణముగ లోబడినది. యూరపునందంతటను క్రైస్తవమతము అవలంబించబడినది. మహమ్మదీయమతములో పోరాడి యూరపులో వ్యాపించకుండ చేసిరి. క్రైస్తవుల కందరకును పోపు ప్రధానగురువయ్యెను. యూరపుఖండములోని యన్ని దేశములలోని యందరు మతగురువులును, నందరు ప్రజలును పోపుయొక్క యధికారములకు ఆజ్ఞలకు లోబడియుండిరి. ప్రతిదేశములోను పోపుయొక్క ప్రతినిధులు ప్రబలిరి. పోపుయొక్క నిరంకుశరాజ్యము యూరపులో స్థాపించబడెను. పోపును ధిక్కరించువాడు ఘోరశిక్షలకు పాలయ్యెను. ఇటులనే రాజులును ప్రభువులును యూరపులోని అన్నిదేశముల లోను ప్రజలపైన రాజ్యముచేసిరి. అన్నిదేశములలోని రాజు

లును ప్రభువులును కలిసి యొకేకులము. ఒకరి కొకరికి బంధుత్వము లుండెను. అన్ని దేశములలోని మతగురువులును కలిసి మరియొకకులము. దేశాభిమానముకంటె కులాభిమానము ప్రాముఖ్యముగ నుండెను. కాలక్రమమున పోపును, ఆయనఅనుచరులును ప్రజలకు నైతికాభివృద్ధిని కలుగజేయు ఆధ్యాత్మికగురువులుగ నుండుటమాని ప్రజలను అజ్ఞానములోను మూఢవిశ్వాసములలోను దాస్యములోను ముంచి ప్రజలనుండి సొమ్మును కాజేయుచుండిన దురాశాపరులైరి. దైవాజ్ఞలకంటె పోపులయాజ్ఞలు ప్రధానములయ్యెను. అటులనే రాజులును ప్రభువులును ప్రజలను సంరక్షించి చక్కగా పాలించి వారికి సౌఖ్యమును కలుగజేయుటకుమారుగా, ప్రజల స్వాతంత్ర్యములను ఆస్తులను హరించి వారిని నొక్కిడిచేయుచుండిరి. 14౫౦ వ సంవత్సరమునుండియు యూరపుఖండములో ప్రాచీనగ్రీకుభాషలోని స్వతంత్రభావములు వ్యాపించుచుండుటయు అచ్చుకని పెట్టబడి గ్రంథములు విరివిగా వ్యాపించుటయు చూచియున్నాము. మానవాత్మ ఎప్పుడును బంధములను త్రెంచుకొని స్వతంత్రమునుపొంద యత్నించును. యూరపులో మానసికవికాసము కలుగగనే హేతువాదము, విమర్శన, సత్యాన్వేషణము, విచక్షణాశక్తి ప్రబలెను. మతసంస్కరణము ప్రారంభమయ్యెను. పోపుయొక్కయు మతగురువులయొక్కయు నిరంకుశత్వముపై తిరుగుబాటు కలిగెను. ప్రతివారును స్వయముగా క్రైస్తవవేదమును చదువుకొని మతగురువుల మధ్యవర్తిత్వములేక ఈశ్వరుని ఆరాధించుటకై బైబిలును దేశభాషలలోనికి తర్జుమా చేసిరి.

విగ్రహారాధన ఖండించబడెను. పోపుకు లోబడి యుండనక్కర లేదు. బైబిలులోనున్న సంగతులే ప్రమాణములుగాని, పోపు యొక్క ఆజ్ఞలు ప్రమాణములుగావు. ఆత్మస్వాతంత్ర్యము ప్రకటింపబడెను. ఇట్లు ఆత్మస్వాతంత్ర్యమును స్థాపించినవా రిలో ముఖ్యుడు మార్టినులూథరుమహామహుడు. ఈయన స్థాపించిన ప్రొటెస్టెంటుమతమును జర్మనీదేశీయులు ప్రథమమున అవలంబించిరి. జర్మనీ మతస్వాతంత్ర్యోద్యమమునకు ప్రథమస్థానము వహించినది. పోపులును, వారి యనుచరులును, వారిస్నేహితులగు రాజులును, ప్రభువులును ప్రొటెస్టెంటులను ఘోరముగ శిక్షించి మరణములపాలుచేసినకొలదియు వీరు ధర్మసంస్థాపనకొరకుచేయుచున్న త్యాగములును, పొందుచున్న కష్టములును ప్రజలహృదయముల నాకర్షించిప్రొటెస్టెంటు మత ము త్వరితముగ వ్యాపించెను. నిరంకుశత్వమునకును స్వతంత్రతకును కలిగిన పోరాటములో స్వతంత్రతయే తనయొక్క ఆత్మశక్తివలనను స్వార్థత్యాగమువలనను జయమందినది. నిరం కుశత్వముయొక్క చెరసాలలు, మరణశిక్షలు స్వతంత్రత నణపజాలకపోగ, స్వతంత్రతకు జయింపనలవిగాని శక్తిని కలుగజేసినవి. ఈ మతస్వతంత్రతలోనుండి యూరపులో రాజకీయస్వతంత్రత బయలుదేరినది. రాజులయొక్కయు ప్రభువులయొక్కయు నిరంకుశత్వమును నిర్మూలముచేసి రాజ కీయస్వతంత్రమును సంపాదించుటకు ఫ్రాన్సుదేశము ముందుగ దారితీసినది. రాజకీయస్వతంత్రసంపాదనకు ముఖ్యులగు వారు వాల్టేరు, రూసోపండితులు. వికసించినఆత్మ ఎట్టి దాస్య

మునకును సహించనేరదు. ఒకవిషయమున స్వాతంత్ర్యము, మఱి యొకవిషయమున దాస్య మనునది అస్వాభావికము. కావున మతస్వాతంత్ర్యపోరాటమున కలవాటుపడిన యూరపుఖండము రాజకీయస్వాతంత్ర్యపోరాటమును ప్రారంభించినది. నిరంకుశత్వమును కూలద్రోసి స్వాతంత్ర్యమును పొందుట నవీనయుగము యొక్క ప్రథమలక్షణము. మరియు మతాభిమానమును కులాభిమానమును అణచివైచి దేశాభిమానమును ప్రజ్వరిల్లజేయుట రెండవధర్మము. యూరపుఖండమున నవీనయుగము 1453 వ సంవత్సరముతో ప్రారంభమయినదని కొందరు చరిత్రకారులును, ఫ్రెంచివిప్లవముతో ప్రారంభమయినదని మఱికొందరు చరిత్రకారులును వ్రాసియున్నారు.



# ఫ్రెంచి స్వాతంత్ర్య విజయము

## పదునొకండవ అధ్యాయము

## పదునారవ లూయిరాజు

(1)

పదునారవ లూయిరాజు రాజ్యభారమును వహించుట తోడనే తుర్గోను ప్రధానమంత్రిగను, మాలెషెర్బ్సుని రెండవ మంత్రిగను ఏర్పఱచుకొనెను. వీ రుభయులును తుర్గో మంత్రి. దేశాభిమానులు. దేశములో వ్యాపించిన నూతనస్వాతంత్ర్యభావములు గలవారు. రాజ్యాంగములో మంచి సంస్కరణములు గావించి ప్రభుత్వమును ప్రజానురంజకముగ జేయ నుద్దేశించినవారు. పన్నులు వృద్ధిచేయకుండగను క్రొత్తఋణములు చేయకుండగను మితవ్యయమువలన పరిపాలనము సాగించవలెనని వీరు రాజునకు సలహానిచ్చిరి. వీరు మంత్రులుగ నేర్పడిన ఒకటిన్నర సంవత్సరములలో పది కోట్లఋణమును తీర్చిరి. దేశములో వ్యాపించిన అసంతృప్తిని

తగ్గించుటకు తుర్గోమంత్రిశేఖరుడు కొన్ని సంస్కరణములను ప్రారంభించెను. రిచ్లూమంత్రికి పదుమూడవలూయిరాజును, కాల్బర్టుకు పదునాలుగవలూయిరాజును చేయూతనిచ్చి ప్రోత్సహించినట్లు తుర్గోమంత్రికి పదునారవ లూయిరాజు సహాయపడినచో బహుశః ఫ్రెంచివిప్లవము కలుగకనే యుండెడిది. కాని రాజుచుట్టును చెడుసలహాదారు లుండిరి. తుర్గోమంత్రి చేయుచుండిన మితవ్యయమునకు రాణి కసమ్మతిగలిగెను. రాణియొక్క విలాసములకు కోరిన ధనమియ్యనందున తుర్గోయందామె కయిష్టము కలిగెను. బీదలను బాధించుచుండిన 'కర్వీ' అను పన్నును తీసివేసి ప్రభువులభూముల మీదకూడ పన్ను విధించవలెననియు రాజ్యములోని అందఱి భూములను కొలిచి అన్నిభూములపైనను సమానముగ భూమిపన్ను విధించవలెననియు, తుర్గోమంత్రి యత్నించెను. మరియు రయితులచేత బలవంతముగా ప్రభువులు పనిచేయించకూడదని ఉత్తర్వుచేసెను. కావున ఆయనకు వ్యతిరేకముగ ప్రభువులు గొప్ప యాందోళనముచేసిరి. "ఈరోజున సామాన్యజనులతో పాటు మాభూములమీద పన్నులు, వేయుచున్నారు. రేపటి రోజున సామాన్యజనులతోపాటు రోడ్లమీద కూలిపనిచేయించెదరు" అని ప్రభువులు చెప్పిరి. కొన్ని వర్తకసంఘములకును కొందరు వర్తకులకునుగల ప్రత్యేక వర్తకపుహక్కులను తీసివేసి తుర్గోమంత్రి దేశములో వర్తకస్వేచ్ఛను పరిశ్రమల స్వేచ్ఛను నెలకొలుప యత్నించెను. ఇది కూడదని ధనికులగునట్టియు ప్రత్యేకహక్కుల ననుభవించుచున్నట్టియు వర్త

కులు రాజుతో చెప్పుకొనిరి. మతస్వేచ్ఛను పూర్తిగ నెల
కొలిపి దేశభ్రష్టులైన ప్రొటెస్టెంటులను తిరిగి దేశములోనికి
రానియ్యవలెనని తుర్గో సలహానిచ్చెను. ఇందుకు రోమనుకాథ
లిక్కుమతగురువులు తుర్గోను ద్వేషించిరి. యావత్తుదేశము
లోను ఒకేచట్టము, ఒకేవిధమగు కొలపాత్రలు, తూనికరాళ్ళు
అమలులో పెట్టుటకు తుర్గో యుద్దేశించెను. ప్యారిసుపార్ల
మెంటులోని న్యాయాధిపతులును, ప్రభువులును, ధనికులును,
రోమనుకాథలిక్కు మతగురువులును తుర్గోమంత్రికి వ్యతిరేకు
లైరి. రాజుయొక్క సలహాదారులు తుర్గోమంత్రికి వ్యతిరేక
ముగ కుట్రసలిపిరి. రాజు బలహీనుడై కుట్రకు లొంగెను.
ముందుగ మాలెషెర్బీని మంత్రిత్వమునుండి తీసివేసెను. 1776
సంవత్సరము మే నెల 12 వ తేదీన తుర్గోమంత్రినికూడ రాజు
తీసివేసెను. అవసరమయిన సంస్కరణములను ధైర్యముగా
జేసి రాజ్యమును కాపాడదలచిన తుర్గోవంటి పేరెన్నికగన్న
రాజకీయధురంధరుని రాజు తీసివేసిన తరువాత ప్రజావిప్లవము
తప్ప ఫ్రాన్సుదేశమునకు వేరుశరణ్యము లేదయ్యెను. దూరదృష్టి
గల బుద్ధిశాలులందఱును విప్లవము రాకతప్పదని అనుకొనిరి.

తుర్గోమంత్రిని తీసివైచినతరువాత నాయన మూసి
వేయించిన ఏబది వర్తకసంఘములును తిరిగి తెరపించిరి.
దెబ్బలుకొట్టి నిర్బంధముగా రాజబాటలలో
నెక్కరుమంత్రి. రయితులచేత కూలిపని చేయించిరి. ఆయన
స్థానమున 1776 సంవత్సరము అక్టోబరునెల
లో లూయీరాజు నెక్కరును ప్రధానమంత్రిగా నియ

మించెను. ఈయన తుర్గోటు సాటియగు రాజ్యాంగవేత్తకాడు. ఈయనకు దృఢాభిప్రాయములు లేవుగాని యోగ్యుడు. దయగలవాడు. ప్రజలకు మేలుచేయవలెనను కోరికగలవాడు. ఆర్థికవిషయములలో సమర్థుడు. 1778 వ సంవత్సరములో ఫ్రాన్సునకు ఇంగ్లాండుతో యుద్ధము సంభవించెను. ఇంగ్లాండుపై తిరుగుబాటుచేసి తమస్వాతంత్ర్యముకొరకు యుద్ధము గావించుచున్న అమెరికాప్రజలకు సహాయము చేయవలెనని ఫ్రెంచిప్రజలు కోరిరి. అందుమీద గత్యంతరములేక లూయిరాజు ఇంగ్లాండుతో యుద్ధమునకొప్పుకొనెను. యుద్ధపువ్యయమును భరించుటకు మార్గములు మూడే గలవు. క్రొత్తపన్నులను వైచుట, లేదా పరిపాలనాఖర్చులను తగ్గించుట, లేదా ఋణము తెచ్చుట. మొదటిమార్గ మప్పటిస్థితిలో నసంభవము. రెండవది కొంతవఱకే సాధ్యము. కావున మూడవమార్గమునే నెక్కరవలంబించెను. ఆయనకు కావలసిన ఋణము త్వరగలోనే దొరకెను. మధ్యమతరగతిప్రజ లుత్సాహముతో ఋణముల నిచ్చిరి. కాని ఇందువలన ప్రభుత్వమువారి ఋణము విశేషముగా హెచ్చెను. నెక్కరుమంత్రిచే యత్నించిన కొన్ని సంస్కరణములను ప్యారిసులోను ఇతరచోట్లనుగల న్యాయాధిపతు లెదిరించగా రాజు తనకు సంపూర్ణమగు చేయూత నియ్యనందున నెక్కరు 1781 వ సంవత్సరములో మంత్రిపదవికి రాజీనామా నిచ్చెను. నెక్కరుయొక్క సామర్థ్యమును నమ్మి ప్రభుత్వమునకు ఋణమునిచ్చినవారి కందఱకును ఆశాభంగము కలిగెను.

(౨)

స్వాతంత్ర్యము: సమానత్వము.

యూరపుఖండమునం దంతటను కొంతవరకు నూతనాభిప్రాయములు వ్యాపించియే యున్నవి. వాల్టేరుగారి వ్రాతలకు ఫలితముగ రుష్యాలోని కాథరీనురాణియును, ప్రష్యారాజు రెండవ ఫ్రెడరిక్కును, స్పెయిను, పోర్చుగలు, టస్కనీ, సావాయి, ఫార్మరాష్ట్రాధిపతులును ప్రజాభివృద్ధికరమగు కొన్ని సంస్కరణములు కావించిరి. కాని ఇతర దేశములలో కొంతమంది రాజ్యాంగవేత్తలు, విద్వాంసులు, ఆర్థికశాస్త్రవేత్తలు, మొదలగువారిలో మాత్రమే నీనవీనభావములు ప్రబలెను. సామాన్యజను లజ్ఞానములో మునిగియుండిరి. ఒక్క ఫ్రాన్సుదేశములోమాత్రము సామాన్యప్రజలలో నసాధారణమగు చంచలనము గలిగినది. యూరపుఖండములోకెల్ల ఫ్రాన్సు విద్యావ్యాపకమునందును, నాగరికతయందును నగ్రస్థానము వహించి యుండెను. నూతనభావములు, నూతనాదర్శములు, నూతనాశలు ఫ్రాన్సుదేశములోని ప్రతిపట్టణమునందును ప్రతిపల్లెయందును వ్యాపించినవి. రాజకీయసంస్కరణపక్షమువారు పత్రికలను, పుస్తకములను, కరపత్రములను దేశమునందంతటను వెదజల్లిరి. "స్వాతంత్ర్యము, సమానత్వము" అను పదములు ప్రతిపరానువాసనినోటను ఉత్సాహముతో నుచ్చరించబడుచుండెను. ఇవే ఫ్రెంచిప్రజ లారాధించు దేవతలయ్యెను. దేశముయొక్క పరిపాలనాహక్కు ప్రజలదేయని రూసోపండితుడు వ్రాసియుండెను. యోగ్యులగు మంత్రులను

లూయిరాజు పదభ్రష్టులను జేసినకొలదియు ప్రజాభిప్రాయమున ననుసరించి పాలించుటకు లూయి అసమర్థుడని ప్రజలకు బోధపడుచుండెను. రాజునం దయిష్టము దినదినమునకు ప్రబలమగుచుండెను.

అమెరికా స్వాతంత్ర్య యుద్ధము.

ఇంగ్లాండున కప్పటివరకు లోబడియుండిన అమెరికా వలసరాష్ట్రములప్రజలపై నింగ్లీషు పార్లమెంటువారు నూతన పన్నులను విధించిరి. అమెరికావారు తమ ప్రతినిధులులేని ఇంగ్లీషుపార్లమెంటువారికి తమ మీాద పన్నులు వేయుటకు హక్కు లేదని చెప్పిరి. పన్నులిచ్చుటకు నిరాకరించిరి. ఏప్రజలమీాద నైనను వారిచే నెన్నుకొనబడిన ప్రతినిధులే పన్నులు విధించుటకు హక్కుగలదు గాని ప్రపంచములో మరియెవ్వరికిని హక్కు లేదని ఖండితముగా తెలిపిరి. ఇంగ్లీషువారు బలవంతముగా పన్నులను వసూలుచేయుటకు యత్నించిరి. అమెరికా వారికిని ఇంగ్లీషువారికిని యుద్ధము ప్రారంభమయ్యెను. 1776వ సంవత్సరము జులై 4 వ తేదీన అమెరికా ప్రజలు స్వాతంత్ర్య ప్రకటనము గావించిరి. "అమెరికాసంయుక్తరాష్ట్రముల ప్రజలమైన మేము భగవదుద్దేశ్యమైనట్టియు, ప్రతిజాతికిని జన్మహక్కైయునట్టియు, స్వాతంత్ర్యమును మాప్రతినిధిసభద్వారా లోకమునకు ప్రకటించుచున్నారము. మాపక్షమున ధర్మము గలదని నమ్మి, ధర్మస్వరూపుడగు భగవంతునిసహాయము నపేక్షించుచున్నాము" అని ప్రచురించిరి. రాజుగాని ప్రభువులుగాని లేని సంపూర్ణప్రజాస్వామ్యము (రిపబ్లికు) ను స్థాపిం

చుకొనిరి. మనుష్యులందఱును సమానముగానే సృష్టింపబడినారనియు, దుర్మార్గమైన ప్రభుత్వమును నిర్మూలనము గావించుటకు స్వభావమగు హక్కు ప్రజలకు గలదనియు, ఈహక్కు అన్నికాలములలోను అన్ని జాతులకును గలదనియు రూసో "సోషల్ కంట్రాక్టు" అను గ్రంథములో వ్రాసిన ధర్మమునే, అమెరికావారనుష్ఠించినందున అమెరికా స్వాతంత్ర్యప్రకటనము ఫ్రెంచిప్రజలలో మితిలేని యుత్సాహము కలిగించెను. ప్రథమమున అమెరికావారపజయముల నొందిరి. బ్రూక్లిన్వద్ద ఇంగ్లీషుసేనాధిపతి, హౌ, అమెరికనులను నోడించెను. అమెరికనుసేనాని వాషింగ్ట నోడిపోయి న్యూయార్కు పట్టణము నింగ్లీషువారివశము చేయవలసివచ్చెను. 1777 సంవత్సరము వేసంగిలో వాషింగ్టనుసేనాని ఫిలడెల్ఫియాను వదలవలసివచ్చెను. ఇంగ్లీషుసైన్యములు స్కూల్కిలువరకు అమెరికనుసేనలను నెట్టివేసెను. ప్రతిచోటను అమెరికావారోడిపోయి అమెరికాప్రజలలో నిరాశగలిగెను. ఇంగ్లీషువారితో నెటులయిన సంధిచేసికొనుట యుక్తమని కొందఱు చెప్పసాగిరి. కాని ఇంతలో 13 అక్టోబరు తేదీన సరటోగా మిట్టస్థలములలో ఇంగ్లీషుసైన్యములను అమెరికావారు సంపూర్ణముగ నోడించి బర్గాయిన్ సేనాధిపతిని సైన్యములతోకూడ ఖయిదుచేసిరి. 1778 సంవత్సరము ఫిబ్రవరినెలలో ఫ్రెంచివారు అమెరికావార సహాయమునకు వచ్చిరి. ఇప్పటినుంచియు అమెరికను పక్షము విజృంభించినది. ఇంగ్లీషువారు ఆగ్రహపరవశులై సమర్థులగు సేనానులక్రింద సైన్యములను పంపిరిగాని లాభము

లేకపోయెను. 1781 సంవత్సరములో ఇంగ్లీషు సేనాధిపతి కారన్‌వాలీసుప్రభువు నార్తుకారొలీనాను పట్టుకొనయత్నించి విఫలతనొంది యార్కుటౌనుమీదికి వచ్చెను. అమెరికనుల సేనాని జార్జివాషింగ్టన్ ముట్టడించెను. సముద్రముమీద ఫ్రెంచివారియోడసైన్యము క్రొత్తసైన్యము ఇంగ్లాండునుండి రాకుండ కాపాడెను. ఇంగ్లీషుసైన్యములు పూర్తిగ నోడింపబడినవి. కారన్‌వాలీసుప్రభువు అమెరికనులచేతిలోచిక్కెను. ఫ్రెంచివారికాసేనాధిపతి డి గ్రాసి ఇంగ్లీషువారియోడసైన్యము నోడించెను. ఇంగ్లాండులోని ప్రధానమంత్రి నార్తుప్రభువు "అంతా అయిపోయినది" అని చెప్పి రాజీనామా నిచ్చెను. 1782 సంవత్సరము నవంబరు నెలలో ఇంగ్లీషువారు సంధిచేసికొనిరి. ప్యారిసుసంధివలన అమెరికాసంయుక్తరాష్ట్రముల స్వాతంత్ర్యము సంపూర్ణముగ నంగీకరించబడెను.

(3)

స్టేట్సుజనరలును సమావేశపరచుట.

నెక్కరు రాజీనామానిచ్చినతరువాత ఫ్రెంచి రాజు, కలోనును ప్రధానమంత్రిగా నియమించుకొనెను. ఈయన కూడ ప్రభుత్వమునకై ఋణములు చేయసాగెను. ప్రత్యేకహక్కుల ననుభవించుచుండిన ప్రభువులు మొదలగు వారితో కలహించక నెటులనో కాలము గడుపుచుండెను. రాణీగారు కోరిన ధనమును మంత్రి యామెకిచ్చుచు ఆమెయనుగ్రహమునకు పాత్రుడయ్యెను. కాని కలోనుమంత్రికి కొద్ది కాలము

లోనే ఋణములు దొరకుటలేదు. ఆదాయముకన్న వ్యయ మెక్కువయయ్యెను. యావత్తుపరిపాలనాపద్ధతిని, పన్నులను, ఆదాయవ్యయములను సంపూర్ణముగా సంస్కరించినగాని ప్రయోజనములేదని యాయన గ్రహించెను. కాని సంస్కరణ మునకు యత్నించగానే ప్రభువులు మొదలగువారియాటంక ములు గలిగెను. 1787 వ సంవత్సరములో కలోనుమంత్రి రాజీ నామా నిచ్చెను. తరువాత రాణీగారి సిఫారసుమీద నేర్పఱచ బడిన మంత్రి బ్రియన్ కూడ ఏమియు చేయజాలకపోయెను. ఇట్టి తరుణములో (స్టేట్సుజనరల్) దేశప్రతినిధిసభను పిలువ వలసినదని అన్నిపక్షములవారినుండియు గొప్ప యాందోళనము ప్రబలెను. రాజు అసమర్థుడనియు మంత్రులు నిస్సహాయులనియు అందరికిని తెలిసెను. ప్రతిసంవత్సరము ప్రభుత్వమువారి యాదాయముకంటె వ్యయము 20 లక్షల సవరను లెక్కువగు చుండెను. ఇదిగాక ప్రభుత్వమువారు తెచ్చిన ఋణములకు వడ్డీ యియ్యవలసియున్నవి. దేశములో ధర లెక్కువయినవి. కర వు వ్యాపించినది. వ్యవసాయము, పరిశ్రమలు క్షీణించినవి. ప్ర జాభివృద్ధికరమగు పనిచేయుటకును ప్రభుత్వములో ద్రవ్యము లేదు. రాజకుటుంబముయొక్కయు వారిచుట్టుచేరు బృందము యొక్కయు పరిజనులయొక్కయు విలాసములు, వైభవములు, దుర్వ్యసనములు మొదలగువానికి కావలసినఖర్చుమాత్ర మావంతయైన తగ్గలేదు. సైన్యములలో అసంతృప్తి ప్రబలెను. బీదరయితులు, పనివాండ్రు, కూలీలు, అక్కడక్కడ తిరుగు బాటులు ప్రారంభించిరి. ప్రతినిధిసభను 1664 సంవత్సరము

నుంచియు ఫ్రెంచిరాజులు కూర్చలేదు. ఇప్పుడు పదునారవ లూయిరాజు దేశములోని యాందోళనముబట్టి ప్రతినిధిసభ కూడునట్లాజ్ఞాపించెను. తాను ప్రజలవిశ్వాసమును బడయుటకై ప్రజానురంజకుడుగ నుండిన నెక్కరును తిరిగి ప్రధానమంత్రిగ నియమించెను. 1778వ సంవత్సరం ఆగష్టులో బ్రియన్ రాజీనామా నిచ్చెను. కాని యొక గొప్పసమస్య బయలుదేరెను. తమ ప్రతినిధులసంఖ్యతో సమానముగనే మతగురువుల ప్రతినిధుల సంఖ్యయు సామాన్యప్రజలప్రతినిధులసంఖ్యయు నుండవలెనని ప్రభువులు కోరిరి. దేశములో ప్రభువులును మతగురువులును స్వల్పసంఖ్యాకులనియు, సామాన్యప్రజలు రెండున్నరకోట్లు గలరనియు, సామాన్యప్రజాప్రతినిధుల సంఖ్య, ప్రభువులప్రతినిధులు, గురువుల ప్రతినిధులు కలిసిన మొత్తముకంటె, తక్కువగా నుండుటకు వీలులేదనియు, ప్రజలాందోళనము జరిపిరి. చిన్న మతగురువులు సామాన్య ప్రజలలోనే చేరిరి. మరియొక తగాదా గలిగెను. ప్రభువుల సభ వేరుగాను మతగురువులసభ వేరుగాను ప్రజాప్రతినిధిసభ వేరుగాను నుండవలయుననియు నిర్ధారణచేయువిషయములో ఒక్కొక్కసభ కొక్కొక్క వోటుచొప్పున నుండవలెననియు ప్రభువులును గురువులును చెప్పిరి. ప్రభువులు, గురువులు, ప్రజలు అందఱుకలసి ఒకేసభలో చేరి చర్చించి విషయముల నన్నిటిని పరిష్కారము చేయవలెననియు, ఎక్కువసంఖ్యాకుల యభిప్రాయమునుబట్టి తీర్మానములు కావలెననియు, ప్రజలు చెప్పిరి. ఈ రెండువిషయములమీదను చర్చలు విశేషముగా

జరిగెను. వాదప్రతివాదములు ప్రబలెను. అక్కడక్కడ దెబ్బలాటలకు దిగెను. ప్రభువులను, వారిపక్షము వారిని ప్రజలు గేలిసేయసాగిరి. అప్పటివరకు, ప్రభువులయొక్కయు మత గురువులయొక్కయు ప్రత్యేకహక్కులన్నియు నాశనముచేసి, ప్రజలందఱికిని సమానహక్కులు సమానభాధ్యతలుగల ప్రభుత్వముగా చేయవలెనని మాత్రమే ప్రజలు కాంక్షించిరి. రాజునందు ప్రజలకు ద్వేషములేదు. రాజును తీసివేయవలెనని ప్రజలు తలచలేదు. కాని లూయిరాజునకు, ప్రజలకు నాయకుడగుటకుతగిన వివేచనగాని నైపుణ్యముగాని లేదు. ఆకాలపు నూతనాభిప్రాయముల తీవ్రతను గుర్తించలేకపోయెను. ప్రభువులయిష్టమును కోల్పోవుటకు భయపడి తుదకు ఆరాజు సింహాసనమును గోల్పోయెను. ఆబీసైను అనునాయన వ్రాసిన కరపత్రములో ప్రజాపక్షమువారి యభిప్రాయములు స్పష్టీకరించబడెను. "ప్రజాప్రతినిధిసభ (మూడవశాఖ) అనగనేమి?" అని ఆయన ప్రశ్నించి, "అదే ఫ్రెంచిజాతి" యని జవాబు వ్రాసెను. "ప్రభువులు, మఠాధిపతులు కలిసి 15 లక్షలులేరు. తక్కినప్రజలు2½కోట్లుగలరు. ప్రభువులు, మఠాధిపతులు సోమరిపోతులు. ఇతరులు కష్టముచేయగా దాని ననుభవించు తిండిపోతులు. జాతియొక్క యభివృద్ధి కాటంకము గలుగజేయువారు. సామాన్యప్రజలను దాస్యములోను కష్టపరంపరలోను ముంచెడివారు. వీరు లేకపోవుటవలన ఫ్రెంచిజాతి కేమియు నష్టముగలదా? లేదు. లేకపోగా ఫ్రెంచిజాతి స్వేచ్ఛను సౌఖ్యమును పొందును. సామాన్యప్రజలే సమస్త ఉపయోగకర

మైన పనులను చేయువారు" అని ఆయన వ్రాసెను. మతగురువులలో మతాధిపతులు ప్రభువుల పక్షమునను, చిన్నగురువులు సామాన్యప్రజల పక్షమునను చేరిరి. ఈవాద ప్రతివాదములమధ్య నెక్కరుమంత్రిసలహాపైన మొదటిశాఖయగు ప్రభువుల ప్రతినిధులసంఖ్యయును, రెండవశాఖయగు మతగురువుల ప్రతినిధులసంఖ్యయును కలిసినదానికంటె కొంచెమెక్కువగా మూడవశాఖయగు ప్రజలప్రతినిధుల సంఖ్యయుండునట్లు రాజు తీర్మానించెను. 25 సంవత్సరముల వయస్సుపైగలవారెల్లరు మూడవశాఖయొక్క సభ్యులను ఎన్నుకొనుట కర్హులని తీర్మానించబడెను. మూడు శాఖలును కలిసి కూర్చొనవలెనా లేక విడివిడిగా కూర్చొనవలెనా యను విషయము నిర్ధారణచేయక విడిచిపెట్టెను.



ఫ్రెంచి

# స్వాతంత్ర్య విజయము

పండ్రెండవ అధ్యాయము

## ఫ్రెంచి విప్లవము

(1)

1789 వ సంవత్సరము మేనెల 5 వ తేదీన వర్సేల్సు పట్టణమున దేశప్రతినిధిసభయగు స్టేట్సుజనరలు సమావేశమయ్యెను. అతివైభవముతో పదునారవ లూయిరాజు దానిని తెరచెను. 270 మంది ప్రభుప్రతినిధులును 291 మంది మతగురువులును 554 మంది ప్రజాప్రతినిధులును హాజరైరి. ప్రజాప్రతినిధులపక్షమున ఫ్రెంచిజాతి యుండెను. మూడుశాఖలును కలిసి యొకే సభగా చేరి చట్టములు చేయవలెనని ప్రజాప్రతినిధులు కోరిరి. కొద్దిమంది ప్రభుప్రతినిధులును మరి కొంతమంది మతగురువులును మాత్ర మిందుకు సమ్మతించిరి.

టెన్నిసుకోర్టు శపథము.

తక్కినవా రొప్పుకొనలేదు. లూయిరాజు ప్రజల ఆస్తికిని ప్రాణమునకును సురక్షితమునిచ్చు చట్టములు తాను చేయుటకేమి, కొంత అధికారమును ప్రజాప్రతినిధులవశము చేయుటకేమి సిద్ధముగ నుండెనేగాని, ప్రభువులు, ప్రజలు, మతగురువులు ననుభేదము నాశనమై అందరును ఫ్రెంచిజాతిలో చేరిపోవుట కొప్పుకొనలేదు. తన రాచరికముతోపాటు ప్రభువులు, గురువులు, ప్రజలు ననుభేదముకూడ నుండవలెననియే నిశ్చయించెను. రాణికిని ఇదే అభిప్రాయము. నెక్కరుమంత్రి ద్రవ్యసంబంధమయిన ఇబ్బందులనుండి ప్రభుత్వము తొలగిన తరువాత, ప్రభువులును మతగురువులును కలిసి యొకసభగాను, ప్రజాప్రతినిధులు వేరుసభగాను చేరుట యుక్తమని తలచెను. ముందుగా ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితినిగూర్చి నెక్కరు గొప్ప యుపన్యాసమునుచేసి, మూడు శాఖ లేయేవిషయములను కలిసి చర్చించవలెనో, వేనిని విడిగా చర్చించవలెనో, నిర్ధారణచేయుటకు కమీషనగుం నేర్పాటుచేయవలసినదని సలహా నిచ్చెను. తమ్ము నెన్నుకొనిన ఫ్రెంచిప్రజలయుద్దేశ్యప్రకారము, ప్రభువులును మతగురువులును అనుభవించుచుండిన ప్రత్యేకహక్కులును ప్రత్యేకలాభములును సంపూర్ణముగా రద్దుపరచనిది, మరియొకపని ప్రారంభించగూడదను దృఢనిశ్చయముతో ప్రజాప్రతినిధులు వచ్చిరి. తక్కిన రెండుశాఖలును తమతో చేరనిది, ఏపనియు తాము చేయమని ఖండితముగా చెప్పిరి. దినదినమున కీపోరాటము హెచ్చెను. ప్యారిసుపట్టణములోని బీదజనులకు తిండి ప్రియమై క్షుద్బాధ

హెచ్చుగా నుండెను. ప్రజాపక్షవాదులు తీవ్రమైన యుపన్యాసములు గావించుచుండిరి. ప్రజలలో నాగ్రహము హెచ్చెను. ప్రభువులు, మతగురువులు నాశనముగానిది తమకు కడుపునిండ భోజనము దొరకదని ప్రజలు తలచసాగిరి. ఒకే సభగా కూడుటకు వ్యతిరేకపక్షమువారినందరిని ప్రజలు తొందరచేయసాగిరి. రాజధానియొక్క ప్రజాభిప్రాయమువలన స్టేట్సుజనరల్ లోని ప్రజాప్రతినిధులపట్టుదల హెచ్చెను. జూన్ 17 వ తేదీన ప్రజాప్రతినిధులు (నేషనల్ ఎస్సెంబ్లీ) జాతీయసభ యను పేరును బెట్టుకొని, ప్రభువులును, మతగురువులును తమతో చేరినను, చేరకపోయినను తామే దేశముయొక్క నిజమయిన ప్రతినిధులమనియు, దేశముతరఫున సర్వకార్యములను చేయుటకు తమకే సర్వాధికారము గలదనియు తీర్మానించిరి. కొంతమంది ప్రభువులును చాలమంది సామాన్యమతగురువులును వీరిలో చేరిరి. రాజునకును రాణికిని నాగ్రహముకలిగెను. జాతీయసభను సభచేయుచున్న మందిరములోనుండి, దానిని బాగుచేయవలసియున్నదనుమిషమీద వెడలగొట్టించిరి. ప్రజాప్రతినిధులందరును (టెన్నిసుకోర్టులో) బంతులాడుకొను ప్రదేశములో సమావేశమై, జాతీయప్రభుత్వమును స్థాపించువరకును తాము విడిపోమని జూన్ 20 వ తేదీన శపథములు చేసికొనిరి. బయట ప్రజలగుంపు లాతురతతో కనిపెట్టుకొని యుండిరి.

జూన్ 23వ తేదీన లూయీరాజు దర్బారుచేసెను. ప్రతినిధుల నందరిని సమావేశపరచెను. రాజుయొక్క చిత్తమును మంత్రులు వినిపించిరి. "మూడుశాఖ ప్రజాప్రతినిధులు లును విడిపిడిగనే కూడవలసినది. రాజుగారి రాజు సెదిరించుట యుత్తరువుపైన నేదైన ప్రత్యేకవిషయముల లో అందరును కలియవచ్చును. ముఖ్యముగా మతసాంఘిక రాజకీయవిషయములను ప్రత్యేకముగానే చర్చించవలెను. ఇది రాజుగారియాజ్ఞ. అందరుప్రతినిధులును వెంటనే వెళ్ళిపోయి రేపు ఎవరికి నిర్ణయమయిన ప్రదేశమున వారు ప్రత్యేకముగా కూడవలసినది. ఇట్లు చేయనిచో రాజుగారే తన ప్రజలసౌఖ్యమున కవసరమగు చర్యలు జరుపుదురు," అని మంత్రులు సెలవిచ్చిరి. దర్బారు చాలించగనే రాజును, చాలమంది ప్రభువులును, మతగురువులును వెడలిపోయిరి. మిగిలినవారును, ప్రజాప్రతినిధు లందరును తమ స్థానములను వదలలేదు. ప్రజాప్రతినిధి బైలి యగ్రాసనాధిపత్యమును వహించెను. రాజుయొక్క యుద్యోగస్థుడగు డిబ్రీ అచటకు వచ్చి రాజుగారియుత్తరువును వింటిరాయని యడిగెను. ప్రజాప్రతినిధులకునాయకుడుగానున్న మిరాబో రాజుగారినోట పలికించబడిన మాటలను వింటిసి. మేము లేచిపోము. మమ్మును వెడలగొట్టుమని మీ కుత్తరువులున్నచో, పటాలములను తెచ్చి వెళ్ళగొట్టుడు" అని ప్రత్యుత్తరమిచ్చెను. రాజు చర్య పుచ్చుకొనుటకు శంకించెను. పటాలములను బంపినను సైనికభటులు కాల్చుటకు నిరాకరించెదరు. పైగా

రాజధానిలో తిరుగుబాటులు జరుగును. ఈవిధముగా రాజు ఆలోచించి, లేచివచ్చిన ప్రభువులను మతగురువులను తిరుగ వెళ్ళి ప్రజాప్రతినిధులతో చేరి ఒకే సభగా నేర్పడవలసినదని చెప్పిపంపెను. ప్రజాపక్షమునకు సంపూర్ణజయము కలిగెను. (జూన్ 26.)

(2)

బాస్టిలుకోట నేల మట్టము గావింప బడుట.

ఈ కాలయాపనవలన ప్యారిసునగరవాసులలో నుద్రేకము హెచ్చెను. ప్రతిదినము వేలకువేలు ప్రజలు సభలు జరిపి వక్తలు గంభీరోపన్యాసముల గావించుచుండిరి. రాజుయొక్క బంధువుడగు ఆర్లియన్సుప్రభువు ప్రభుపక్షమునువదలి ప్రజాపక్షము చేరెను. ఆయననగరునకంటి యొక పెద్ద తోటగలదు. దానిచుట్టును పుస్తకములను కాఫీని పలహారములను అమ్ము దుకాణము లుండెను. ఆమధ్యనున్న విశాలమైనప్రదేశములో వేలకొలందిప్రజలు సమావేశమగుచు ఉపన్యాసములను వినుచుండిరి. అక్కడకు పోలీసువారుగాని ప్రభుపక్షవాదులుగాని వచ్చుటకు భయపడుచుండిరి.

ప్రభుత్వమువారు శాంతిని నెలకొలుపవలెనను మిష మీద ప్యారిసు,వర్సేల్సుపట్టణములయొద్ద స్విసు, జర్మను సైన్యముల నుంచిరి. ప్యారిసును ముట్టడించి సైనికశాసనమును ప్రవేశ పెట్టుదురేమోయని ప్యారిసుప్రజలు భయపడుచుండిరి. ఈ సైన్యములను తీసివేసి ప్రజల యిచ్ఛికభటులను తయారుచేయవలసినదని జాతీయప్రతినిధులు కోరిరి. కాని రాజు సమ్మతించ

లేదు. నెక్కరుమంత్రి రాజునకువిషయములలో సహాయము చేయుటలేదు. కాన జులై 11 వ తేదీన రాజు నెక్కరుమంత్రిని పదభ్రష్టుని జేసి ఫ్రాన్సుదేశమునుండి వెంటనే లేచిపోవలసినదని యాజ్ఞాపించెను. నెక్కరును తీసివేసినందుకు జాతీయసభవారు ఖండితముగా తమ అసమ్మతిని రాజునకు తెలిపిరి. కాని ప్రయోజనము లేదయ్యె. నెక్కరుండగా రాజు పటాలములను జాతీయసభపైనగాని రాజధానిమీఁదగాని ప్రయోగించ డనునమ్మకము ప్రజల కుండెడిది. నెక్కరును వెళ్ళగొట్టిరనువార్త మరునటియుదయమున ప్యారిసుపట్టణములో వ్యాపించెను. ప్రజలలో కలిగిన యాందోళనమునకు మేరలేదు. రాజు వెంటనే సైన్యములను ప్రయోగించి ప్రజావిప్లవమును బలవంతముగా నణచి వేయునని భయము హెచ్చెను. సభావేదికపై కామిల్ డెమొలీఁ అను యువకు డెక్కి "పౌరులారా! నెక్కరును వెళ్ళగొట్టినారు. దేశాభిమానుల నందఱను నరికివైచుటకు యత్నించుచున్నారు. లేవండి! తుపాకులు తీసికొని లేవండి! ప్రతివారు నౌక పచ్చనియాకులుగల కొమ్మను గుర్తుగా పుచ్చుకొని బయలుదేరుడు!" అని హెచ్చరించెను. చెట్లకొమ్మలు తీసికొని ప్రజలు బయలుదేరిరి. నెక్కరుయొక్క పటమును తీసికొని ప్రజలు ఊరేగింపుతో వచ్చుచుండగా, రాజుయొక్క జర్మనుగుఱ్ఱముదళము ప్రజలపై బడి త్రొక్కి గుంపులను చెదరగొట్టినది. ప్రజలయాగ్రహమునకు మేరలేదు. మూఁడు వేల అయిదువందలమంది ఫ్రెంచిసైనికులు ప్రజలపక్షమునకు వచ్చిచేరిరి. తుపాకులు, కత్తులు, గొడ్డళ్ళు మొదలగు

సవి తీసికొని ప్రజలు బయలుదేరిరి. ప్రభుత్వమువారి సైనిక సామగ్రిగల యింటిపైబడి ఆయుధసామగ్రిని తీసికొనిపోయిరి. రాజసైన్యము లేనిమిషమునవచ్చి తమ్ము ముట్టడించునో యనుభీతితో ముఖ్యస్థలములలో ఫిరంగులనా పెట్టి పార్యిసునగరసంరక్షణామునకు వలయు సన్నాహముల నెల్ల గావించిరి.

జూలై నెల 13 వ తేదీయంతయు విప్లవము జరిగెను. ప్రజలు సుంకపుశాలలను తగులబెట్టిరి. చెరసాలలను తెరచి ఖైదీలను విడుదల చేసిరి. రొట్టెల అంగళ్లను కల్లుదుకాణములను దోచుకొనిరి. రాజు వెర్సేల్సులో నుండెను. ప్యారిసులోని యధికారు లెవరును ఆటంకపరచలేదు. ఆటంకపఱచుటకు భయపడిరి. మ్యునిసిపలు సభ్యులు హొటేలు డివెల్లి అను నగరులో కూర్చొని ప్రజలకు సలహానిచ్చుచుండిరి. ప్రజలను సాయుధులగు జాతీయ సైనికులుగ తయారుచేయుచుండిరి. ఇంతలో బాస్టిలుకోటలోని రాజసైన్యములు కోటమీద ఫిరంగుల నెక్కించిరి. ఇట్టి ముఖ్యమగు ప్రదేశము శత్రువుల స్వాధీనమందుండుట అపాయకరమని తలచి జులై నెల 14 వ తేదీన ప్రజాసైన్యము బాస్టిలు కోటను ముట్టడించ నిశ్చయించెను. లండనులోని 'టవరు' వలె ఫ్రెంచిప్రభుత్వవిరోధులను తరచుగా విచారణలేకుండ నీ కోటలో పడవేయుదురు. బాస్టిలుకోట ప్రభుత్వవిద్వేషుల కారాగృహము. లోపల కొద్దిసైన్యములు గలవు. సేనాధిపతి యాకోటను వదలుటకు సమ్మతించక పోరాడెను. అయిదు

గంటలు యుద్ధము జరిగిన తరువాత ప్రజాసైన్యములు బాస్టిలు కోటను పట్టుకొని లోన జొరబడిరి. ప్రభుత్వసైన్యాధిపతి సేనలతో లొంగెను. సైన్యాధిపతిని ప్రజలు చంపిరి. ప్రభుత్వ సైనికులకు క్షమాపణ నొసంగిరి. బాస్టిలుకోటలోని ఖైదీలను విడుదలచేసి దానిని సంపూర్ణముగా నేలమట్టము గావించిరి. ఆరాత్రి బాస్టిలుకోట పడిపోయిన దనుసంగతి వెర్సేల్సులోని రాజునకు తెలిసెను. 'ప్రజలు తిరుగుబాటు చేసిరి,' అని మాత్రమే ఆయన చెప్పెను. 'అయ్యా! తిరుగు బాటుకాదు. విప్లవము ప్రారంభమయినది,' అని లైకోర్టు ప్రభువు చెప్పెను. ఫ్రెంచిసైన్యములు ప్రజలలో చేరిపోయి నందుకు రాజు చింతించెను.

రాజు ప్రజాచిత్తము నెదిరించజాలక ప్రజలకు లొంగెను. జాతీయసభయొక్క కోరికలు మన్నించెను. విదేశసైన్యములను తీసివేసెను. నెక్కరును తిరిగి ప్రధానమంత్రిగా చేసెను. ఈసంతోషవార్తలను ప్యారిసుప్రజలకు తెలుపుటకై జాతీయ సభవారు వెర్సేల్సునుండి ఎనుబదిఎనిమిదిమంది ప్రతినిధులను ప్యారిసునకు బంపిరి. ప్యారిసు ప్రజలు మిగుల నుత్సాహమును పొందిరి. అమెరికా స్వాతంత్ర్యపక్షమున నింగ్లాండుతో యుద్ధముచేసియున్న సుప్రసిద్ధ ఫ్రెంచిసేనాని లఫయాతుప్రభువును ప్యారిసులోని జాతీయసైన్యములకు సేనాధిపతిగా చేసిరి. గణిత శాస్త్రవిద్వాంసుడును, టెన్నిసుకోర్టుశపథకాలమున అధ్యక్షతవహించినవాడునువగు బైలీని ప్యారిసునగరపురపాలకసంఘమున కధ్యక్షుడుగ నెన్నుకొనిరి. ఫ్రెంచివిప్లవమునకు గుర్తుగా నీలము

ఎరుపు, తెలుపు, మూడురంగులుగల జెండా ఎత్తబడెను. "ఈ మూడురంగుల జెండాప్రపంచమంతను సంచరించును!" అని లఫయతుసేనాని చెప్పెను.

రాజుయొక్క సోదరుడగు ఆర్టాయిప్రభువును మరికొందరు ప్రభువులును ఫ్రాన్సును విడిచి పారిపోయిరి. తన సురక్షితముకొరకు రాణి వెర్సేల్సులో భయపడుచుండగా, లూయిరాజు కొంతమంది జాతీయ సభ్యులను వెంటగొని ధైర్యముతో ప్యారిసునగరమునకు వెళ్లెను.

రాజు ప్యారిసును దర్శించుట.

ప్యారిసునగరము వెలుపలనే మ్యునిసిపలు అధ్యక్షుడగు బైలీ రాజునెదుర్కొని, రాజభక్తిసూచకముగ నగరపుతాళపుచెవులను రాజునకర్పించెను. 'ప్రజలు రాజుగారి హృదయమును వశపరచుకొనినా'రని నమ్రతతో బైలీ చెప్పెను. రాజు ప్రజల జయజయధ్వానములమధ్య ప్యారిసునగరములో ప్రవేశించెను. రాజు హోటలు డివెల్లికి పోయి తనటోపీలో మూడురంగులపతాకమును ధరించి, మేడమీదనుండి ప్రజలకు దర్శనమిచ్చెను. బయట మూగియున్న వేలకొలది జను లానందపరవశులై "మా రాజును దేవుడు రక్షించును గాక!" "మా దేశమును దేవుడు రక్షించుగాక!" యను కోలాహలధ్వనులు చేసిరి. రాజును తీసివేయవలెనని అంతవరకును ప్రజలు కోరలేదు. ప్రభువులు ప్రజలు ననుభేదములు పోయినరాజరికమునే ప్రజలు కాంక్షించిరి. రాజు ప్రజల యిష్టానుసారము పాలించవలెనని కోరిరి.

(3)

రాష్ట్రములలో విప్లవము.

రాజధానిలోవలెనే రాష్ట్రములలోకూడ ప్రజాందోళనము హెచ్చెను. ప్రభువులకుగల ప్రత్యేకలాభములును ప్రత్యేకహక్కులును నాశనమై, ప్రభువుల యొత్తిడినుండియు దౌర్జన్యమునుండియు విముక్తులగుటకు ప్రజలు తొందరపడుచుండిరి. ఇంకను జాతీయసభ ఏమియును చేయదయ్యె. ప్రజలు ప్రభువులకు పన్నుల నిచ్చుటకు నిరాకరించిరి. సుంకపుశాలలను, టోలుగేట్లను తగులబెట్టసాగిరి. జూలై ౧౪వ తేదీన బాస్టిలుకోట నాశనమైన దనువార్త రాష్ట్రములలోని యాందోళనపరుల కుత్సాహము కలుగజేసెను. ప్యారిసులో నొక ప్రభుత్వోద్యోగి 'ఫౌలన్' అనునాయన ప్రజల కాకలియయిన యెడల గడ్డితినవచ్చునని చెప్పినందున నాయనను, ఆయన అల్లుని దీపపుస్తంభమునకు గట్టి ప్రజ లురిదీసిరి. ప్యారిసు పురపాలకసంఘమువారును, జాతీయసైన్యములును, ప్యారిసు ప్రజలలో శాంతిని నెలకొల్పుచుండెను. అనేకరాష్ట్రములలో నక్కడక్కడ ప్రజలు గుంపులుగ బయలుదేరి, ప్రభువుల యిండ్లను, వారియిండ్లలోని భూదానశాసనములను తగులబెట్టసాగిరి. ప్రజలకు వ్యతిరేకపక్షమువారు వచ్చి తమ పంటలనన్నిటిని నాశనముచేయుదురని వదంతి బయలుదేరినందున ప్రజలు సాయుధులు కాసాగిరి. మధ్యమతరగతిప్రజలును, విద్యార్థులును, మ్యునిసిపలుసంఘములును ఐచ్ఛికభటుల నేర్పాటు చేసి, శాంతిని నెలకొల్పిరి. దీనివలన నొకసంగతి స్పష్ట

మయ్యెను. రాజుయొక్కయు, ఆయన యుద్యోగస్థులయొక్కయు నధికారము రాజధానిలోను, రాష్ట్రములలోనుగూడ నదృశ్యమై, ప్రభుత్వోద్యోగు లధికారము చలాయించలేక యూరకొనిరి. సైన్యములు ప్రజలలో చేరెను. ప్రజలు ఆయుధపాణులైరి. ప్రజలే శాంతికొఱకు ప్రయత్నములు చేసికొనిరి. తమమీాద నధికారముచేయుటకును, తమ కష్టముల నీడేర్చుటకును జాతీయసభమీాదనే ప్రజలు తమదృష్టిని నిల్పుకొనియుండిరి.

జాతీయసభ జాతీయసభయొక్క ప్రజాప్రతినిధిశాఖలో కొందఱు సుప్రసిద్ధవిద్వాంసులు, 16 గురు వైద్యులు, 102 రు భూస్వాములు, 212 మంది న్యాయవాదులు, కొందఱు వర్తకులు, కొందఱు మేజస్ట్రీటులు, చిన్న రైతులు, 12 మంది ప్రభువులు, ఇద్దఱు మతగురువులును నుండిరి. అర్థచంద్రాకారముగ నధ్యక్షునియెదుట సభ్యుల యాసనము లమర్చబడెను. సభ్యులయుపన్యాసము లందఱికి వినబడునట్లుగ నుపన్యాసవేదిక నేర్పాటుచేసిరి. జాతీయసభలో నాలుగువిధములైన యభిప్రాయములు గలసభ్యులు కూర్చుండియుండిరి. అధ్యక్షుని కుడివైపున ప్రభుజాతియొక్కయు మతగురువులజాతియొక్కయు ప్రత్యేకహక్కుల నన్నిటిని నిలువబెట్ట యత్నించుచుండిన ప్రభువులును మతగురువులును కూర్చుండియుండిరి. వారి కెడమవైపున పుట్టుకవలన ప్రభువులైనవారుగాక, ధనమువలన ప్రభువులైనవా రుండితీరవలయుననియు, అట్టివారు లేనిది రాజరికమునకు ముప్పు వాటిల్లుననియు

ఖభిప్రాయపడుచుండినవారు కూర్చుండిరి. శాసనసభలకు వోట్ల నిచ్చువా రప్పటియింగ్లాండులోవలె విశేషమగు ఆస్తిగలవారుగా నుండవలయుననియు, శాసనసభలలో భూఖామందులే పలుకు బడి గలిగియుండవలయుననియు, ఇంగ్లాండులోవలె రెండుశాసన సభ లుండవలెననియు వీరియభిప్రాయము. అన్నివిధములైన అల్లరులను వెంటనే యణచివేయవలయుననికూడ వీరు కోరు చుండిరి. వీరు స్వల్పసంఖ్యాకులుగ నుండిరి. అధ్యక్షుని యెడమ వైపున రాజులేని ప్రజాస్వామ్యమును, ప్రతిమానవునికిని వోటు ను, ఆస్తియున్నను లేకున్నను యోగ్యతనుబట్టియే అన్నియుద్యో గముల కర్తృతయును కోరు అతివాదులు ఇరువది ముప్పది మంది కూర్చుండియుండిరి. వీరికి నాయకులు పేషఁ, రాబిస్పి యరులు. రాజును వెళ్ళగొట్టుట వీరి యుద్దేశ్యమేగాని, సాధ్య పడదని తలచి యూరకొనిరి. ఈ అతివాదులకు కుడివైపునను, పైనచెప్పిన రెండవపక్షమువారి కెడమవైపునను, ఏడెనిమిది వందలసభ్యులు మిరాబో, లఫయాతు, అబీ సైసు మొద లగువారి నాయకత్వముక్రింద కూర్చుండిరి. సర్వసమానత్వ మును ప్రత్యేకహక్కుల నాశనమును వీరు కోరిరి. ప్రజాపరి పాలనమును కాంక్షించిరి. ప్రభుత్వము దృఢముగా నుండు టకు రా జుండితీరవలయునని వీరి అభిప్రాయము. కాని నిజ మయిన అధికారము ప్రజాప్రతినిధులచేతులలోనే యుండి, రాజు నామమాత్రావశిష్టుడుగా నుండవలెననియే, వీరియుద్దే శ్యము. ప్రజలయందు వీరికి సంపూర్ణవిశ్వాసము గలదు. ప్రస్తు తము కొన్నిచోటుల కొన్నిఅల్లరులు జరుగుచున్నను, తిరిగి

వెనుకంజవేయుటకు వీలులేని సరియైన పునాదులమీద జాతీయ ప్రతిష్ఠాపనలను నిర్మించిన తరువాతి, కొలదినెలలలో దేశములో శాంతి, సంపద, సంతృప్తి నెలకొలుపబడునని వీరి తలంపు.

(4)

1789 సంవత్సరము ఆగష్టునెల 4 వ తేది ఫ్రాన్సుదేశ చరిత్రిలోకెల్ల ముఖ్యమగు దినము. ఆసాయంతనము ఫ్రాన్సులో అదివఱకు శతాబ్దములనుండి పాదుకొనియుండిన మొఖాసాప్రభుపరంపరయును, మతగురువుల యాధిక్యతయును జాతీయసభచే నాశనము చేయబడెను. ఇంతటనుండియు ఫ్రెంచిదేశములోని మనుష్యులందఱును జాతిభేదములులేక సమానహక్కు బాధ్యతలు గలవారని శాసించబడెను. చట్టము లందఱను సమానముగ వర్తించును. అందఱికిని సమానమగు స్వాతంత్ర్యములుండును. పుట్టుకయొక్కగాని ధనముయొక్కగాని అధిక్యతయుండదు. ప్రభువులకును మతగురువులకునుగల న్యాయవిచారణహక్కులు, ప్రత్యేకగౌరవములు, రైతులచే బలవంతముగ పనిచేయించుకొను హక్కులు, ప్రభువులకుగల వేటహక్కులు, కొన్ని ప్రదేశములకును, పట్టణములకును, వర్తకసంఘములకును గల ప్రత్యేకవర్తకహక్కులు, మొదలగు ప్రత్యేకహక్కులన్నియు రద్దుపఱచబడెను. రైతులకును ఇతర సామాన్యప్రజలకును గల నిర్బంధములన్నియు తొలగించబడెను. వ్యవసాయకబానిసత్వము సంపూర్ణముగ రద్దుపఱచబడెను. సివిలు, సైనిక, మతవిషయిక ఉద్యోగములన్నిటికిని యోగ్యత, సామర్థ్యము మాత్రి

ప్రజాహక్కుల స్థాపనము.

మే కావలెను. పుట్టుకనుబట్టి యియ్యబడవు. నగరములయొక్క అభివృద్ధికై ప్రజ లిచ్చు పన్నులు తీసివేయబడెను. ప్రభువుల యొక్కయు, మతగురువుల యొక్కయు భూముల కిదివరకు పన్నులనుండి గల మినహాయింపులన్నియు రద్దుపరచబడి అందఱి భూములకును సమానముగ పన్నులు వేయబడెను. జాతీయసభవారు మానవులకు స్వాభావముగా నున్నట్టియు, భగవదుద్దేశ్యమైనట్టియు హక్కుల ప్రకటనమును కావించిరి. (1) స్వాతంత్ర్యమును, ప్రాణ మాన విత్తముల సంరక్షణమును, వీనికి భంగముగలుగజేయ యత్నించినవారి నెదుర్కొనుటయు, ప్రతిమానవునికిని సహజమైన హక్కులు. (2) సమాన హక్కు మనుష్యులందఱును పుట్టినారు. (3) చట్టముల ముందఱ పౌరులందరు సమానులు. (4) యోగ్యత, సామర్థ్యము అను భేదములుతప్ప తక్కిన యెట్టిభేదములును లేక, ప్రభుత్వములోని అన్ని యుద్యోగములకును పౌరులందఱును అర్హులు. (5) దేశమునకు ప్రజలే ప్రభువులు. (6) ప్రజలయొక్కయుద్దేశ్యములను దెలుపుటయే చట్టము. ఈ ఆరు హక్కులును ఎవనును తీసివేయుటకు వీలులేని సహజహక్కులని శాసించబడెను. ప్రభువులు, మతగురువులు, ప్రజలు అను భేదము రద్దుపరచబడెను. పత్రికాస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము దేశీయులకందఱికిని నియ్యబడెను. పౌరులు ఎవరియిష్టమువచ్చిన మతమును వారవలంబించవచ్చుననియు, ప్రభుత్వమువారేమతము నవలంబింపరనియు, ఏమతమునందు నెక్కువ గౌరవమునుజూపరనియు ప్రకటించబడెను. రెండు శాసనసభ

లుండవలెనని కొందఱు వాదించిరిగాని, ఎక్కువమందిచే ప్రజా ప్రతినిధిసభ యొకటే యుండవలెనని తీర్మానింపబడెను. దీనికి రెండుసంవత్సరముల కొకసారి యెన్నికలు జరుగును. గడువు లోపల దీనిని విచ్ఛిన్నముచేయుహక్కు రాజునకు లేదు. సమస్త పరిపాలనాధికారములు నీసభకుండును.

దేశములోని యిరువదిఅయిదుసంవత్సరముల వయస్సుగలిగి, సాలున కొకరూపాయి పన్నుచెల్లించు పౌరుల కందఱకును ఎన్నికఅధికారము కలుగజేయబడెను. ప్రతినిధిమాత్రము సాలుకు ముప్పదిరూప్యముల పన్ను చెల్లించువాడుగ నుండవలెను. ప్రజాప్రతినిధిసభ చేసినచట్టమును రాజు రెండుసారులు త్రిప్పివేయవచ్చును. మూడవసారి దానినే ప్రజా ప్రతినిధిసభవారు చేసినయెడల, రా జంగీకరించకపోయినను, దానియంతట నదే చట్టమగును.

పైన చెప్పబడిన ప్రత్యేకహక్కుల నాశనములోను, మానవసమానత్వస్థాపనములోను, అత్యంతమైన దేశాభిమానముతో ననేకమంది ప్రభువులును మతగురువులును కూడ హృదయపూర్వకముగా తోడ్పడిరి. తమ ప్రత్యేకహక్కులను గౌరవములను తామే ముందుగా విసర్జించి ఆత్మత్యాగమునకు మార్గదర్శకులగుచు వచ్చిరి. నోయాలిసు ప్రభువు అందఱికిని త్రోవజూపెను. ప్రభువుల న్యాయవిచారణహక్కు, వేటహక్కు, రైతులవలన బలవంతముగ పనిచేయించుకొను హక్కు మొదలగు హక్కులన్నియు వెంటనే రద్దుకావలెనని

అత్యంతమగు దేశాభిమానము.

ఆయన తీర్మానమును బెట్టెను. ఇంతటితో నొకరివెంట నొకరు ప్రభువులును, మతగురువులును, తమ తమ హక్కులను విసర్జనముగావింప నారంభించిరి. దేశాభిమానములోను ఆత్మత్యాగములోను పోటీ గలిగెను. ఒకరికంటె మరియొకరెక్కువ త్యాగమును జూపిరి. అమితోత్సాహము పుట్టెను. దేశముకొరకై ప్రత్యేకవ్యక్తులు చేసిన సమర్పణము లాఖరుకాగనే, డాఫిన్ రాష్ట్రప్రతినిధి తన రాష్ట్రమునకుగల ప్రత్యేకహక్కుల నన్నిటిని వదలెను. ఒకటివెంట నొకటి రాష్ట్రములు, పట్టణములు, వర్తకసంఘములు తమతమ ప్రత్యేకహక్కులను గౌరవములను వదలుకొనిరి. ఆదినమత్యంతశుభదినముగా పరిగణించుటకు జాతీయసభవారు తీర్మానించిరి. పదునారవ లూయీరాజునకు, ఫ్రెంచిస్వాతంత్ర్యపునరుద్ధారకుడను బిరుదము నొసంగిరి. ఆదినమున ఫ్రాన్సుదేశములో ఫ్రెంచిప్రజల యొక్క పాలనము స్థాపింపబడెను.



# ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయము

## పదుమూడవ అధ్యాయము

## జాతీయసభ

(1)

ప్యారిసు ప్రజలు రాజును కాపుదలలో నుంచుట.

ఇటుల వర్సేల్సులో జాతీయపరిషత్తు నిర్మింపబడుచుండగా, ప్యారిసుపట్టణములో రాజు పారిపోవ యత్నించుచున్నాడనువాడుకలు బయలుదేరెను. ప్యారిసు ప్రజలు వర్సేల్సుకుపోయి, రాజకుటుంబమును ప్యారిసుకు తెచ్చి, భద్రపరుపవలెనను యోచనలు సేయసాగిరి. ఆ సంవత్సరము ఆహారపదార్థముల ధర లపరిమితముగా పెరిగెను. ప్యారిసు మ్యునిసిపాలిటీవారు నష్టమునుభవించి, రొట్టెలను ప్రజలకు చౌకగా అమ్మించుచుండిరిగాని, రొట్టెలు తగినన్ని దొరకక, బీదవారు బాధపడుచుండిరి. రాజు ప్యారిసులోనుండినచో నీ రొట్టెలకఱవు పోవునని ప్రజలు తలచసాగిరి. ప్రభువులయొక్కయు

మతగురువులయొక్కయు కుట్రలవలన తమకు బాధలు కలుగుచున్నవని ప్రజ తలంచిరి. ప్యారిసులోని వాడుకలన్నియు వర్సెల్సులోని రాజునకు తెలియుచుండెను. కొన్ని విదేశీయసైన్యములను రాజు తెచ్చిపెట్టుకొనెను. దేశమునుండి పారిపోవలసినదని కొందరు రాజునకు సలహాచెప్పిరి. దేశములో రాజుయొక్క అధికారము కత్తిరించినది. విదేశమునకు పారిపోయినచో రాణియొక్క పోషకుడగు ఆస్ట్రియాచక్రవర్తియు. ఇదివరకే దేశమును వదలిపోయిన రాజబంధువులును ఇతర ప్రభువులును ఇంకను రాజపక్షముననున్న సైన్యములను రాజునకు సహాయముచేయగలరు. వారిసహాయముతో దేశముమీదికి దండెత్తివచ్చి జాతీయసభను నాశనముకావించి, తనయొక్క నిరంకుశత్వము స్థాపించుకొనవచ్చునని, రాజునకు సలహాయొసంగబడెను. ఇందుకు రాణి సమ్మతించెను. కాని రాజు అనుమానించుచుండెను. నూతనసైనికులు వర్సేల్సుకువచ్చినదినమున సైనికోద్యోగు లొకవిందొసగిరి. రాజు హాజరయ్యెను. రాణి యువరాజునెత్తుకొని యుపన్యాస మిచ్చెను. సైనికోద్యోగులు రాజుయొక్క గౌరవమును నిలువబెట్టెదమని శపథములు చేసిరి. జాతీయసభను తూలనాడిరి. మూడురంగుల జాతీయజెండాను తీసివేసి ప్రాత తెల్లరాజపతాకముల నెత్తిరి. ఈసంగతులన్నియు మరునాడు ప్యారిసులో ప్రజలు తీవ్రముగా చెప్పుకొనసాగిరి. జాతీయజెండాను కాళ్ళక్రిందవేసి త్రొక్కిరను వర్తమానముకూడ వచ్చెను. ప్రజలలో నుద్రేకము హెచ్చెను. జాతీయభటులు కసితీర్చుకొన నువ్విళ్ళూరుచుండిరి. అక్టో

బరు 5 వ తేదీ ఉదయమున ప్యారిసునుండి అనేక వేలమంది స్త్రీలు, కసబడిన స్త్రీలనందఱను పిలుచుకొని, పదునొకండుమైళ్ల దూరముననున్న వర్సేల్సునకు బయలుదేరిరి. పురుషులగుంపులు వెనుక బయలుదేరెను. ఆ వెనుక లఫయత్ సేనానిక్రింద జాతీయ భటులు బయలుదేరి వెళ్లిరి. ముందువెళ్లిన స్త్రీపురుషులు రాజమందిరమును చుట్టుకొని, జాతీయసభామందిరములో ప్రవేశించి, రొట్టె రొట్టె యని కేకలువేసిరి. దినమంతయు క్రొత్త గుంపులువచ్చి చేరుచుండెను. రాజసైనికులకును ప్రజాసమూహములకును కలహములు ప్రారంభమయ్యెను. ఇంతలో ఇరువదివేలమంది జాతీయభటులతో లఫయతువచ్చెను. రాజసైనికులు వెళ్లిపోయిరి. శాంతము నెలకొల్పబడెను. మరునాడుప్రొద్దున ప్రజలగుంపులు రాజమందిరములో ప్రవేశించి రాణియొక్క గదులను ముట్టడించిరి. రాణి భయపడి రాజుయొక్క మందిరములోనికి పరుగెత్తెను. లూయీరాజు ప్రజలకులొంగుటకు నిశ్చయించెను. రాజు మిద్దెమీదికివచ్చి క్రిందనున్న ప్రజలకు దర్శనమిచ్చెను. ప్రజలు "రాజు ప్యారిసుకు రావలెను" అని కేకలువేసిరి. రాజును, రాణియును సమ్మతింపక తప్పినది కాదు. రాజకుటుంబమును బండిలో నెక్కించుకొని ముందును వెనుకను ప్రజలగుంపులు బారులుతీర్చి ప్యారిసుకు వచ్చిరి. జాతీయసైనికులు బండిప్రక్కను నడిచిరి. అక్టోబరు 6వ తేదీన రాజకుటుంబమును ప్యారిసులోని ట్యూలెరీమందిరమునకు చేర్చిరి. వెంటనే జాతీయసభవారుకూడ వర్సేల్సువదలి ప్యారిసులో సమావేశమయెను. రెండుసంవత్సరముల కాలమువఱకు

ఫ్రాన్సుదేశప్రభుత్వము(Crowned republic) రాజు పేరునకు గల సంపూర్ణప్రజాస్వామ్యముగా నుండెను. రాజును, ఆయన కుటుంబమును ట్యూలరీమందిరములో కాపుదలలో నుంచబడిరి. రాజుపేర ప్రజాప్రతినిధులే దేశమును పాలించుచుండిరి. తరువాతకూడ లూయీరాజు నామమాత్రావశిష్టుడగు రాజుగా నుండుటలో తృప్తి పొందియున్న యెడల తమరాజును శిరచ్ఛేదము చేయు దురదృష్టము ఫ్రెంచిజాతికి పట్టెడిదికాదు. కాని దూరాలోచనలేని రాణియొక్క కుట్రలు ఫ్రెంచిచరిత్రను మార్చెను.

(2)

గొప్ప సంస్కరణములు.

జాతీయసభవారు ప్యారిసులో సమావేశమై మొదట శాంతిని నెలకొల్పిరి. ఒకానొకసమయమున సైనికశాసనము పెట్టి ప్యారిసుప్రజల యల్లరుల నణపవలసి వచ్చెను. తరువాత గొప్ప రాజకీయసంస్కరణములను గావించిరి. (1) ఫ్రాన్సుదేశమునంతను ౮౩ రాష్ట్రములు (డిపార్టుమెంటులు)గా విభజించిరి. వానికి పర్వతములయొక్కయు, నదులయొక్కయు పేర్లు పెట్టబడెను. ప్రతిరాష్ట్రమును కొన్నిజిల్లాలుగను ప్రతిజిల్లాను కొన్ని కాంటనులుగను, ప్రతి కాంటనును కొన్ని మ్యునిసిపాలిటీలుగను విభాగించిరి. మొత్తము మూడువందల తొంబది నాలుగుజిల్లా లేర్పడెను. ప్రతిరాష్ట్రమును, జిల్లాను ఒక జనరల్ కౌన్సిలును, ఒక డైరెక్టరీయును (కార్యనిర్వాహకసభ) పాలించును. (2) మ్యునిసిపాలిటీలో ౨౫ సంవత్సరముల వయ

స్సుగలిగి నాలు కొకరూపాయి పన్నునిచ్చు ప్రతివానికిని ఎన్ను కొను (వోటిచ్చు) అధికార మేర్పడెను. మ్యునిసిపల్ సభ్యుడగు వాడు ఆరురూపాయల పన్నును, జాతీయశాసనసభలో సభ్యుడగు వాడు ముప్పదిరూపాయలపన్నును చెల్లించువాడుగ నుండ వలెను. ఎన్నికాధికారముగలవా రందఱును (వోటర్లందఱును) జాతీయసైన్యములో చేరితీరవలెను. (3) కార్యనిర్వాహకశాఖ (executive), విచారణశాఖలు (judicial) వేరుచేయబడెను. న్యాయాధిపతులు పదిసంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడ వలెను. జ్యూరీవిచారణపద్ధతి క్రిమినల్ కేసు లన్నిటిలో నేర్పాటుచేయబడెను. శాసనము లందఱికిను సమానముగ వర్తించునట్లును, ఏమనుజునిగాని సరియైన విచారణలేకుండ, ఖైదులో నుంచకుండునట్లును చేయబడెను. (4) పీనల్ కోడ్డు (శిక్షాస్మృతి)లో ముఖ్యమైనసమార్పులు చేయబడెను. ప్రతి మనుజుడు తనయిష్టమయిన మతము నవలంబించవచ్చును. మతవిశ్వాసముల కెట్టిశిక్షయు నుండదు. మరణశిక్ష చాల నేరములకు తీసివేయబడెను. ఏనేరమునకుగాని నేరస్థునియావ దాస్తిని ప్రభుత్వమువారు తీసికొనగూడదు. నేరస్థునికే శిక్ష విధించవలెనుగాని, అతనికుటుంబము బాధపడగూడదు. వాక్స్వాతంత్ర్యము పత్రికాస్వాతంత్ర్యములను నిర్బంధించుచట్ట ములన్నియు రద్దుపరచబడెను. (5) అన్నిమతములవారును, అన్నియుద్యోగములకును అర్హులుగ చేయబడిరి. వెనుకటిప్రభు త్వమువారు ప్రొటెస్టెంటుమతస్థులనుండి బలవంతముగ తీసి కొనిన ఆస్తి తిరిగి యిచ్చివేయబడెను. యూదులుకూడ సమస్త

పౌరహక్కులకును. సద్యోగములకును అర్హులు. (6) దేశములో వర్తకస్వేచ్ఛ, పరిశ్రమలస్వేచ్ఛ నెలకొలుపబడెను. రహదారిసుంకములు, టోలుగేట్లు తీసివేయబడెను. విదేశవర్తకములో కొన్ని సరుకులమీద సుంకములు వేయబడెను. (7) ఫ్రాన్సుదేశములోని మతాచార్యుల ప్రతిష్ఠాపనలకును, మఠములకును పదికోట్లసవరనుల ఆస్తియుండెను. నాలుగుముప్పదిమైదులక్షలసవరనుల ఆదాయము వచ్చుచుండెను. ఈ ఆస్తియంతయు జాతీయప్రభుత్వమువారు వశపఱచుకొని, మతాచార్యులకందఱకును జీతముల నేర్పఱచిరి. మఠములను స్వాధీనపఱచుకొని, వానిలోని సన్యాసులగు స్త్రీలకును, పురుషులకును, ఉపకారవేతనములనిచ్చి పంపివేసిరి. (8) ప్రభుత్వబొక్కసములో ధనములేనందున, ప్రతివారును తన ఆస్తిలో నాలుగవవంతు తెచ్చి యియ్యవలెనని జాతీయనాయకుడగు మిరాబోకోరగ, మిక్కిలి యుత్సాహముతో ననేకులాప్రకారముగా తెచ్చియిచ్చిరి. ఇంతేయెగాక రాజుయొక్క స్వంతభూములను, మతాచార్యులనుండి తీసికొన్న కొన్ని ఆస్తులను, దేశమును వదలిపోయినవారి సొత్తులను, కొంతవరకు జాతీయప్రభుత్వమువారు విక్రయించి షుమారు రెండుకోట్ల సవరనులను సంపాదించిరి. తాత్కాలికముగా కొంతవఱకు కాగితపుద్రవ్యమును (కరెన్సినోట్లను) కూడ నిర్మించి సొమ్మును స్వీకరించిరి. న్యాయముగ ఆదాయమునుబట్టి పన్నులు వేయబడెను. బాధకరముగనున్న అన్ని పన్నులును తీసివేయబడెను. దేశమంతటను ఒకేవిధమగుకొలతలును తూనికలును వాడుకలోనికి తేబ

డెను. ప్రజలు మిక్కిలి సంతోషముతో గౌరవోద్యోగములను స్వీకరించిరి. ప్రభుత్వమునకు మిగుల తోడ్పాటు గావించిరి. (9) జూన్ 20 తేదీన బిరుదములు, నైటుహుడ్డులు (సర్ బిరుదము వంటివి), పతకములు, ఫిరంగులు కాల్చుట, పతాకము లెత్తుట మొదలగు దంభచిహ్నములెల్లను తీసివేయబడెను.

(3)

*ఫ్రెంచి విప్లవము యొక్క సంవత్సరోత్సవము.*

1790 వ సంవత్సరము జులై 14 వ తేదీన ఫ్రెంచి విప్లవముయొక్క ప్రథమసంవత్సరోత్సవమును, పారాసుప్రజలు ప్యారిసులోని శాండిమార్ మైదానములో అత్యుత్సాహముతో జరిపిరి. ఫ్రాన్సుదేశము యొక్క వివిధభాగములనుండియు నొకలక్ష మంది ప్రతినిధులు సమావేశమయిరి. లూయి రాజు అధ్యక్షతవహించెను. ప్రధానసేనాని యగు లఫయతు, జాతీయసభవారు నూతనముగా నేర్పరచిన రాజ్యాంగవిధానమునకు లోబడి నడుచుకొందుమనని ప్రమాణముచేసెను. వచ్చిన లక్షమందిప్రతినిధులును, నాలుగు లక్షలప్రజలును, అట్టి ప్రమాణములను గావించిరి. తన సింహాసనమునుండి లూయిరాజు, "ఫ్రెంచిరాజునైననేను, జాతీయసభవారు గావించిన నూతనరాజ్యాంగవిధానమును, నాయావచ్ఛక్తితోను కాపాడెదను. దాని ననుసరించి చేయబడు అన్నిచట్టముల నమలులో బెట్టెదను" అని బిగ్గరగా శపథము చేసెను. రాణిగూడ అంగీకారసూచకముగ తన చేతిలోని రాజకుమారుని ప్రజలకు చూపెను. ఈసమయములో అది

వరకు ఆవహించియున్న మేఘములు విడిపోయె, సూర్యుడు తన కిరణములను ప్రసరింపజేసెను. ప్రజలమనంబులు సంతోషముతో నుప్పొంగెను. దేవతల యాశీర్వచనము కలిగెనని ప్రజలు తలచిరి. 'మారాజు దీర్ఘాయువగుగాక! మాదేశము సౌఖ్యముగా నుండునుగాక!' యను జయజయధ్వానములు మిన్నుముట్టెను. దేశాభిమానములోను రాజభక్తిలోను సోదరత్వములోను ప్రజ లోలలాడిరి. నేలమట్టముగావింపబడిన బాస్టిలుకోటప్రదేశములో, నాటిరాత్రి ప్రజలు సంతోషముతో నృత్యములు సలిపిరి. కొన్నిరోజులవరకు బాణాసంచు కాల్చుట,ఆటలు మొదలగు వినోదములు ప్యారిసులో జరిగెను.

ఇంతవరకును విప్లవము సరిగా నడచెను. రాజుయొక్కయు ప్రభువులయొక్కయు నిరంకుశత్వమునకు బదులు ప్రజల రాజ్యము స్థాపింపబడెను. శతాబ్దములనుండి ప్రజలను పీడించుచుండిన ప్రతిష్ఠాపనములు, ప్రత్యేకహక్కులు, మామూళ్ళు నిర్మూలనము గావింపబడి న్యాయము, నీతి, సమానహక్కు బాధ్యతలు, స్వేచ్ఛ నెలకొలుపబడెను. కాని ఇంతత్వరలో ఫ్రెంచిజాతియొక్క కష్టము తీరలేదు. నూతనరాజ్యతంత్రమును నాశనముచేయుటకు, దేశముబయటను, దేశములోపలను, నిరంకుశత్వము, స్వార్థపరత్వము కుట్రలు సలుపుచున్నవి. యూరప్‌లోని తక్కినదేశములన్నియు నిరంకుశత్వమునకు లోబడియున్నవి. ఆదేశములప్రజ లింకను మేల్కొనలేదు. ఆదేశములపాలకులు ఫ్రెంచిజాతిపొందిన స్వేచ్ఛను సహించలేకుండిరి. తమక్రింది ప్రజలు ఇట్టి స్వాతంత్ర్యములనే కోరుదు

రని వారికి భయము. ఆపాలకులెల్ల ఫ్రాన్సుస్వాతంత్ర్యము నకు వ్యతిరేకముగా శత్రువహించిరి. అప్పుడప్పుడు ఫ్రాన్సు ప్రజల యజ్ఞానము, ఫ్రెంచి యతివాదుల తీవ్రగమనము, కూడ ఫ్రెంచిజాతియొక్క కష్టములకు తోడ్పడెను. ఇన్ని యాపదలు గడచి ఫ్రాన్సు స్వాతంత్ర్యోద్యానవనమగుటకు చాల సంవత్సరములు పట్టెను. ఈలోపల ఎంతమందియో స్వాతంత్ర్యపీఠములమీద ప్రాణము లర్పించవలసియుండిరి.

(4)

క్లబ్బులు.

ఫ్రాన్సులో విప్లవము జరుగుచున్నకొలదియు ప్రజలలో నూతనాశయములు, నూతనాభిప్రాయములు వ్యాపింపజేయుటకును ప్రజాభిప్రాయము తమవైపున బలపఱచుకొనుటకును క్రొత్తసంఘములు (క్లబ్బులు) స్థాపింపబడెను. వీనియన్నింటిలో 'బర్టను క్లబ్బు' అనునది మిగుల ప్రాముఖ్యత వహించెను. జాతీయసభతో కూడ వెర్సేల్సునుండి ప్యారిసుకు తీసికొనివచ్చి దానిని జేకొబిన్సు అను పాతమఠపుగృహములో నెలకొల్పిరి. అంతటనుంచి దానికి 'జేకొబినుక్లబ్బు' అను సుప్రసిద్ధనామ మేర్పడెను. క్రమముగా ప్రతిరాష్ట్రములోను దీనికి శాఖ లేర్పడెను. ఈ జేకొబినుక్లబ్బులు ప్రజాభిప్రాయమును తమవైపునకు త్రిప్పుకొని, ప్యారిసులోను, రాష్ట్రములలోను అధికారులు తమ తీర్మానములప్రకారము నడచుకొనునట్లు నిర్బంధించుచు వచ్చిరి కొంతకాల మీక్లబ్బులే నిజముగా దేశప్రభుత్వమును తమ యభిప్రాయానుసారముగ త్రిప్పుచుండెను. ఈ జేకొబినుక్లబ్బు

ప్రథమములో లామెత్తులు. బార్నేవ్ మొదలగు మితవాద నాయకుల పలుకుబడిలో నుండెను. తరువాత రాబిస్పియరు మొదలగు నతివాదులయాజమాన్యముక్రిందికి వచ్చెను. '89 క్లబ్బు'లో, ఆబీసైయెసు, లఫయెతు ముఖ్యులు. 'కార్డిలీర్' అను క్లబ్బులు తీవ్రవాదులగు డాన్టన్ మొదలగువారు స్థాపించుకొనిరి. రాజపక్షమునన్ను ప్రభువులుకూడ క్లబ్బులు స్థాపించిరిగాని, విశేషకాలము నిలువలేదు. మితవాదులకు వేరొక క్లబ్బు కలదు. పత్రికలు ప్రధానస్థానము నాక్రమించుకొని యున్నవి. కొందరు తీవ్రవాదులు తమపత్రికలలో జాతీయసభాచర్యలు తగినంతతీవ్రముగ లేవని ఖండించుచుండిరి. ఆకాలములో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన పత్రికాధిపతి బ్రిస్సో. ఈయన తీవ్రవాది. గిరాండిస్టు లనుకక్షికి నాయకుడు. ఈయన రాజులేని ప్రజాస్వామ్యము కావలెనని తమపత్రికలో వ్రాయుచుండెను. వాణిజ్యస్వేచ్ఛ, పత్రికాస్వేచ్ఛ, ప్రజలకందఱకును విద్య, మతస్వాతంత్ర్యము, కాయకష్టమునకు గౌరవము మొదలగువిషయముల నీయన బలపఱచుచుండెను. ప్రతివాడును తన జీవితములో నీతిమంతుడుగానున్నగాని జాతి గొప్పది కానేరదనియు, నీతి, ధర్మము ప్రధానములనియు, నీయన బోధించుచుండెను. కమిల్ డెమొలిన్ అను నాయన తన "లి రివల్యూషన్" పత్రికలో రాజును తీసివేయవలసినదనియు, వోటు అందరికి నుండవలెననియు శతాబ్దములనుండి హీనస్థితిలోనుండిన ప్రజలు మేల్కొనునప్పుడు కొంతవరకైనను అల్లరులు, రక్తపాతము జరుగకతప్పదుగావున అల్లరుల నణచుటకు జాతీయ

సభవారు కఠినశాసనములను చేయఁకూడదనియు సీయన వ్రాయుచుండెను. "ప్రజలస్నేహితు" అను పత్రికయొక్క అధిపతి డాక్టరుమారెటుగా ఇంకను రక్తపాతిమై స్వాతంత్ర్యమునకు వ్యతిరేకముగనున్నవా రందఱిని చంపువరకును దేశమునకు మోక్షముండదని వ్రాయుచుండెను.

(౫)

మతగురువులలో రెండు కక్షలు.

జాతీయసభవారు బిషప్పుల (మతాచార్యుల) యొక్కయు సామాన్యమతగురువులయొక్కయు సంఖ్యను తగ్గించిరి. రాష్ట్రమున కొక బిషప్పుండుట చాలుననిరి. ఈమతాచార్యులను గురువులను శాసనసభ వెన్నుకొనెడి వోటర్లే ఎన్నుకొనున ట్లేర్పఱచిరి. వీరందఱికిని జీతముల నేర్పఱచిరి. నూతన బిషపులును మతగురువులును క్రొత్త రాజ్యాంగమునకు విధేయుల మగుదుమని శపథములు చేయవలెనని శాసించిరి. పరాసుదేశము ముఖ్యముగా రోమనుకాథలిక్కు దేశము. రోమనుకాథలిక్కుమతపీఠాధిపతి రోములోని పోపు పరాసుదేశములోని మతగురువులను తాను నియమించవలెనే గాని ప్రజలెన్నుకొనగూడదనియు, మతగురువులెవరును ప్రభుత్వమునకు లోబడుదుమని శపథములు తీసికొనగూడదనియు నాజ్ఞాపించెను. అందుమీద కొందరు మతగురువులు మాత్రమే శపథములు తీసికొనిరి. తక్కినవారు విప్లవమునకు

వ్యతిరేకులై మత మపాయకరమగు స్థితిలో నున్నదని రోమను కాథలిక్కు ప్రజలకు బోధించుచు, నూతనప్రభుత్వముపై నాగ్రహమును పురికొల్పుచుండిరి. శపథములు గైకొనని వారు మతబోధలు చేయకూడదని జాతీయసభవారు శాసించిరి. వారు రహస్యముగా బోధించుచుండిరి. మతగురువులలో రెండు కక్షలేర్పడెను. ప్రభుత్వపక్షమువారు, పోపు పక్షమువారు. కొన్నిచోట్ల వారికి, కొన్ని చోట్ల వీరికి పలుకుబడి కలిగియుండెను. కలహములు తరుచుగా గలుగుచుండెను. పోపుపక్షమువారలు ప్రభువులలోచేరి స్వాతంత్ర్యవిద్వేషులై కుట్రలుసేయుటకు నారంభించిరి. కొంతమంది ప్రభువులు మాత్రము ప్రజలపక్షము చేరిరి. కొంతమంది దేశమువిడిచివెళ్ళిరి. మరికొందరు ప్రభువులు దేశములోనేయుండి కుట్రలు చేయుచుండిరి. కష్టముల వలన జాతీయసభ లొంగిపోవునని వేచియుండిరి. కొన్నిచోటుల కుట్రదారులు తిరుగుబాటులు చేయించిరి. నాన్సీలోనిసైన్యము ఎక్కువజీతములు కావలెనని తిరుగుబాటుచేసిరి. బౌలీసేనాని తిరుగుబాటుల నన్నింటిని అణచివేసెను. సైనికులజీతము ఎక్కువచేసెను. 1790 సెప్టెంబరునెలలో నెక్కరుమంత్రి తనకెట్టియధికారము లేదని గ్రహించి, రాజీనామా నిచ్చెను. మొత్తముమీద ఫ్రాన్సుదేశములోని యధికసంఖ్యాకులగు ప్రజలు, జాతీయసభవారు చేయుచున్న సంస్కరణములకు సంతోషమును తృప్తిని కనబఱచిరి. నూతనరాజ్యాంగవిధానమును మనస్ఫూర్తిగా నంగీకరించిరి.

(6)

ఇట్టి స్థితిలో మిరాబో పరలోకగతుడయ్యెను. ఈయన పుట్టుకవలన ప్రభువయ్యెను ప్రజలపక్షమున చేరి విప్లవములో ప్రధానస్థానము నాక్రమించుకొనెను.

మిరాబో పర చిన్నతనములో మిక్కిలి దుడుకువాడై తన లోకగతుడయ్యెను. భార్యను వదలి పరులదారల నపహరించెను. ఈయనతండ్రి మిక్కిలి కఠినమయిన శిక్షలకు పాల్జేసి, యనేకమారులు కారాగృహములో పెట్టించెను. కాని మిరాబో యద్భుతమేధావి. గొప్ప విద్వాంసుడు. మితిలేని సాహసధైర్యములు గలవాడు. నిష్కళంక దేశాభిమాని. దినమునకు యిరువదిగంటలకాలము గ్రంథపఠనము చేయుచుండెను. అసామాన్యవక్తయు లేఖరియునై, ప్రజారంజకుడుగ నుండెను. మిక్కిలి ధైర్యముతో రాజును, తోడి ప్రభువులను యెదిరించి, జాతీయసభలో ప్రధాననాయకుడయ్యెను. స్టేట్సుజనరల్ కూడినప్పటినుండియు మరణించువరకును విప్లవమును మిరాబో నడిపెను. అటు మితవాదులలోను, ఇటు తీవ్రవాదులలోను చేరక జాగ్రత్తగ తీసికొనివచ్చెను. రాజును పూర్తిగ తీసివేయుట ఈయన కిష్టములేదు. అనేకసార్లు రాజుతోను, రాణితోను ఈయన ముచ్చటించుచుండెను. రాణి ప్రథమములో మిరాబోయందు మిక్కిలి అయిష్టము గలిగియుండెను. క్రమముగా ఉభయులును స్నేహితులైరి. జాతీయరాజ్యాంగవిధానము నంగీకరించవలసినదనియు, లేనియెడల ప్రమాదము కలుగుననియు రాజు

నకు మిరాబో గట్టిగా సలహానిచ్చెను. "దీనికి వెనుకకు బోవుట యనగా, నొకతరమువారు కష్టపడిచేసిన పనియంతయు నాశనముచేయుటయు, రెండుకోట్ల యేబదిలక్షలప్రజలు జ్ఞాపకముంచుకొన్నదంతయు తుడిచివేయుటయు నగు"నని మిరాబో రాజుతో చెప్పెను. రాజును, రాణియును మిరాబోవలన తామింతవరకైన సురక్షితముగా నున్నామని తలంచుచుండిరి. మిరాబోమరణమువలన ప్రజలయొక్కయు, జాతీయసభయొక్కయు, రాజుయొక్కయు విశ్వాసమును పొంది, దేశమును సురక్షితముగ నడిపించుచు, ప్రజల కవసరమగు సమస్త సంస్కరణములను గావించుచుండిన గొప్ప రాజ్యాంగవేత్తను ఫ్రాన్సుదేశము గోల్పోయెను. ఇట్టి రాజకీయధురంధరుడు ఫ్రాన్సుకు తిరిగి చిరకాలమువరకు లభించలేదు. చనిపోవువరకు ఈయనవయస్సు నలుబదిరెండువత్సరములు మాత్రమే గలవు. చిన్నతనములో దురభ్యాసములకు లోబడి తన యారోగ్యమును గోల్పోయెను. తనశక్తి నశించువరకును వ్రాయుచును, మాట్లాడుచును, ఆందోళనపడుచును నుండుటవలన అకాలమరణమునకు లోనయ్యెను. ఈయనకు చాల జబ్బుచేసినదని తెలియగానే ప్రజలు గుంపులుగుంపులుగా నీయన ఆరోగ్యస్థితి నరయుటకై యాత్రతో నెడతెగక గృహము చుట్టును మూగియుండిరి. గంటగంటకును ఈయనజాడ్యస్థితినిగూర్చి వైద్యులు ప్రత్యేకముగవార్తలను ముద్రించి ప్రకటించుచుండిరి. ప్రతిదినమును రాజు మనుష్యులనుబంపి వర్తమానము తెప్పించుకొనుచుండెను. చనిపోవు దినమున తాను

చనిపోవుట నిశ్చయమని తెలిసికొని, మంచిపుష్పములను సువాసనద్రివ్యములను పక్కలో వేయించుకొనెను. మంచి సంగీతమును పాడించి వినెను. "పాపము! రాజుయొక్క అధికారమును కూల్చివేసినాము. ప్రజలు అంతఃకలహములు లేకుండ నీనూతనాధికారము నెటుల వినియోగించుకొనెదరో నను నాత్రితవలన నాహృదయము బరువుగానున్న"దని యాఖరు మాటలు చెప్పెను.

1791 సంవత్సరము 2 వ ఏప్రిల్ తేదీన మిరాబో పరలోకగతుడయ్యెను. జాతీయసభ్యులెల్లరును, ప్యారిసునగరవాస్తవ్యులెల్లరును ఆయనశవమువెంట వెళ్ళిరి. ఆయనశవమును పాంథియను ప్రదేశములో పాతిపెట్టిరి. ఆప్రదేశములో నే తరువాత ఫ్రాన్సుదేశములోని గొప్పవారి మృతకళేబరములను పాతిపెట్టుచుండిరి.

(7)

మిరాబో చనిపోయిన తరువాత లూయీరాజునకు దుర్బోధ లెక్కువయ్యెను. 1790 డిశంబరునుండియే లూయీ పరరాజులతో రహస్యాలోచనలు నడుపుచుండెను. కాని క్రియారూపకము దాల్చలేదు. ఇంతటినుండియు రాజు రాణియొక్క పలుకుబడిలో పూర్తిగనుండెను. దేశమువిడిచి పారిపోయి పరరాజుల సహాయమున తనరాజ్యమును పొందవలెనను ఆలోచనలు బలమయ్యెను. రాజుతరఫున ఆయనసోదరులగు ఆర్టాయిప్రభువును కాండిరాకొమారుడును ఆస్ట్రియారాజు

రాజుయొక్క కుట్రలు.

నొద్దచేరి కుట్రలు చేయుచుండిరి. ఆస్ట్రియారాజు లియోపాల్డు ఫ్రెంచిరాణికి సోదరుడు. ఫ్రెంచిప్రభువులును మతగురువులును ఫ్రాన్సుదేశము విడిచి బయట సరిహద్దున జర్మనీలో గుమిగూడుచుండిరి. లూయిరాజు పారిపోయి వీరితో చేరునేమోయని ప్యారిసుప్రజలు భయపడుచుండిరి. రాజు తనమేనత్తలను ఇటలీకి పంపెను. ప్రజలసందేహము మరింత హెచ్చెను. ప్యారిసునుండి సెంటుక్లౌడుకు వెళ్ళవలెనని రాజు యత్నించగా ప్యారిసుప్రజ అడ్డుపడి వెళ్ళకుండ చేసిరి.

1791 సంవత్సరము 20 వ మే తేదీన ఇటలీలోని మాంచువాలో యూరపులోనిరాజులసమావేశ మయ్యెను.

యూరపురాజుల సమావేశము.

ఆస్ట్రియా, ప్రష్యా, రుష్యా, స్వీడెను, జర్మను రాష్ట్రములు, సార్డినియా, స్పెయిన్, ఇంగ్లాండు, పైడిమాంటు రాజులప్రతినిధులు కలిసి, ఫ్రెంచి ప్రజలమీద కొక లక్షసైన్యములను బంపి, లూయిరాజుయొక్క యధికారమును పునరుద్ధరించవలయునని రహస్యముగా తీర్మానించుకొనిరి. తమ తోడిరాజగు లూయిరాజును ఫ్రెంచిప్రజలు అవమానపరచి యిబ్బంది కలుగజేయుచున్నందుకు తమ అసమ్మతిని ముందుగా ఖండితముగా ప్రచురించి జులై నెలలో వివిధరాజులసైన్యములు నలువైపులనుండియు నొక్కసారిగ ఫ్రాన్సును ముట్టడించవలెననియు, అంతవరకు నీసంగతి రహస్యముగా నుంచవలెననియు నిశ్చయించుకొనిరి. కొంతరాజ్యము కలుపుకొనవలెనని ఆస్ట్రియాయొక్క ఆశ. అమెరికాకు ఫ్రాన్సు సహాయముచేసినందులకు ఫ్రాన్సు

పైన నీసమయములో కసిదీర్చుకొనవలెననియు, విప్లవమును తమదేశములో వ్యాపింపకుండ చేయవలెననియు నింగ్లాండు యొక్క అభిప్రాయము. ప్రష్యారాజునకు నిరంకుశత్వమును తనరాజ్యములో స్థిరపరచుకొనుట కుద్దేశ్యము. యూరపు యొక్క దృష్టి ఫ్రెంచిపోరాటములో మగ్నమయి యుండగా పోలండును కాజేయవలెనని రుష్యాయొక్క ఆలోచన. తమ తోడిప్రభువులు కోల్పోయినహక్కులను తిరిగి నిలువబెట్టుట జర్మనీరాష్ట్రాధిపతులకోరిక. స్పెయిన్ మొదలగు బోర్బన్ వంశస్థులకు తమవంశీయుడగు ఫ్రెంచిరాజునకు కలిగిన యవమానమును తొలగించవలెనను తలంపు. ఇట్టి వివిధయూహలతో వివిధరాజులేకమై ఫ్రెంచిజాతిని నాశనముగావింప నిశ్చయించిరి. యూరపులోని నిరంకుశత్వమంతయు, ప్రజల స్వాతంత్ర్యమును నిర్మూలము గావించుటకు ఏకమయ్యెను. ఫ్రాన్సునుండి దేశభ్రష్టులైనవారు ఫ్రాన్సులో సైన్యములు లేవనియు, సరియైననాయకులు లేరనియు, అంతఃకలహములతో నిండియున్నారనియు, బొక్కసములో ద్రవ్యము లేదనియు, ప్రజలకు రాజునందు భక్తియింకను గలదనియు, అల్లరులు చేయుటకు సిద్ధముగా నున్నారనియు, జాతీయసభయం దందఱకును విసుగు పుట్టినదనియు, ఫ్రెంచిజాతీయప్రభుత్వమువారు స్వసంరక్షణము చేసికొనలేరనియు, రాజులందఱితోను చెప్పి వారిని ప్రోత్సాహపరచిరి. మాంచువాసమావేశముసంగతి రహస్యముగా ఆస్ట్రియారాజు చారులచే ఫ్రెంచిరాజునకు కబురంపెను.

(8)

1791 సంవత్సరము జూన్ 20 వ తేదీన లూయిరాజు ప్యారిసును విడిచి పారిపోవ నిశ్చయించెను. జనరల్ బొయిలీ యను ఫ్రెంచి సేనాధిపతి రాజునకు పరమ రాజు పారిపోవుటకు మిత్రుడు. ఫ్రాన్సుసరిహద్దున శత్రువులు సైన్యములు పోగుచేయుచున్నారనుమిష మీద తన సేనలను సరిహద్దుకు దగ్గిరనున్న మాంటుమడీలో నుంచెను. రాజు కుటుంబముతో మాంటుమడీకి వచ్చి ఈ సేనలను చేరుటకేర్పాటుచేసిరి. రాజు షాలోనుమీదుగా వచ్చును. త్రోవలో ప్రతిచోటను రాజుయొక్క సురక్షితము కొరకు బొయిలీ కొంతమంది సైనికుల నుంచెను. మాంటుమడీలోని సేనలకు ప్యారిసునుండి కొంతసొమ్ము తీసికొనివెళ్ళి భద్రముగా నొప్పగించుటకై సైనికులను త్రోవలో పెట్టినట్లు బొయిలీ నటించెను. జూన్ 20 వ తేది రాత్రి రహస్యముగా నొకరి తిరువాత నొకరు రాజును రాణియును మారువేషములతో ట్యూయిలరీమందిరమునుండి తప్పించుకొనిపోయిరి. రాజుయొక్క తోబుట్టువు ఎలిజబెత్తును, రాజుయొక్క కుమార్తెయు, కొడుకును, వారల దాదియుకూడ ముందుగనే వెళ్లిరి. వీరందరును బోలివార్డులో సిద్ధముగ నుంచబడిన పెద్దగుఱ్ఱపుబండిలో నెక్కి మాంటుమడీకై వెళ్ళిరి.

ట్యూయిలరీమందిరమును కాపుదలచేయుచుండిన జాతీయ సైనికులు మైమరచియుండిరి. మరునాడు తెల్లవారగనే రాజకుటుంబము పారిపోయినసంగతి కనిపెట్టిరి. ప్యారిసులో గొప్ప

కలవరము పుట్టెను. ఎక్కడచూచినను ప్రజలు గుంపులుగూడి దీనినిగురించియే యాందోళనపడుచుండిరి. ఆరాత్రి కాపలాయున్న సైనికుల యజాగ్రత్తను నిందించుచుండిరి. ఖయుతు బౌలీ సేనాధిపతులే యీపనిలో తోడ్పడిరేమోయను అనుమానముకూడ కొందరికి కలిగెను. ప్రాతనిరంకుశత్వమును, ప్రాతసాంఘిక సాంప్రదాయములును తిరిగివచ్చుటకును, దేశము మరల గతి పాలగుటకును నిది దురదృష్టసూచకమని ప్రజలు భావించసాగిరి. వెంటనే జాతీయసభవారు తగినచర్య పుచ్చుకొని ప్రజలను శాంతింపజేసిరి. జాతీయసభ సమావేశమై మంత్రులను ప్రధానోద్యోగస్థులను పిలిపించి రాజుయొక్క అధికారములన్నియు తమకు సంక్రమించినవనియు, నింతటినుండియు జాతీయసభవారిపేరనే సమస్తకార్యములును జరుపవలసినదనియు నాజ్ఞాపించిరి. సేనాధిపతులకు కబురంపి సేనలను జాతీయసభకే లోబడి నడచుకొనునట్లు పదిలపఱచిరి. రాజు పారిపోవుటవలన ఫ్రెంచిప్రభుత్వము విచ్ఛిన్నము కాలేదనియు, ఫ్రెంచిజాతితరపున తాము ఫ్రాన్సుదేశపుప్రభుత్వమును చేయుచున్నామనియు, నితరదేశముల ప్రభుత్వములతో సఖ్యముగా నుండుటయే తమ యుద్దేశమనియు ప్రకటనముగావించి, యూరపులోని రాజుల కందరకును తెలియపఱచిరి. దేశసంరక్షణ కొఱకు వెంటనే మూడులక్షలమంది జాతీయసైన్యములను ప్రోగుజేయుటకు తీర్మానించిరి. "నాలుగుగంటలకాలములో ఫ్రెంచిజాతీయసభ సమస్తఅధికారములను పొందినది. ప్రభుత్వము యథాప్రకారము సాగినది. ప్రజలలో లేశమైనను

శాంతికి భంగము కలుగలేదు. ఈయనుభవమువలన రాజు పేరునకుమాత్రమే కలడనియు, రాజు లేకపోయినను ఫ్రెంచి జాతికి నష్టములేదనియు, ప్యారిసునగరమును, ఫ్రాన్సుదేశమును గ్రహించినవి" అని ఫెర్రిరుప్రభువు చెప్పెను.

ఈలోపున లూయిరాజును ఆయనకుటుంబమును ప్రయాణము పూర్తిచేయుచుండిరి. ప్రథమదినమున జయప్రదముగా ప్రయాణము సాగుటవలనను, ప్యారిసునుండి రాజును పట్టు చాలదూరము వచ్చినామను సంతోషమువలన కొనిపెచ్చుట. నః, లూయిరాజు అజాగ్రత్తగానుండి బండిలోనుండి అటునిటు బయిటకు చూడసాగెను.

21 వ తేది సాయంత్రము సెంటుమెనిహాల్డువద్ద పోస్టుమాస్టరు జనరంగు డ్రూయి, రాజును గుర్తించి బండివెంట పోయెను. ఆరు గంటలు కొట్టునరికి రాజు బండిలో వెరెన్నుచేరెను. గుఱ్ఱము లలసియున్నందున అక్కడ సిద్ధముగానుంచబడియున్న మరియొక గుఱ్ఱముజతను బండికి కట్టుచుండిరి. బండివెంటవచ్చిన డ్రూయి, వెరెన్నులోని మ్యునిసిపలుఅధ్యక్షుడు మొదలగు వారిని పోగుచేసి, రాజుగారిబండి నటకాయించెను. వెరెన్ను ప్రజలును అక్కడి జాతీయభటులును బండిని చుట్టుకొని ముందుకు పోనియ్యలేదు. జాతీయభటులు బొూయిలీసేనాని తోవలో నుంచిన సైనికుల నోడగొట్టిరి. ఆరాత్రి వెరెన్నులోని యొక్క చిన్నయింటిలో రాజకుటుంబమునకు ఫలహారములు, తేయాకు నీళ్ళు నిచ్చిరి. జాతీయభటులును ప్రజలును రాజుయొక్క బండిని త్రిప్పించి ప్యారిసుకు తీసికొనిపోవుచుండిరి. రాజున కెక్కడను

సహాయము లేదయ్యెను. దేశములోని ప్రజలందరును ఏకమై యుండిరి. త్రోవలో ఎపెన్నియొద్ద జాతీయసభవారు పంపిన ముగ్గురు ప్రతినిధులు రాజును కలిసి ప్యారిసునకు తీసికొనిపోయిరి. ప్యారిసునకు రాజకుటుంబము చేరగనే వేలకువేలప్రజలు రాజుబండిని చుట్టుకొనిరి. "రాజునకు గౌరవము చూపినవారికి దెబ్బలశిక్ష విధించబడును. రాజు నవమానపరచినవారికి మరణదండన నియ్యబడు"నని ప్యారిసు పురపాలకసంఘమువారు ప్రచురించియుండిరి. ప్యారిసుప్రజలు నిశ్శబ్దముగాను శాంతచిత్తముతోను రాజును చూచివెళ్ళిరి. తిరిగి రాజకుటుంబమును రాజును ట్యూలరీమందిరములో నుంచబడిరి. ఎక్కువ బందోబస్తుగా కాపుదలచేయబడెను.

రాజు నేమిచేయవలెనని జాతీయసభలో తీవ్రముగా, చర్చజరిగెను. ఇంతటినుండియు రిపబ్లికనుపార్టి (సంపూర్ణ ప్రజాస్వామ్యకక్షి) ముందుకు వచ్చెను. వెంటనే రాజును పదభ్రష్టునిచేసి విచారణ చేయవలసినదనియు, రాజులేని ప్రజాప్రభుత్వమును స్థాపించవలెననియు వీరు కోరిరి. గోడలమీద రిపబ్లికు కావలెనని పెద్దకాగితముల నంటించిరి. కాని ఎక్కువమంది సభ్యులు రాజును తీసివేయుటకు సమ్మతించలేదు. తొందరపడవద్దనియు పేరునకు రాజుండుటవలన జాతికి నష్టములేదనియు బార్నిల్ గంభీరోపన్యాసము గావించెను. ఇప్పటికైనను రాజు నూతనప్రభుత్వవిధానము నంగీకరించకపోయినను, ఫ్రెంచిజాతికి విరోధులగువారితో చేరినను, జాతికి వ్యతిరేకముగ సైన్యములను ప్రోగుచేసినను రాజ్యమును కోల్పోవునని తీర్మానించిరి.

సంపూర్ణప్రజాస్వామ్యవాదులు దీనితో తృప్తినొందక ప్రజలలో నాందోళనమును పురికొల్పిరి. మిరాబో చనిపోయిన తరువాత పేషన్, రాబిస్పీయరు నాయకత్వముక్రింద జేకొబిన్ క్లబ్బులు ఈకక్షివారి పలుకుబడిలో చేరెను. జులై 17 వ తేదిన వెంటనే రాజును పదభ్రష్టుని చేయవలసినదని జాతీయసభవారిని కోరుచు, నొక మహజరును తయారుచేసి, ప్యారిసులోని షాండిమారుప్రదేశములో కట్టబడియున్న వేదికయొద్ద వేలకువేలదస్కతులు చేయుచుండిరి. ప్యారిసుచుట్టునున్న పల్లెలకుగూడ నీయాందోళనము వ్యాపించెను. జాతీయసభవారు, ప్రజలు గుమిగూడి దస్కతులు చేయవద్దని యుత్తరువుచేసిరి. జా[illegible]టులకును ప్యారిసుమ్యునిసిపాలిటీకిని, ప్రజలగుంపులు [illegible]ట్టవలసినదని యాజ్ఞాపించిరి. వీరు ప్రజలగుంపులను చెదరగొట్టగా ప్రజ లాగ్రహావేశులై ఇంకనెక్కువగాచేరి దస్కతుల చేయనారంభించిరి. లఫయతుసేనాని సైన్యములను తెచ్చెను. పోవలసినదని యుత్తరు విచ్చెను. ఆకాశమునకై తుపాకులను పేల్పించెను. ప్రజలు పోక రాళ్ళు రువ్విరి. అప్పుడు సైనికులను ప్రజలమీద కాల్చుట కుత్తరువు చేసెను. తుపాకులను కాల్చగా ప్రజలలో చాలమంది చనిపోయిరి. చాలమందికి గాయములు తగిలెను. ప్రజలు పారిపోయిరి. ఈసంగతి జరిగినతరువాత సంపూర్ణప్రజాస్వామ్యకక్షియొక్క పలుకుబడి ప్రజలలో నింకను ఎక్కువదృఢముగా నాటుకొనెను. జాతీయసభలోని మితవాదనాయకుల పొరబాటు వారికక్షియొక్క నిర్మూలమునకు తోడ్పడెను. ప్రజల

మీాద నిర్బంధములు ప్రయోగించినకొలదియు ప్రభుత్వము యొక్క బలము క్షీణించును. ఆదినమున చనిపోయిన ప్రజల రక్తము రాజశిరచ్ఛేదమునకు కారణమయ్యెను.

(9)

లూయీరాజును పట్టుకొని తిరిగి తెచ్చినారనువార్త ఫ్రాన్సుబయటనున్న రాజుయొక్క స్నేహితులకందరకును కలవరము గలిగించెను. రాజునకు సహాయముచేసిన బొయిలీసేనాని కొంత సైన్యముతో దేశమును వదలి దేశభ్రష్టులలో చేరెను. దేశభ్రష్టులు సమయాశలన్నిటిని ఇంతటినుండియు యూరపురాజులమీాదనే పెట్టుకొనిరి. ఆగష్టు 27వ తేదీన ఆష్ట్రియాచక్రవర్తియు, ప్రష్యారాజును, అర్టాయిప్రభువును, కలిసికొని యూరపురాజులందరితరఫున నొకప్రకటనము గావించిరి. తమతోడిరాజగు పదునారవలూయీయొక్క గౌరవము తమదేననియు, ఆయన యిష్టమువచ్చినచోటికి పోవుటకు స్వేచ్ఛ యుండవలెననియు, నాయనసింహాసనము నాయనకు తిరిగి యిచ్చివేసి జాతీయసభ అంతరించవలెననియు, ఫ్రెంచిప్రభువులకు తమతమ ఆస్తులను, హక్కులను తిరిగి యిచ్చివేయవలెననియు, ఇట్లు ఫ్రెంచిప్రజలు చేయనియెడల యూరపులోని రాజులందరును ఫ్రాన్సుమీాదికి దండెత్తివచ్చి లూయీరాజుయొక్కయు, ఫ్రెంచిప్రభువులయొక్కయు హక్కులను సంపూర్ణముగా పునరుద్ధరింతుమనియు నాప్రకటనలో చెప్పబడెను. దీనివలన ఫ్రెంచిప్రజలేమి, జాతీయ

యూరపురాజుల ప్రకటనము.

సభ్యులేమి, నిరుత్సాహపడుటకు మారుగ కోపోద్దీపితులైరి. "మన దేశవ్యవహారములతో నీ విదేశరాజుల కేమిపని? ఒక గొప్పజాతికి నుత్తరువు లిచ్చుటకు వీరి కేమియధికారము? మన జాతియొక్క లాభనష్టములు, మంచిచెడ్డలు, రాజ్యాంగ విధానములు మనమే నిర్ణయించుకొనవలెనుగాని, యూరపు రాజుల కేమిజోక్యము?" అని ప్రశ్నింపసాగిరి. వెంటనే ఫ్రాన్సు యొక్క సరిహద్దులన్నియు సురక్షితముగ నుండుటకై తగు బందోబస్తులను జేసిరి. ఒకలక్ష జాతీయసైనికులను తయారు జేసిరి. శతృవులముట్టడికి బహు శాంతమనస్కులై సంపూర్ణ ముగ సిద్ధపడిరి. ఫ్రెంచిజాతి దేశాభిమానపూరితమైయున్న ఈసమయములో తమభూమిమీద ఎవరికిని జయింప నలవి గానిదని దృఢవిశ్వాసమును గలిగియుండెను.

(10)

జాతీయసభవారు నూతనరాజ్యాంగవిధానమును చట్టములను అన్నిటిని సరిజూచి, సెప్టెంబరు 14వ తేదీన 60 మంది ప్రతినిధులచే లూయిరాజుయొక్క దస్కతు నిమిత్తము పంపిరి. లూయిరాజు వానినన్నిటిని పరిశీలించి దస్కతుపెట్టెను. "నేనీరాజ్యాంగ విధానము నంగీకరించుచున్నాను. నాదేశములో దానిని సంరక్షించుటకును, విదేశీయుల ముట్టడులనుండి కాపాడుటకును, జాగ్రత్తము చేయుచున్నాను. నాకున్న యావత్తుఅధికారములను వినియోగించి, దాని నమలులో బెట్టెద"నని రాజు జాతీయసభకు ఉత్తరము పంపెను. మరునటిదినము రాజు

జాతీయసభ యొక్క ముగింపు.

స్వాయముగా జాతీయసభకు వచ్చెను. రాజ్యాంగవిధానము నంగీకరించెను. ప్రజలు జేజే ధ్వానములు పలిపిరి. జాతీయసభ్యు లమితోత్సాహపరవశులైరి. ఆదినమున రాజు ప్రజలయొక్క విశ్వాసమును గౌరవమును తిరిగి పొందెను. నూతనరాజ్యాంగ విధానమునుబట్టి నూతనశాసనసభ (లెజిస్లేటివ్ ఎస్సెంబ్లి) అక్టో బరు 1వ తేదీన సమావేశమగును. కావున సెప్టెంబరు 29వ తేదీన జాతీయసభయొక్క యాఖరుసమావేశము జరిగెను. రాజు హాజరయ్యెను. గంభీరోపన్యాసమును జేసెను. "సభ్యు లారా! మీరు చాలకష్టపడి యనేక దేశోపయుక్తమయిన చట్టములను చేసియున్నారు. మీరిండ్లకు వెళ్లినప్పుడు మీరు చేయవలసిన కార్యమొకటి గలదు. ఈచట్టముల నిజమైన యుద్దేశ్యములను మీతోడిపౌరులకు చెప్పి, వానిని నిర్లక్ష్యము చేయువారిని మంపలించుటయు, మీప్రేమవల్లను ఋజుప్రవ ర్తనవల్లను దేశములోని వివిధాభిప్రాయములు గలవారినెల్ల నేకీభవింపజేయుటయు నైయున్నది. మీరాజు ప్రజలకు నెల్ల ప్పుడును విశ్వాసపాత్రుడైన స్నేహితుడుగా నుండునని వారితో చెప్పుడు. ప్రజలప్రేమనే గోరుచున్నాననియు, ప్రజలసౌఖ్యమే నాసౌఖ్యమనియు, ప్రజలకు మేలుచేయుటవలనమాత్రమే నాకు తృప్తికలుగుననియు, మీతోడిపౌరులతో చెప్పుడు" అని రాజు సభ్యులహర్షధ్వానులమధ్య అంత్యోపన్యాసమును చేసె ను. జాతీయసభవారు అదివరకు రాజును పారిపోవుటకు ప్రో త్సహించినవారిమీద బెట్టబడిన నేరారోపణలన్నియు నెత్తి వేసిరి. దేశభ్రష్టులైనవారెల్లరును తిరిగి దేశమునకు వచ్చి సౌఖ్య

ముగా నుండవచ్చునని ప్రకటించిరి. ఫ్రెంచిప్రజల కందరకును స్వాతంత్ర్యము గలిగి, సోదరభావము ఐకమత్యము ప్రబలి, ఫ్రాన్సుదేశము వర్ధిల్లవలెనని కోరిరి. అధ్యక్షుడగు ఘూరే గారు "జాతీయసభ తనయొక్క యుద్దేశ్యమును నెరవేర్చినది. దాని సమావేశములు ఇంతటితో అఖరైనవి." అని బిగ్గరగా చెప్పెను. ప్రేమపూరితమైన కోలాహలముతో ఫ్రెంచిజాతియొక్క ప్రథమజాతీయసభ ముగిసెను. రెండు సంవత్సరముల కాలములో నియాదర్శప్రదమైనసభ, నిరంకుశత్వమును నిర్మూలనము గావించి, జాతిభేదములను రూపుమాపి, ప్రజలరాజ్యమును స్థాపించెను. ప్రజలను బాధించుచున్న ప్రతిష్ఠాపనలెల్ల తీసివేసి, ప్రజలలో సమానత్వము, న్యాయము నేర్పరచి, ప్రజాభివృద్ధికారకమగు పెక్కుపనులను గావించెను. గొప్ప ఫ్రెంచిజాతిని నిర్మాణము గావించెను. ఉత్కృష్టమైన సిద్ధాంతములను లోకమునకు ప్రకటించెను. జాతీయతకును, స్వయంనిర్ణయమునకును, ఫ్రెంచిజాతిని ప్రపంచమునకు మార్గదర్శకముగా చేసెను. ఇట్టి ఘనకార్యము నింతశీఘ్రకాలములో ముగించిన జాతీయసభ మానవచరిత్రలో మరియెచ్చటను లేదు.



# ఫ్రెంచి స్వాతంత్ర్య విజయము



## పదునాలుగవ అధ్యాయము

## సంపూర్ణ ప్రజాస్వామ్యము

(1)

లెజిస్లేటివ్ అస్సెంబ్లీ (శాసనసభ) 1791 సంవత్సరము 1 వ అక్టోబరు తేదీన సమావేశమయ్యెను. పరాసుదేశస్వాతం
త్ర్యమునకై పనిచేయుచున్నవారియందు గౌర
నూతనశాసనసభ వముతోను ఇంతవరకేర్పాటుకాబడిన పద్ధతినే
పోవలెనను కోరికతోను పని ప్రారంభించెను.

జాతీయసభవారు చేసిన రాజ్యాంగవిధానము వ్రాయబడియున్న పుస్తకమును పండ్రెండుమంది వృద్ధప్రతినిధులు తెచ్చిరి. శాసనసభ్యులెల్లరును లేచి నిలువబడి టోపీలుతీసి 'స్వాతంత్ర్యమునకై బ్రదుకుదుము. లేనియెడల మరణింతుము' అను శపథమునుదీసికొనిరి.

నూతనరాజ్యాంగవిధానప్రకారము ప్రాతజాతీయ సభ్యు లెవరును నూతనశాసనసభలో సభ్యులుగా నెన్నుకొనబడుటకు ఏలులేదు. ఇది మంచియేర్పాటుగాదు. అనుభవశాలురు రాకుండబోయిరి. స్టేట్సుజనరలులలోను, జాతీయసభలోను నిరంకుశత్వమును ప్రభువులహక్కులను సంరక్షించ యత్నించిన ప్రభువులు,మతాచార్యు లుండిరి. అట్టివా రెవరును నీ నూతనశాసనసభలో లేరు. ప్రజలయెన్నికలలో నట్టివారికి తావులేదు. జాతీయసభలో మధ్యనుండిన కక్షివారు నూతనశాసనసభలో కొంతమంది మితవాదకక్షిగను, తక్కినవారు గిరాండిష్టులుగను చీలిరి. అతివాదుల కెక్కువబలము గలిగెను. శాసనసభలో అధ్యక్షునికి కుడివైపున మితవాదులు కూర్చుండిరి. వీరి కెడమప్రక్కన గిరాండిష్టు లుండిరి. గొప్ప విద్వాంసులగు బ్రిసో, వేనర్డు గెన్సోనే, మొదలగువారు వీరి నాయకులు. సభలో నెడమవైపున సంపూర్ణప్రజాస్వామ్యమును గోరుచున్న అతివాదులు కూర్చుండిరి. వీరికి మాంటెనార్డులని పేరు. యాావనము, తీవ్రవాదము, మంచినక్తృత్వము, వీరికి ప్రధానలక్షణములు. అటునిటు ఊగులాడుచుండినవారు మధ్యకూర్చుండి యుండిరి. ఎటుబలముగానున్నప్పుడటు చేరుచున్నవారు ప్లెయిన్ అని వీరికిపేరు.

(2)

శాసనసభకు ప్రథమమునుండియు గొప్పకష్టము లెదుర్కొనెను. జాతీయసభ వదలిపోయిన శత్రువులబాధ దినదినమున కెక్కువయ్యెను. దేశమును వదలిపోవువారిసంఖ్య విశేషముగాహెచ్చెను. సైనికోద్యోగు

క్లిష్టపరిస్థితులు

లుకూడ దేశమును వదలి వెళ్ళసాగిరి. ప్రభువులు వెళ్ళి వీరితో చేరిరి. సరిహద్దులనున్న పటాలములు కొన్ని దేశభ్రష్టులతో కలిసెను. దేశములోనుండి దృఢచిత్తము లేనివారికి, ప్రభువులు తిరిగి యధికారములు పొందగనే, వీరిగతి యేమియగునో ఆలోచించుకొనుమని వర్తమానములంపుచుండిరి. జర్మను రాష్ట్రములలోను ఆస్ట్రియాలోను ఫ్రెంచిదేశభ్రష్టులగుంపులు చేరి ఫ్రెంచివిప్లవమును నాశనముచేయుటకు సిద్ధపడుచుండిరి. యూరపులోని రాజులు వీరికి తగురక్షణను, సహాయము నిచ్చుచుండిరి. వీరిరాయబారులను రాజు లాదరించుచు, ఫ్రెంచిప్రభుత్వపు రాయబారులను అగౌరవపఱచి వెళ్ళగొట్టిరి. జాతీయవాదులగు ఫ్రెంచివర్తకులకును బాటసారులకును, యూరపులో ప్రతిచోటను మిగుల నిర్బంధములు కలుగజేసిరి. ఫ్రాన్సులోనున్న పోపుపక్షపు మతాచార్యులు ప్రజలను జాతీయప్రభుత్వముపై మతముపేర పురిగొల్పి తిరుగుబాటును చేయించుచుండిరి.

దేశభ్రష్టులమీద నిర్బంధములు.

విదేశములకు పోకుండ నిర్బంధములు కలుగజేయుటకు శాసనసభవారు సమకట్టిరి. కొంత తీవ్రమగుచర్చ జరిగెను. మితవాదు లాక్షేపించిరి. ముప్పదియవ అక్టోబరు తేదీన రాజుయొక్క జ్యేష్ఠసోదరుడగు లూయీస్టానిలాసప్రభువు రెండు నెలలలో ఫ్రాన్సుకు తిరిగిరానియెడల, రాజకుటుంబములో నాయకునకుగల సమస్తహక్కులు పోవునని శాసించిరి. నవంబరు 9 వ తేదీన ఫ్రాన్సును వదలి విదేశసరిహద్దులలో పోగగుచున్నవారందఱును దేశద్రోహులనియు, 1792 సం

వత్సరము జనేవరి 1 వ తేదీలోపల దేశములోనికి తిరిగిరాని యెడల కుట్రదారులుగా భావింపబడి వారిమీద మరణశిక్ష విధింపబడుననియు వారిభార్యలయొక్కయు పిల్లలయొక్కయు ఋణదాతలయొక్కయు న్యాయమయిన హక్కులకు లోబడి వారియొక్క యావదాస్తిని ప్రభుత్వమువారు తీసికొందురనియు శాసించిరి. నవంబరు 29వ తేదీన జాతీయప్రభుత్వము నొప్పుకొనుచు శపథములు తీసికొననియెడల, మతాచార్యుల యుపకారవేతనములు తీసివేయబడుననియు వారిని తిరుగుబాటుదారులుగ భావించి నిగహాలో నుంచెదమనియు శాసించిరి.

లూయిరాజు తన సోదరునిమీద చేయబడిన శాసనము నంగీకరించి దస్కతును పెట్టెనుగాని, దేశభ్రష్టులనుగూర్చియు మతాచార్యులనుగూర్చియు శాసనసభవారు చేసిన శాసనముల నంగీకరించక త్రోసివేసెను. శాసనసభలోని కక్షలలో నొకరిమీద నొకరినెక్కించి తాను నిజమైనయాధికారమును చలాయించవలెనని రాజు యత్నించెను. ఎప్పటికైనను తమకు మంచిరోజులు వచ్చునేమోయనునాశతో రాజును, రాణియును కుట్రలు పన్నుచుండిరి. ఫ్రెంచిక్లబ్బను పేర నొకక్లబ్బును ప్యారిసుపట్టణములో తన కుట్రదారుడగు మోలివెలిచేత స్థాపింప జేసి, యాక్లబ్బులో రహస్యముగా జీతములనిచ్చి సభ్యులను జేర్పించి, రాజుపక్షముగా నాందోళనము చేయించుచుండిరి. కొంతమంది మితవాదులగు శాసనసభ్యులుకూడ లంచములు పుచ్చుకొని ఈకుట్రలో చేరిరి.

విదేశరాజులతో తమంతట తాము కలహించవలెనను నుద్దేశ్యము శాసనసభకు లేదు. సాధ్యపడినయెడల స్నేహముగానుండవలెననుతలంపుమాత్రమే గలదు.

ఇతరరాజ్యములతో స్నేహమును కోరుట

నవంబరు 29వ తేదీని శాసనసభవారొక శాంతికరమగు ప్రకటనమును గావించిరి. "ఇతరదేశములను జయించవలెనను కోరిక యేమాత్రమును ఫ్రెంచిప్రజలకు లేదని ప్రమాణము గావించుచున్నాము. ప్రక్కనున్న దేశములవారి వాత్సల్యతనే కోరుచున్నాము. స్వాతంత్ర్యమును పొందినట్టియు, గొప్పదైనట్టియు మాజాతితరఫున నిష్కాపట్యమును మా మనఃపూర్తియగు స్నేహభావమును ప్రకటించుచున్నాము. మీయొక్క చట్టములను, మీ యాచారములను, మీ రాజ్యాంగవిధానములనూ మేము గౌరవించెదము. వానితో మే మెట్టిజోక్యమును కలుగజేసికొనము. మా చట్టములను, మా రాజ్యాంగవిధానమును మీరుకూడ గౌరవించెదరని నమ్ముచున్నాము. మీరక్రమముగా మామీద యుద్ధమునకు వచ్చినయెడల లోపమంతయు మీదేయగును. మే మప్పుడు మా సైన్యములను మా ఫిరంగులనేగాక, మా స్వాతంత్ర్యధర్మమునుగూడ మీకు వ్యతిరేకముగ నిలువబెట్టెదము. పునర్జీవమునుపొందిన ప్రజలతో యుద్ధముచేయుటవలన మీకు గలిగెడి ఫలితములకు మీరే జవాబుదారు లగుదురని విదేశప్రభువులకు తెలియపఱచవలసినదిగా రాజును కోరిరి. లూయిరా జట్లు తెలియపఱచెను. కాని, యూరోపురాజు లెవరు నీశాంతిసందేశమును

లక్ష్యపెట్టక కిరీటాధిపతులయొక్క గౌరవముకొఱకును, సురక్షితముకొఱకును, శపథము చేసికొనియున్న యొడంబడికను మార్చుకొనుటకు వీలులేదని ప్రత్యుత్తరమిచ్చిరి. తరువాత నిరువదిమూడు సంవత్సరములవఱకు నెడతెగక యూరపులో జరిగిన ఘోరయుద్ధమునకు, నిరంకుశత్వమును పునరుద్ధరింపదలచిన రాజులే జవాబుదారులు. ఫ్రెంచి జాతియొక్క స్వయంనిర్ణయమునకును, స్వాతంత్ర్యమునకును, యూరపుయొక్క నిరంకుశత్వమునకును, దురాశకును మధ్య జరిగిన ఈయుద్ధములో, ప్రథమమునుండియు నింగ్లాండు నిరంకుశపుపక్షముననే నిలువబడి, ఫ్రెంచిప్రజ లేర్పఱచుకొన్న ప్రభుత్వము నిర్మూలనమై పదునెనిమిదవ లూయీరాజును బలవంతముగా ఫ్రెంచిప్రజలపైన కట్టువరకును పోరాడెను.

(౩)

యుద్ధములో నపజయములు.

ఫ్రాన్సుదేశము యుద్ధమునకు తయారయ్యెను. గిరాండిస్టులు శాసనసభలో నెక్కువమందియు నెక్కువ పలుకుబడి గలిగియు నున్నందున లూయిరాజు వారిలోనుండి మంత్రుల నేర్పరచుకొనవలసివచ్చెను. ఏప్రిలు 20 వ తేదిన లూయిరాజు శాసనసభకు వచ్చి ఆస్ట్రియామీద యుద్ధమును ప్రకటించెను. ఈ వార్త, ఫ్రాన్సుదేశమునకు సంతోషముకలిగించెను. పట్టణములలోను జిల్లాలలోను నుత్సాహముతో ప్రజలు సైన్యములో చేరిరి. ధనసహాయముకూడ బాగుగాచేసిరి. కాని ఏప్రిలు 28 వ తేదిన బెల్జియములో ఫ్రెంచిసేనలు ఆస్ట్రియావారిచే

పూర్తిగ నోడింపబడి పల్లాచవరయ్యెను. లఫయత్తు సేనాని తన సేనలను మరల్చుకొని ఫ్రాన్సుపైదాడును చేసెను. శత్రువులు ప్యారిసుమీఁద పడుదురనుభయము ప్యారిసుప్రజలలో కలిగి విశేషకలవరమును కలిగించెను.

రాజుయొక్క ప్రవర్తనము.

విప్లవమునకు వ్యతిరేకులగు ప్రభుపక్షపాతులు సంతోషమును వెలిబుచ్చిరి. రాజు తన స్వంతసైన్యములను హెచ్చించుచుండెను. విప్లవమునకు వ్యతిరేకులనుండి సైనికుల చేర్చుకొనుచుండెను. రాణియట్లును ఆస్ట్రియారాజుతో సలహాలుచేయుచున్న బృందమొకటి చేరెను. శాసనసభవారు వెంటనే ప్యారిసునగరమున నిరువదివేలమంది రిజర్వుసైనికులను తయారుచేసిరి. రాజుయొక్క స్వంతసైన్యములను, రాణియొక్క ఆస్ట్రియాబృందమును తీసివేయవలెనని కోరిరి. జాతీయప్రభుత్వముచే నంగీకరింపబడని మతగురువులనెల్ల కల్లోలములను పురిగొల్పుచున్నందున వెంటనే ఫ్రాన్సుదేశమును వదలిపోవలసినదని శాసనము చేసిరి. ఈశాసనమును రాజు త్రోసివేసెను. రాజు గిరాండిస్టుమంత్రులను వెళ్ళగొట్టి, మితవాదులనుండి మంత్రివర్గము నేర్పరచుకొనెను. ప్రజలలో పలుకుబడి గోల్పోయినవారును, స్వల్పసంఖ్యాకులు నగు మితవాదులమీఁద ఆధారపడక, రాజు తన యాశలనన్నిటిని యూరపురాజులమీఁద పెట్టుకొనెను. మేలస్‌మాపాస్ అను రాయబారిద్వారా విదేశరాజులకు కబురంపెను. దేశముయొక్క కష్టముల కన్నిటికిని రాజే కారకుఁడుగ నున్నాఁడని శాసనసభవారి అంగీకారముతో రోలెండను

సభ్యుడు రాజునకుత్తరము వ్రాసిపంపెను. గిరాండిస్టుమంత్రులను తీసివేసినందులకు శాసనసభవారు తమ యసమ్మతిని దెలిపిరి. కాని రాజు తన దుష్ప్రవర్తనను మానలేదు. ఇందుమీఁద రాజును తీసివేసినగాని దేశమునకు సురక్షితము లేదని అతివాదులు ప్రజల కుపన్యాసముల నిచ్చిరి. పత్రికలలో వ్రాయుచుండిరి. క్లబ్బులలో తీర్మానించుచుండిరి. సంపూర్ణప్రజాస్వామ్యవాదులపలుకుబడి ప్రజలలో బాగుగ వృద్ధిచెందెను. ప్యారిసునగర మ్యునిసిపల్ అధ్యక్షుఁడును, సభ్యులును ఈకక్షిలోనే చేరియుండిరి.

(4)

రాజును తీసివేయవలెనను యత్నము.

జూన్ 20 వ తేదీ జాతీయసభ్యులు టెన్నిసుకోర్టు శపథమును తీసికొన్నదినము. దాని సంవత్సరోత్సవము పై ప్యారిసులోని ముప్పదివేలమంది జనులు, పురుషులు, స్త్రీలు, పిల్లలు జాతీయగీతములను విప్లవకీర్తనలను పాడుచు, శాసనసభామందిరమునకు వచ్చిరి. ప్రజాసమూహముయొక్క నాయకులు శాసనసభ కొకయర్జీ నిచ్చిరి 'రాజు తన యిష్టమువచ్చినట్లు ప్రవర్తించుచున్నాడు. ప్రజానురంజకులగు మంత్రులను దీసివేసినాడు. జాతియొక్క సౌఖ్య మొక మనుష్యుని దయమీఁద నాధారపడదగినంత తేలికైన వస్తువుకాదు. దేశము నీయపాయస్థితినుండి తప్పించుటకు మీరు వెంటనే పూనుకొను' డని చెప్పిరి. ఈసంగతి తాము జాగ్రత్తగా నాలోచింతుమనియు, ప్రజ లల్లరులు చేయకుండ తిరిగి యిండ్ల కేగవలయునని కోరుచు

న్నామనియు శాసనసభాధ్యక్షుడు చెప్పెను. ప్రజ లక్కడ నుండి పోయి రాజమందిరములో ప్రవేశించిరి. రాజు ధైర్యముగా తలుపులు తీయించి ప్రజలను రానిచ్చెను. జాతీయ భటులు ప్రజ లల్లరిచేయకుండ కాపాడిరి. రాజు ముందుకువచ్చి ప్రజలిచ్చిన జేకొబినులు ధరించెడి ఎఱ్ఱటోపీని ధరించెను. వారిలో నొకరిచ్చిన ద్రాక్షసారాయమును త్రాగెను. ప్రజలు సంతృప్తినొంది వెళ్ళిపోయిరి.

శాసనసభలో రాజును తీసివేయవలెనని గిరాండిస్టు కక్షి సభ్యులుకూడ చెప్పసాగిరి. వెర్నాడను సభ్యుడు దేశముయొక్క అపాయస్థితిని వర్ణించి, దీనికంతకును రాజును, ఆయన సలహాదారులును జవాబుదారులని, సభ్యులమనంబులు కరుగునట్లుపన్యసించెను. బ్రిసాట్ "రాజును, ఆయన సలహాదారులును భ్రమించినారని ఆటబొమ్మవలె త్రిప్ప యత్నించుచున్నా"రని చెప్పెను. యుద్ధము ముగియువఱకును శాసనసభ ఎడతెగకుండ సమావేశమగునట్లు తీర్మానించిరి. సభ్యులు రాష్ట్రములకు పోయి ప్రజలను పురికొల్పి సైన్యములలో జేర్చిరి. యుద్ధమునకు దృఢప్రయత్నములను జేసిరి.

రాజును ఖైదుచేయుట.

1792 సంవత్సరము జులై 26 వ తేదీన ప్రష్యాసేనాధిపతియగు బ్రన్స్విక్కుప్రభువు పదునాఱవలూయీరాజు గోల్పోయిన హక్కులను తిరిగి యిచ్చుటకయి తాము వచ్చుచున్నామనియు, లూయీరాజుకు వ్యతిరేకముగా నుండువారినెల్ల కాల్చివేయుదుమనియు మూరకపురాజ్యులతెరపున ప్రకట

నము చేసెను. ఇందుమీద ప్యారిసుప్రజ లాగ్రహపరవశులైరి. ఆగష్టునెల 10 వ తేదీన ఉదయము 7 గంటలకు ప్యారిసుప్రజలును జాతీయభటులును ఆయుధములను ధరించి ట్యూలరీమందిరమును ముట్టడించిరి. రాజుయొక్క విదేశీయభటు లెదిరించిరి. ప్రయోజనము లేదయ్యెను. రాజుచెంతనున్న జాతీయభటులు ప్రజలలో కలిసిరి. రాజు కుటుంబముతోగూడ పారిపోయి శాసనసభామందిరములో శరణుజొచ్చెను. శాసనసభవారు రాజును కుటుంబమును ఆమందిరముయొక్క కొన్నిగదులలో రెండురోజులుంచి ప్రజలయాగ్రహమునుండి సంరక్షించిరి. శాసనసభకు ప్రజలువచ్చి వెంటనే రాజును పదభ్రష్టుని చేయవలసినదని కోరిరి. సెప్టెంబరు 21 వ తేదీన ప్రభుత్వపద్ధతిని నిర్ణయించుట కొరకు నేషనల్ కన్వెన్షనును (జాతీయసమావేశము) కూర్చుటకును, రాజును రాజ్యభ్రష్టుని చేయు జవాబుదారి వారికి వదలుటకును, అంతవరకును రాజును అధికారమునుండి తొలగించి ఆయన యేర్పరచిన మితవాదమంత్రులను తీసివేయుటకును, శాసనసభవా రేకగ్రీవముగా తీర్మానించిరి. వెంటనే గిరాండిస్టుమంత్రులను శాసనసభవారు నియమించిరి. జాతీయప్రభుత్వమునకు వ్యతిరేకులగు మతగురువులను షుమారు నాలుగువేలమందిని దేశభ్రష్టులను గావించిరి. సైన్యములకు తగుప్రోత్సాహము కలుగజేయుటకై కమీషనరులను బంపిరి. పదునాఱవలూయీరాజు కుటుంబముతో కూడ సెప్టెంబరు 21 వ తేదీన ప్యారిసులోని టెంపిలుకోటలో విడిఖైదులో నుంచబడెను. యూరోపునంతను గడగడ వణంక

చేసియున్న ఫ్రెంచిరాజరిక మొక్కదినములోపల ప్రజాశక్తి ముందఱ కూలిపోయెను.

(౨)

ఈకాలమున ప్రష్యాసైన్యములు బహులుదేరి ఫ్రెంచి సరిహద్దులోపల ప్రవేశించి ఆగష్టు 20వ తేదీని లాంగులీపట్టణమును ముట్టడించి స్వాధీనపఱచుకొనెను. 30వ తేదీన వర్డన్ పట్టణమును ముట్టడించెను. వర్డన్ పడిపోయినచో శత్రువులు ప్యారిసువఱకు వచ్చుట సులభమగును. దేశమును సంరక్షించుకొను టెట్లని శాసనసభ్యులు చర్చించుకొనుచుండిరి. దేశములోని రాజపక్షపాతుల కెల్ల భయము పుట్టించవలెనని డాంటన్ చెప్పెను. శాసనసభ యేమియు తీర్మానించలేదు. ప్యారిసు పురపాలకసంఘమువారు ఇంటింటను ఆయుధములకొఱకు వెదకి శత్రువులు ప్యారిసును ముట్టడించినచో రాజపక్షమున చేరుదురని యనుమానింపబడిన ప్రభువులను, మతగురువులను, దేశభ్రష్టులైనవారి బంధువులను, రాజుక్రింద సైనికులుగనున్న వారిని చెరసాలలో నుంచిరి. సెప్టెంబరు 1వ తేదీ రాత్రికి వర్డన్ శత్రువులకు లొంగెనను సమాచారము ప్యారిసులో తెలిసెను. ప్రజల కలవరమునకు మేరలేదు. శత్రువులు ప్యారిసువఱకు వత్తురని గొప్ప భీతావహము కలిగినది. సెప్టెంబరు 2వ తేదీనుండియు వరుసగా మూడురోజులు, పేరున కొక విచారణకమిటీ యని యేర్పఱచి చెరసాలలను తెఱచి అనుమానగ్రస్తులగు సుమారు వేయిమందిని ప్యారిసుప్రజలు నిర్దా

యుద్ధములో జయములు.

క్షిణ్యముగ చంపివేసిరి. ప్రజలయావేశము ముందఱ శాసనసభ యేమియు చేయలేకుండెను. దెమరోసేనాని ఫ్రెంచిసైన్యములను తీసికొని శత్రుసైన్యముల మీదికి వెళ్ళెను. శత్రుసేనాని యగు బ్రున్సువిక్కు ప్యారిసుమీదికి సెకాయికి వచ్చుటకు సందేహించెను. మర్యాజుకోటను పట్టుకొనుటకై వెడలుచుండెను. త్రోవలో వాల్మీయొద్ద ఫ్రెంచిసైన్యములు శత్రువుల నెదుర్కొనెను. ఫ్రెంచిసైనికులసంఖ్య తక్కువగానున్నను దేశాభిమానపూరితులై పోరాడి శత్రువులను పూర్తిగ నోడించెను. లూయీరాజును పేరునకు రాజుగాచేసినను చాలునని ప్రష్యావారు సంధిరాయబారముల నంపగా ప్రష్యాసైన్యములు పూర్తిగా ఫ్రెంచిదేశము వదలివెళ్ళినగాని ఎట్టిరాజీనామా మాటలను మాట్లాడుటకే వీలులేదని ఫ్రెంచిప్రభుత్వమువారు జవాబు చెప్పిరి. తిండిలేక బాధపడి, రోగములచే పీడింపబడి, ప్రష్యాసైన్యములు సెప్టెంబరు 30 వ తేదినుండియు ఫ్రాన్సును వదలి వెళ్ళిపోయిరి. ఫ్రెంచిసైనికులు వర్డన్ లాంగ్విలీలను తిరిగి స్వాధీనపఱచుకొనిరి. ఆస్ట్రియనులు లిలీని ముట్టడించగా వారిని ఫ్రెంచిసైన్యములు తఱిమివేసెను. వాల్మీజయమువలన ఫ్రెంచివిప్లవము కాపాడబడెను. ఆ జయమును పొందిన మరుసటిదినముననే ప్యారిసులో జాతీయ సభవారు రాజును శాశ్వతముగా పదభ్రష్టునిచేసి సంపూర్ణ ప్రజాస్వామ్యమును ప్రకటించిరి.



# ఫ్రెంచి స్వాతంత్ర్య విజయము

## పదునేనవ అధ్యాయము

## రాజునకు మరణదండనము విధించుట

(1)

1792 సంవత్సరము సెప్టెంబరు 21 వ తేదీన నూతన జాతీయసభ సమావేశమయ్యెను. మితవాదు లెన్నికలకు నిలువ బడనేలేదు. వారియాజమాన్యమునుండిన ఫ్రా సంపూర్ణ ప్రజా రెంటుబ్బు మూయబడినది. కొంతమంది మిత స్వాతంత్ర్యమ. వాదులు దేశమును వదలిపోయిరి. కొంతమంది దేశములోనుండి తిరుగుబాటులను పురికొల్పచుండిరి. జాతీయసభలో కుడివైపున గిరాండిస్టులును, ఎడమ వైపున మాంటెనార్డులును, మధ్య నేకశక్తికిని చెందనివారును, కూర్చుండియుండిరి. ఎడమశక్తికి చెందినవారిలో రాబిస్పియరు, డాంటన్, మారటు మొదలగువారు ముఖ్యులు. ఎక్కువ రాష్ట్రములు గిరాండిస్టులనే యెన్నుకొనెను. కాని అతివాదు

లగు మాంటేనార్డులకు ప్యారిసుప్రజలలోను, మునిసిపాలిటీలో ను పూర్తిగ పలుకుబడిగలదు. జేకొబినుక్లబ్బులును వీరి యాజమాన్యముననే యున్నవి. జాతీయసభ కూడిగనే, రాజును తీసివేసి ఫ్రాన్సుదేశమును సంపూర్ణప్రజాస్వామ్యముగ (రిపబ్లిక్కుగా) చేసిరి. సెప్టెంబరు 22 వ తేదీనుండియు, నూతన శకప్రారంభ మగునట్లు ప్రకటించిరి. ఫ్రాన్సుయొక్క పంచాంగములో ప్రథమసంవత్సర మా తేదీనుండి ప్రారంభమును చేయించిరి.

రెండుపక్షములకును తగాదాలతో ప్రజాస్వామ్యప్రభుత్వము ప్రారంభమయ్యెను. సెప్టెంబరు రెండవ తేదీన ప్యారిసులో హత్యలు గావించినవారిని, ఆహత్యల ప్రోత్సాహకులను శిక్షించవలెనని గిరాండిస్టులు తీర్మానమును బెట్టిరి. ఉద్రేకసమయములలో వట్టివి జరుగక మానవనియు ఎవరిని శిక్షింపబనిలేదనియు అతివాదులు ఖండించిరి. అతివాదనాయకులగు రాబిస్పియరుమారటుగారులె యాహత్యలుచేయుటకుప్రోత్సాహకులని రెండవపక్షవారు నిందించిరి. తుదకు ఏమియు తేలకయే జాతీయసభవారు హత్యలవిషయము విడిచిపెట్టిరి. ఉభయపక్షములమధ్య మనస్తాపములు పెరుగుచుండెను. ఎక్కువసంఖ్యాకులగు గిరాండిస్టులనుండియే మంత్రులేర్పడిరి. గిరాండిస్టులనెట్లయిన కూలద్రోసి తా మధికారములోనికి రావలెనని యతివాదులు తలచిరి. అతివాదులు ప్యారిసుప్రజలగుంపుల యుద్రేకముమీదను జేకొబినుక్లబ్బులమీదను ఆధారపడియుండిరి. గిరాండిస్టులు అనుభవజ్ఞులును విద్వాంసులును గొప్ప

పక్షులునేకాని, ప్రజాసమూహములను తమ యభిప్రాయముల లోనికి త్రిప్పుకొనుటకు ప్రయత్నించలేదు. సామాన్యప్రజల లోనియాందోళనమును నిర్లక్ష్యముగా జూచిరి. ప్యారిసుప్రజలు అల్లరులకెల్ల కారకులగుచున్నారని బెదరించి, ముఖ్యపట్టణము యొక్క సానుభూతిని గోలుపోయిరి. ప్యారిసుయొక్క పలుకు బడినుండి రాష్ట్రములను వేరుచేయవలెనని ప్రయత్నించిరి కాని సాగలేదు.

(౨)

యుద్ధము.

యుద్ధము సాగుచుండెను. ఫ్రెంచిసైన్యములు జాతీయ వాదులగు యౌవనులతో నిండియుండెను. వీరు దేశము కొరకై కార్చిచ్చులో దుముకుటకును ప్రాణములు కోసియిచ్చుటకును సిద్ధపడినవారు. దుస్తులలోన ఆహారములలోను ఎట్టిలోపము లున్నను, వాని నన్నిటికిని సంతోషముగా సహించుచున్నవారు. వీరిలో చాలమంది జీతములు పుచ్చుకొనకుండ వచ్చినవారు. తమ దేశముయొక్క ఘనతకై యుద్ధములో ముందునకు దుముకుచుండిరి. ఇట్టి ధైర్యశాలురగు సైన్యములను యూరపు ఖండ మదివర కెన్నడున చూచియుండలేదు. ఫ్రెంచిసైన్యములకే ప్రతిచోటను జయముకలిగెను. ఫ్రెంచిసేన లిటలీలో జొరబడి శత్రువుల నోడించి సావాయి, నైస్, సార్డినియా లను లోబరచుకొనెను. జర్మనీలో ప్రవేశించి రైన్ రాష్ట్రము లను కొంతవరకు ఆక్రమించుకొని మైంజు, ఫ్రాన్కుఫర్టు కోట లను పట్టుకొనెను. బెల్జియముపై ఫ్రెంచిసేనలు దండెత్తి

పోయి నవంబరు 6 వ తేదీన జెమాపెసుయుద్ధములో ఆస్ట్రియా వారిని పూర్తిగా నోడించి, బెల్జియమును స్వాధీనపఱచుకొనెను. సావాయి, నైసులు ఫ్రాన్సులో చేరుటకు సమ్మతించినందున ఫ్రాన్సుయొక్క రాష్ట్రములుగ చేయబడెను. బెల్జియములోని ప్రభువులును, మతగురువులును ఆటంకము కలుగజేయుచున్నందున బెల్జియమును స్వతంత్రమయిన ప్రజాస్వామ్యమునుగా నుంచవలెనా లేక ఫ్రాన్సులో కలుపుకొనవలెనా యనువిషయమును ఫ్రెంచిజాతీయసభవారు ఆలోచించుచుండిరి. షెల్డునదిలో స్వేచ్ఛగా నన్నిజాతులవారును వర్తకపుటోడలు తెచ్చుకొనుటకై ఫ్రెంచివారనుజ్ఞనొసంగిరి. ఇదివఱకు నాంగ్లేయుల యోడలుమాత్రమే యీనది లోనికి వచ్చుచుండెను. బెల్జియము ఫ్రాన్సులో చేర్చుకొనబడుటకుగాని స్వతంత్రమయిన ప్రజాస్వామ్యముగా చేయబడుటకుగాని, ఆంగ్లేయుల కసమ్మతము. ఫ్రాన్సును విజృంభించకుండ నణచగల యొక రాజపాలనములోనే బెల్జియ ముండవలెనని ఇంగ్లీషువారి పట్టుదల. హాలండుమీఁదికి దండెత్తుటకై ఫ్రెంచివారు యోచించుచుండిరి. వీలయినచో సంధిచేసికొని యుద్ధ మంతరింపజేయవలెననియే ఫ్రెంచిజాతీయప్రభుత్వమువారు తిరిగి ప్రయత్నించిరి. హాలండుపై తాము దండెత్తుట మానుకొనెదమనియు, ఫ్రెంచిరాజును, ఆయన కుటుంబమును ఫ్రాన్సును విడిచిపోవుటకు సమ్మతించెదమనియు, బెల్జియముసంగతి సంధి జరుగువఱకును నిలిపియుంచెదమనియు ఫ్రెంచివారు ఇంగ్లాండునకును, ప్రష్యాకును సంధిరాయబారములను బంపిరి. ఇంగ్లాండు

ఈ రాయబారమును తృణీకరించెను. ఇంగ్లీషుప్రముఖుడగు బర్కు ఫ్రెంచివిప్లవమునకు వ్యతిరేకముగ "Reflections on the French Revolution" అను గ్రంథమును ప్రకటించుటయేగాక ఆంగ్లేయప్రభుత్వమువారు యూరపులోని రాజులందఱును ఫ్రాన్సుపై యుద్ధముచేయునట్లు పురిగొల్పిరి.

(3)

స్వాతంత్ర్య ప్రకటనలు.

నవంబరు 19 వ తేదీన, ఏదేశప్రజలయినను స్వాతంత్ర్యమును గోరి, తమ్ము పాలించుచున్న రాజులపయి తిరుగుబాటుచేసిన యెడల, తా మట్టిప్రజలకు సహాయము చేయుటకు సంసిద్ధులుగ నున్నామని, ఫ్రెంచి జాతీయప్రభుత్వమువారు ప్రకటనమును గావించిరి. డిసెంబరు 15 వ తేదీన, ఫ్రెంచి సైన్యములు పోయిన చోటనెల్ల, ప్రజలే తమదేశమును పాలించుకొనుటకు హక్కుదారులనియు, తమపైనున్న నిరంకుశప్రభుత్వముల ను ప్రభుపరంపరల ప్రత్యేకహక్కులను కూలద్రోసి, స్వతంత్రమైన ప్రజాపాలనమును స్థాపించుకొనవచ్చుననియు, నిందుకు తాము తోడ్పడెదమనియు ప్రజలలో ప్రకటించవలసినదని, ఫ్రెంచిప్రభుత్వమువారు ఉత్తరువులను జారీచేసిరి. డిసెంబరు నెలలో ఫ్రెంచిసైన్యములు హాలెండు నాక్రమించెను.

రాజును విచారించుట.

ఖయిదు చేయబడినరాజును విచారించి మరణశిక్ష విధించవలెనని అతివాదు లాందోళనము ప్రారంభించిరి. క్రొత్తగా నేర్పడిన ప్రజాస్వామ్యమునకు రాజు దేశములో బ్రతికియుండుట ఉపాయకరమని జెకొబిన్ క్లబ్బులు తీర్మానించిరి. రాష్ట్రముల

లోని ప్రజాసంఘములును నిట్టి తీర్మానములనే చేసి జాతీయసభకుపంపెను. ప్యారిసునగరప్రజలు 10వ ఆగష్టు తేదీన రాజసైన్యములచే గాయములు పొందినవారిని జాతీయ సభకు మోసికొనివచ్చి 'దీనికి లూయికాపటుకు ప్రతీకారము చేయవలసిన'దని కోరిరి. పదునారవలూయిరాజను నామము తీసివేసి, లూయికాపటని ఆయనను ప్రజలు పిలువసాగిరి. 'కాపటు' లూయిరాజు కుటుంబనామము. గిరాండిస్టులు రాజుయొక్క ప్రాణమును రక్షించవలెనను నుద్దేశ్యము గలిగి యుండిరి. గిరాండిస్టులను ప్రజలకు విద్వేషులుగ జేసి ఆకక్షిని పడగొట్టునూహతో అతివాదులు రాజును చంపవలెనని పట్టు పట్టిరి. ఈసమయమున తాము ప్రజానురాగమును పొంది 'యధికారమును సంపాదించవలెనని వీరిపన్నుగడ.

దురదృష్టవశమున 10 వ ఆగష్టుకు తరువాత సివిలు దస్తావేజులున్న కచ్చేరీలలో లూయిరాజు దేశవిరోధులతోను యూరపురాజులతోను కుట్రలుసలిపిన యుత్తరప్రత్యుత్తరములు దొరకెను. 1791 సంవత్సరము 16 వ యేప్రిల్ తేదీన, తనకు తిరిగి యధికారము వచ్చినచో విప్లవము నణచెడి ప్రాత నిరంకుశప్రభుత్వమునే స్థాపించెదననియు, మతాచార్యులకు వెనుకటిస్థితిని గలుగజేసెదననియు, ఫ్రెంచిజాతీయప్రభుత్వముతరఫున దాను యూరపురాజులమీద యుద్ధమును ప్రకటించినది,' వారు త్వరగా దండెత్తివచ్చి ఫ్రెంచిప్రజల నోడించి తనకు విముక్తి గలుగజేయుదు రనునాశతో మాత్రమే చేసితి ననియు, క్లేరుమాంటు బిషప్పుకు (మతాచార్యునికి) లూయి

రాజు ఉత్తరము వ్రాసినట్లు బయల్పడెను. "ఈయుద్ధమువలన త్వరగా నీరాజద్రోహులును అనీతిపరులు నగు ప్రించిమూకలమీద యగారపురాజు లందరు నొక్కుమ్మడిగా వచ్చెదరు. రాజులయొక్క లక్షయేబదివేలమంది సైనికులును ఇరువదివేలమంది దేశభక్తులును వచ్చి మీకు సహాయము చేతురు" అని ?నుపు వ్రాసిన ప్రత్యుత్తరముకూడ దొరకెను. రాజు బహిరంగముగా, తన సోదరులమీద బహిష్కారశాసనము చేసి, రహస్యముగా వారితో నాలోచనలు జరుపుచున్నట్లును ఋజువయ్యెను. ఇంతేగాక బ్యాంకుమందిరములోని యొకమూలనున్న గోడలో గనుపతిలువ్రుచే మూయించియున్న సొరంగములోకూడ. కొన్ని దస్తావేజులు దొరకెను. ... రాజు విదేశీయులతో కుట్రలు జరుపుటయేగాక, స్వదేశములోకూడ తిరుగుబాటులు జరుగుటకు కుట్రలుచేసినట్లును. మితవాదులను ప్రోత్సహించి శాసనసభను కూలద్రోయ యత్నించినట్లును దీనివలన స్పష్టపడెను

ఇందువలన నతివాదుల వాదమునకు ప్రాబల్యము కలిగెను. రాజును రక్షించదలచిన వారిపక్షము బలహీనమయ్యెను. జాతీయసభలో రాజువిచారణసంగతి చర్చకువచ్చినప్పుడు, కొందరు, రాజు చట్టములకు మించినవాడనియు, నాయనను విచారించుటకెవరికిని అధికారము లేదనియు, వాదించిరి. ఆయారాజువిచారణ జరుగవచ్చునా, జాతీయసభవారు విచారించవచ్చునా, యను విషయములను గూర్చి యభిప్రాయమిచ్చుట కేర్పరుపబడిన న్యాయవాదులయుపసంఘము

వారు విచారించవచ్చునని యభిప్రాయ మిచ్చిరి. రాజుగారి ప్రత్యేకవ్యక్తిగా శిక్షాస్మృతిక్రింద దేశద్రోహనేరమునకై విచారించవచ్చుననియు, దేశములోని న్యాయమునకంతకును మూలస్థానమయిన ప్రజలెన్నుకొనిన ప్రతినిధులగుటవలన, జాతీయసంఘమునకట్టి విచారణాధికారము గలదనియు ఆసంఘమువారు అభిప్రాయికను వ్రాసిరి. ఈ నివేదనవచ్చిన యారుదినములకు తరుగ 13వ నవంబరు నుండియు, జాతీయసభలో నీవిషయమై తిరిగి చర్చలు జరిగెను. రాజును శిక్షించుట కెవరికిని అధికారము లేదనియు, జాతీయసభ కాయనపై న్యాయవిచారణ చేయుటకు హక్కు లేదనియు, నింతేగాక రాజునకు న్యాయము, కరుణ కనుపఱచవలసినదనియు, నూతనప్రజాప్రభుత్వ సౌభాగ్యవంతము నయినదను కీర్తిని పొందవలసినదనియు, రాజును శిక్షించుటవలన దేశములోపలను బయటను ఉపద్రవము లెక్కువ కలుగుటకు కారణమగుననియు, కొందఱు చెప్పిరి. ప్రతివాదులు, లూయిరాజు దేశద్రోహియనియు, మానవకోటికి శత్రువనియు, ఆయన జీవించియుండుటవలన దేశములో విద్రోహములు పెరుగుబాటులకు కారణమగుననియు, విచారణ లేకుండగనే ఆయనను మరణశిక్ష విధించుట దేశక్షేమమునకు అత్యావశ్యకమనియు చెప్పిరి. "విచారణతో మనకు సంబంధము లేదు; లూయి ముద్దాయిగాడు; మీరు న్యాయాధిపతులుగారు; మీరు రాజకీయవేత్తలు; ఒకమనుష్యునిమీద నేరముస్థాపనము చేయుటగాని నిర్దోషియని చెప్పుటగాని మీపనికాదు; మీ దేశసురక్షితమునకు కావ

శ్యకమేదో దానినే చేయుట మీవిధి; జాతినికాపాడుట మీ ధర్మము; సింహాసనభ్రష్టుడయిన రాజు రెండుపనులకే తగి యున్నాడు: దేశముయొక్క శాంతిని భంగపఱచుటకును, దాని స్వాతంత్ర్యమును చెడగొట్టుటకును. ఆయి రాజుగ నుండెను. ఆయనను తీసివేసి ప్రజాస్వామ్యమును స్థాపించితిమి. ఇందువలననే మీ రాలోచించుచున్న సమస్య తేలిపోయినది. ఆయనుని విచారించనక్కర లేదు. ఇదివరకే మీరు విచారించి దోషియని నిర్ధారణ చేసియున్నారు. లేనిమొదల ప్రజాస్వామ్యమును స్థాపించి యుండెడివారముగాదు" అని యతివాదినాయకుడగు శాస్త్రియాసు చెప్పెను. "ఒకరాజునకు న్యాయమైన శిక్షవిధించుటకు చేతులువణకుచున్నవారు, శాశ్వతపునాదులమీద ప్రజాప్రభుత్వము నెట్లుల నిర్మించగలరు? స్వాతంత్ర్యమునుగోరు పౌరులారా! స్వాతంత్ర్యమును పొందిన ప్రథమదినమునుండియు మీ ఆధిపత్యమును గౌరవముగా జ్ఞాపకముంచుకొనునెడల, రోమనులవలెను ఇంగ్లీషువారివలెను కొంతకాలమయిన తరువాతనయిన తిరిగి రాజును తెచ్చిపెట్టుకొనుదురను భయమునకు తావుండదా!" అని పెంటుదస్తు చెప్పెను. జాతీయసభలో నెక్కువమంది యొకవైపున అతివాదుల యభిప్రాయములను, మరియొకవైపున రాజును విచారించనేగూడదనువారి వాదనలను త్రోసివేసి, ఆయిరాజును విచారించుటకే తీర్మానించిరి. ఆయనమీద నేరారోపణచేసి ఆయన జాతీయసభకువచ్చి జవాబు చెప్పవలసినదని కోరిరి.

నాలుగు నెలలనుండియు లూయిరాజును, కుటుంబమును టెంపిలుకోటలో ఖైదీలుగనుండిరి. ప్యారిసుమ్యునిసిపాలిటీవారు బహు అనుమానముతో గట్టిగా కాపుదలలు చేసిరి. లూయి యన్నిటికిని మనస్సు సమాధానపర్చుకొని శాంతచిత్తుడై తనకు రానున్నదాని ననుభవించుటకు సిద్ధముగానుండెను. క్లెరీ యను నొక నౌకరుమాత్రమే ఆయనయొద్దనుండెను. అతడే ఆయనకుటుంబమునకును సేవ చేయుచుండెను. ఖైదువేయబడిన మొదటినెలలలో ప్రతిదినమును ఆయన కుటుంబముతో కలిసికొనుచుండెను. దీనివలన ఆయనమనస్సునకు కొంతవరకు తృప్తియుండెను. దురదృష్టములో భాగస్వాములుగ భార్యయగు మేరీఆంటునెటును, సోదరియగు ఎలిజబెత్తును నుండిరి. వారి నాయన ఓదార్చుచుండెను. చిన్నరాకొమరునికి లూయి దురదృష్టవంతులను గూర్చిన విషయములు బోధించుచుండెను. లూయి విశేషముగా గ్రంథములను చదువుచుండెను. ఇంగ్లాండు చరిత్రను తిరుమగా చదువుచు ఇంగ్లీషుప్రజలు సింహాసనభ్రష్టులనుచేసిన రాజుల కథలను, ఇంగ్లీషువారు శిరచ్ఛేదముచేసిన ఛార్లెసురాజుచరిత్రమును ముఖ్యముగా పఠించుచుండెను. కాని కుటుంబమును ప్రతిదినము చూచుభాగ్యముకూడ నాయనకు త్వరలోనే పోయినది. ఆయనను విచారణచేయవలెనను నాలోచనలు ప్రారంభముకాగనే అందరును కలిసి యాలోచించుకొనకుండ నాయనను, కుటుంబమును వేరుజేసి యొకరినొకరు చూచుకొనకుండ ప్యారిసుపురపాలకసంఘమువారు కట్టుదిట్టములుచేసిరి.

ఈస్థితిలో నుండగా జాతీయసభకు లూయిని తీసుకొని రావలసినదని పురపాలకసంఘోద్యోగియగు సాంటెర్ ఉత్తరువు చేసిరి. ఆయనయును ప్యారిసుపురపాలనాధ్యక్షుడును టెంపిలు కోటకు వెళ్లి రాజుతో నీసందేశమును చెప్పి 'దయచేసెదరా' యని యడిగిరి. ఒక్కనిమిషమాలోచించి లూయిరాజు వారితోకూడ వెళ్లెను. లూయిరాజు జాతీయసభలోనికి ప్రవేశించి యన్నివైపుల నొక్కసారి వీక్షించెను. జాతీయసభాధ్యక్షుడు "లూయి! ఫ్రెంచిజాతి మీమీద నేరములు మోపుచున్నది. అవి మీకు చదివి వినిపించెదను. కూర్చుండుడి" యని చెప్పెను. అదివరకే వేయబడియున్న యొక యాసనముపై లూయి కూర్చుండెను. చాలసేపు విచారణజరిగెను. లూయి మనస్థైర్యముతో ప్రతిప్రశ్నకును స్పష్టముగా సమాధానము చెప్పెను. తన ప్రవర్తన నిష్కల్మషమయినదనియే యాయన చెప్పెను. దేశశత్రువులతో తాను రహస్యాలోచనలు జరుపనే లేదని చెప్పెను. లూయిదస్కతుగల దస్తావేజులను ప్రతికక్షులు చూపిరి. లూయి వానిని తనదస్కతని యొప్పుకొనలేదు. ఇనుపమూతవేసిన సొరంగముసంగతి తనకు తెలియదనెను. తన తరఫున వాదించుటకొక న్యాయవాది నియ్యవలసినదని లూయి కోరెను. విచారణకు తిరిగి వాయిదా వేయబడెను. లూయిని తిరిగి టెంపిలుకోటలో విడిచిరి.

కొందరు ప్రతివాదు లాక్షేపించినను జాతీయసభవారు లూయిరాజునకు న్యాయవాది నిచ్చుటకే యంగీకరించిరి. జాతీయసభ్యులలో నొకరగు సుప్రసిద్ధన్యాయవాది మాలె

షెర్బ్ రాజుతరఫున వాదించుటకు బూనుకొనెను. "అప్పటి కనేకమంది గొప్పవారికిదుర్లభమయిన మంత్రిపదవిని నాకు రెండుసార్లు లూయీరాజు ఇచ్చియున్నాడు. ఇప్పుడాయనకు నేను కృతజ్ఞతను చూపెద"నని మాలెషెర్బ్ చెప్పెను. మాలెషెర్బ్ లూయీతో సంభాషించుటకు టెంపిలుకోటలోని లూయీయున్న గదిలోనికి వెళ్ళగనే లూయీ లేచివచ్చి కన్నీళ్ళతో మాలెషెర్బ్‌ని కౌగలించుకొని "మీత్యాగము మిగుల సౌదార్యసంతమయినది. నాప్రాణమును మీరు సంరక్షించలేకపోగా. మీప్రాణమునకుకూడ సపాయమును తెచ్చుకొన్నారు." అని లూయీచెప్పెను. మాలెషెర్బ్, ట్రాన్షె, డెసీజ్ లనుముగ్గురు న్యాయవాదులు సమర్థాయివాదమును తయారుచేసిరి. "నాప్రాణమును తప్పక తీసెదరు. నాకు మరణము నిశ్చయము. కాని, నేను నిర్దోషినని భావిసంతతివారికైనను తెలియగలందులకు మనము వాదించు టవసర"మని లూయీ వారితో చెప్పెను.

రాజునకు మరణ శిక్ష విధించుట.

విచారణదినమున లూయిరాజు హాజరయ్యెను. అనేకమంది ప్రజలు చూడవచ్చిరి. అంతయు బహునిశ్శబ్దముగా నుండెను. లూయితరఫున న్యాయవాదులలో డెసీజ్ వాదనమును నడిపెను. అనేక హేతువులను యుక్తియుక్తముగాచెప్పి లూయిరాజు కెప్పుడును పవిత్రమయినట్టియు ప్రజాసౌఖ్యమును గోరునట్టియు యుద్దేశ్యములుమాత్రమే కలవనిచూపెను. గంభీరమైన యుపన్యాసముతో వాదమును ముగించెను: "న్యాయ

సంరక్షకులారా! వినుడు. చరిత్ర భావికాలములో నేమివ్రాయనున్నదో యోచించుకొనుడు. లూయిరాజు ఇరువదవయేట చిన్నతనముననే రాజ్యమునకువచ్చెను. నీతిలోను, న్యాయములోను, మితవ్యయములోను ఆదర్శప్రాయముగ ప్రవర్తనను కలిగియుండెను. ఆయనకు దురభ్యాసము లేవియులేవు. ఏ దుర్వ్యసనమునకు నాయన లోనుగాలేదు. ఆయన ఎల్లప్పుడును ప్రజలకు స్నేహితుడుగనే యుండెను. తమ్మును పీడించుచున్న పన్నును తీసివేయుమని ప్రజలుకోరిరా? లూయి వెంటనే తీసివేసెను. బానిసత్వమును రూపుమాపవలెనని ప్రజలు కోరిరా! లూయి వెంటనే రూపుమాపెను. సంస్కరణములు చేయవలెనని ప్రజలు కోరిరా! లూయి వెంటనే చేసెను. చట్టములు, మార్చవలెనని ప్రజలుకోరిరా? లూయి వెంటనే మార్చెను. లక్షలకొలది ఫ్రెంచిప్రజలకు రాజకీయహక్కులను కోరిరా? లూయియిచ్చెను. ప్రజలు స్వేచ్ఛనుగోరిరా? లూయి ప్రసాదించెను. ప్రజలకొరకు లూయి గొప్పత్యాగములు చేసెనని యొప్పుకొనకతప్పదు. ఇట్టి లూయిని మీరు చంప చూచుచున్నారు. పౌరులారా! ఇంతకన్న నెక్కువ నేను చెప్పను. తక్కినదంతయు చరిత్రకు వదలివేయుచున్నాను. మీరిప్పుడు చెప్పెడితీర్పును చరిత్ర విమర్శించునని జ్ఞాపకముంచుకొనుడు. ఇందుపై చరిత్ర యిచ్చెడితీర్పు శాశ్వతముగానుండును." అని యుపన్యాసమును ముగించెను. తీర్పుకు వాయిదా వేసి లూయిరాజును జెయిలు కోటకు పంపిరి.

లూయిని కాపాడవలెననియే గిరాండిస్టులకు గలదు గాని తమ్ముము, రాజరికమును తిరిగి నెలకొలుపదలచినవారని దేశములో నతివాదు లల్లరిపెట్టుదురను భయము వీరికి కలిగి ఎటుచేయుటకును తోచకుండిరి. అతివాదులు శాకచక్యముతో నాందోళనము సలిపిరి. రాజుతరఫున వాదనయంతయు రాజరికమును తిరిగి స్థాపింపయత్నించుటకే యని విరు చెప్పసాగిరి. జెకొబినుక్లబ్బులు వీరికి తోడ్పడెను. రాజును వెంటనే చంపవలెనని జాతీయసభకు మహజర్లు వచ్చెను. లూయి నిర్దోషియని యనుటవలన ప్రయోజనము లేదనియెంచి ఆయన విషయమైన తీర్పు జాతీయసభవారు చెప్పక ఫ్రెంచిప్రజలకు వదలివేయవలెనని కొందరు గిరాండిస్టులు తలచిరి. తీర్పు జాతీయసభవారే చెప్పి అందుమీద ప్రజలయభిప్రాయము నడుగవలసినదని మరికొందరు గిరాండిస్టులు చెప్పిరి. రాష్ట్రములలోని ప్రజలు రాజును రక్షించుట కొప్పుకొనెదరని విరియాశ. ప్రజలకు వదలివేయుటవలన దేశములో అంతర్యుద్ధము సంప్రాప్తమగునని కొందరు ఆక్షేపించిరి. అన్నివిషయములలోను జాతీయసభ్యులయభిప్రాయములు తీసికొనబడెను. లూయి దోషియనియే అందరును ఏకగ్రీవముగా తీర్మానించిరి. ప్రజలయభిప్రాయము తీసికొనవలెనని రెండువందలయెనుబదిమందిసభ్యులును, జాతీయసభవారే పూర్తిగ తీర్పుచెప్పవలసినదని నాలుగువందలయిరువదినలుగురుసభ్యులునుసమ్మతుల నిచ్చిరి. ఏమిశిక్ష విధించవలెననువిషయములో, గిరాండిస్టులలో కొందరు రాజును దేశభ్రష్టునిచేయుటకును, కొందరు ఖైదు

లోనే యుంచుటకును, సమ్మతుల నిచ్చిరి. మూడువందల అరవదియొకరు వెంటనే మరణశిక్ష వేయవలెనని సమ్మతుల నిచ్చిరి. ఇరువదియారుమంది ఎక్కువసమ్మతులతో (మెజారిటీతో) రాజునకు మరణశిక్ష విధించవలెనను తీర్మానము అంగీకృతమయ్యెను. ఆ అధ్యక్షుడు దుఃఖచిహ్నముతో "జాతీయసభ పేర లూయీ కాపెటునకు మరణశిక్ష తీర్మానింపబడిన"దని ప్రకటించెను. కొద్దిమంది మెజారిటీ వలనమాత్రమే మరణశిక్ష తీర్మానింపబడినందున శిక్షను పునర్విమర్శ చేయవలసినదని రాజుయొక్క న్యాయవాదులు కన్నీళ్లతో కోరిరి. "బహు కొద్దిమందిగల యెక్కువసంఖ్యతోనే చట్టములన్నియు చేయబడుచున్న"వని యొక యతివాది జవాబుచెప్పెను. "అవును. చట్టములు తిరిగి మార్చవచ్చును. చనిపోయిన మనుష్యుని తిరిగి బ్రతికించజాలము"మని యొకరు ప్రత్యుత్తరమిచ్చిరి. పునర్విమర్శ తీర్మానముమీద సమ్మతులు తీసికొనగా నది యోడిపోయెను. పదునారవ లూయీరాజునకు మరణదండన స్థిరపడెను.

రాజాను శిరచ్ఛేదము చేయుట.

లూయీరాజు అందుకు సిద్ధపడియేయుండెను. మాలెషెర్బ్ కన్నీళ్లు కార్చుచు నీశిక్షసంగతి లూయీకి చెప్పుటకు పోయినపుడు లూయీ చేతిలో తన్నులు మూసికొని యొంటరిగా నేదో గొప్పయాలోచనలో మగ్నుడై యుండెను. మాలెషెర్బ్ వెళ్ళగనే లూయీ లేచి "రెండుగంటలనుండియు నాపరిపాలనములో నే నెప్పుడైన నాప్రజలకు కీడుచేసితినా యని యాలోచించుకొనుచున్నాను. నే నిప్పుడే భగవంతుని నన్ను

ధికి పోబోవుచున్నాను. నే నెప్పుడును నాప్రజలసౌఖ్యమునే కోరి ప్రవర్తించితినని నేను మీకు ప్రమాణము చేయుచు న్నాను.'' అని లూయీరాజు చెప్పెను. మరణదండనసంగతి లూయీ శాంతముగా వినెను. మరణమునకు తయారగుటకు మూడుదినములు వ్యవధి యియ్యవలెననియు, తనకుటుంబమును చూడనియ్యవలెననియు, తన కొరకు మతాచార్యుని ఇయ్యవలె ననియు లూయీ కోరెను. ఆఖరు రెండుకోరికలును మన్నిం పబడెను. ఒకరోజు వ్యవధిమాత్రమే యియ్యబడెను. ఆ దిక్కు లేని కుటుంబమును లూయీ చూచిన కడసారిచూపు మిక్కిలి దుఃఖకరమైనదిగా నుండెను. మరియొకసారి దర్శించెదనని కుటుం బముతో లూయీ చెప్పెను. కాని తిరిగి వారిని చూడలేక పోయెను. "నా దురదృష్టవంతులను చూడలేను" అని లూయీ తనలో అనుకొనెను. ఆరాత్రి లూయీ శాంత ముగా నిద్రించెను. మరుసటియుదయ మయిదుగంటలకే సేవకుడు లూయీని నిద్రనుండి లేపెను. ఆయన స్వాధీనములోని ఆ స్వల్పవస్తువులను యనగ నొక యుంగరము, ముద్ర, కొన్ని వెంట్రుకలు, సేవకున కిచ్చెను. అదివరకే ఫిరంగులమ్రో తలును, వాద్యములచప్పుడులును ప్రారంభ మయ్యెను. ఇంతలో సాంటెర్ వచ్చెను. "నాకొరకు మీరు వచ్చినారు. ఒకనిమిష మాగు" డని లూయీచెప్పి తాను వ్రాసిన మరణశాసనము నా మ్యునిసిపలుయుద్యోగస్థునికిచ్చి "పోదము రండి" యని లూయీ కోటునిధరించి బయలుదేరెను.

టెంపిలుకోటయొద్ద నిలువబెట్టబడియున్న గుఱ్ఱపు బండిలో సాంతెరీతో కూడ లూయిరాజెక్కె నొకగంటలో ఉరితీయు స్థలమగు ప్లాసి డి రివల్యూషనుకు వచ్చెను. త్రోవ పొడుగునను ఇరుప్రక్కలను ఆయుధపాణులగు సుమారు రెండు వేలమంది సైనికులు కాపుగలకాయుచుండిరి. ప్యారిసు పట్టణమంతయు నిశ్శబ్దముగనుండెను. ఉరిప్రదేశమునకు చూడ వచ్చిన ప్రజలు సంతోషమునుగాని విచారమునుగాని వెలిబుచ్చక నిశ్శబ్దముగా చూచుచుండిరి. లూయి గుఱ్ఱపుబండి దిగెను. ధైర్యముగా ఉరిస్తంభముపై నెక్కెను. మతాచార్యుని దీవనను పైకొనుటకు మోకరించెను. "సెయింటులూయి కుమారుడా! స్వర్గమునకుబొమ్ము" అని మతాచార్యు డాశీర్వదించెను. లూయి తన చేతులు బంధింపబడుటకు కొంచె మయిష్టతను చూపెను. తరువాత సమ్మతించెను. ఉరిస్తంభము యొక్క ఎడమప్రక్కకు ముందరగా వెళ్లి "నేను నిర్దోషిగా చనిపోవుచున్నాను. నాశత్రువులను నేను క్షమించుచున్నాను. దురదృష్టవంతులగు ప్రజలారా!......" అని లూయి చెప్పబోవుచుండగా ఆయనచెప్పునది వినబడకుండ తప్పెటలు వాద్యములు మ్రోగించబడెను. వెంటనే ముగ్గురు శిరచ్ఛేదకులు వచ్చి ఆయనను పట్టుకొనిరి. 1793 సంవత్సరము జనేవరి 21వ తేదిన ఉదయము పదిగంటల పదినిమిషములకు లూయి ప్రాణములను విడిచెను.

ఈవిధముగా ముప్పదియెనిమిదవయేట, పదునాలుగున్నర సంవత్సరములు రాజ్యపాలనచేసి, ఫ్రాన్సుయొక్క మిక్కిలి యోగ్యుడగునట్టియు మిక్కిలి బలవంతుడయినట్టియు రాజు మరణించెను. ఆయనపూర్వుల పరిపాలనాలోపములవలన ఆయనకాలములో గొప్పవిప్లవము కలిగెను. దైవభీతియు ప్రజలయందు ప్రేమయు నాయనకుండెను. కాని ప్రజలలో కలిగిన నూతనభావములను సరిగా గ్రహించి వానికి తాను నాయకుడై ప్రజలను నడిపించగల దూరదృష్టియు సామర్థ్యమును ధైర్యస్థైర్యములును కలిగియుండనందున ప్రజాశక్తి కాహుతుడయ్యెను.



ఫ్రెంచి

# స్వాతంత్ర్యవిజయము



పదునాఱవ అధ్యాయము

## అతివాదులు

(1)

లూయిరాజు మరణించినతరువాత ఫ్రాన్సు దేశము యొక్క కష్టము అంతరించలేదు. జాతీయసభలో గిరాండిస్టులకును అతివాదులకును మధ్య తగాదాలు హెచ్చి యూరపులోని నవిగాని తగ్గలేదు. యూరోపులోని శత్రుమండలి. ఫ్రాన్సుయొక్క పట్టుదల ద్విగుణీకృతమయ్యెను.

ఆగష్టు 10 వ తేదీన లూయిని రాజ్యభ్రష్టుని చేసినప్పటినుండియు నింగ్లాండుపరిభుత్వమువారు ఫ్రెంచిరాయబారిని వెడలగొట్టిరి. నూతనపరిభుత్వము నంగీకరించనని ఆంగ్లేయప్రధానమంత్రి విలియంపిట్టు చెప్పెను. ఫ్రెంచిజాతీయసభవారు 1793 వ సంవత్సరము ఫిబ్రవరి 1 వ. తేదీన బెల్జియమును ఫ్రాన్సులో కలుపుకొని ఇంగ్లాండుమీద యుద్ధమును ప్రక

టించిరి. ఇంగ్లాండు ఫ్రాన్సు దేశము నణచుటకు యావచ్ఛక్తిని విని యోగించెను. ఆకాలమున ఫ్రాన్సు దేశము నాగరికతలో యూరోపుఖండమునం దగ్రస్థానము వహించియున్నది. ప్రపంచము యొక్క వర్తకములోను పలుకుబడిలోను ఇంగ్లాండుకు పోటీగా నున్న దొక్క ఫ్రాన్సు దేశమే. అప్పటికి తక్కిన దేశములు తగ్గు స్థితిలో నున్నవి. ఇట్టి మంచి యవకాశమును జారవిడువక, యూరోపులోని రాజులనందరిను పోగుచేసి ఫ్రాన్సు నణగద్రొక్కిన మొదల తనకు ఫ్రాన్సు దేశపుపోటీపోయి అమెరికాఖండములోను హిందూదేశములోను అడ్డులేకుండ రాజ్యమును వ్యాపింపజేయవచ్చుననియు యూరోపుఖండమున తానగ్రస్థానము వహించవచ్చుననియు, ఇంగ్లాండుయొక్క అభిప్రాయము. అప్పటికి హిందూదేశములో కొద్దిభాగము మాత్రమే యింగ్లీషువారికి వచ్చినది. స్వదేశరాజులు ఇంకను పెక్కుమంది యుండిరి. [illegible] వ్యయమునైన ఖర్చుపెట్టి ఫ్రాన్సును కాలద్రోయుటకెంతయో ఇంగ్లాండుయొక్క పట్టుదల. ఆరునెలలలోపల ఫ్రాన్సుకు ప్రతికూలముగ యూరోపులోని వివిధప్రభుత్వములతో నింగ్లాండుకు వేఱ యొడంబడికలు చేసికొనెను. అనేకమందిరాజులను ప్రోత్సహించి ఇంగ్లాండు యుద్ధములోనికి తెచ్చెను. మార్చి 4 వ తేదీన ఇంగ్లాండునకును హానోవరుకును ఒడంబడిక; మార్చి 25 వ తేదీన ఇంగ్లాండుకును రష్యాకును సంధి; మే 20 వ తేదీన స్పెయినుతో సంధి; జులై 12 వ తేదీన ఇటలీతో సంధి; జులై 14 వ తేదీన ప్రష్యాతో సంధి; ఆగష్టు 30 వ తేదీన ఆస్ట్రియాచక్రవర్తితో సంధి; సెప్టెంబరు 26 వ తేదీన పోర్చు

గలుతో సంధి. ఇన్నిసంధులను ఇంగ్లాండు ప్రత్యేకప్రత్యేకము గా చేసికొనెను. ఇంతేగాక ఇంగ్లాండు యుద్ధవ్యయము భరించునట్లును ఆయాప్రభువులు సైన్యములను బంపి ఫ్రాన్సు మీద పడునట్లును, ఏప్రిలు 10 వ తేదీన హెస్సెకాసిలు ప్రభువుతోను, ఏప్రిలు 25 వ తేదీన సార్డినియాప్రభువుతోను సెప్టెంబరు 21 వ తేదీన బేడెన్ ప్రభువుతోను, యొడంబడికలు చేసికొనెను. ఆస్ట్రియాకును ప్రష్యాకును యుద్ధవ్యయమునకై ఇంగ్లాండు చాల ధనమిచ్చెను. ఈవిధముగా నింగ్లాండు ఫ్రెంచి జాతియొక్క స్వయంనిర్ణయమునకు బద్ధశత్రువై యుద్ధము నడిపినది.

ఇంతమంది శత్రువులు ఫ్రాన్సుయొక్క అన్నిసరిహద్దులను ఒక్కసారి వేలకొలది సైన్యములతో ముట్టడించెను. ఫ్రెంచిజాతీయసభవారు సరిహద్దుల నన్నివైపులను కాపాడు కొనుటకు వెంటనే మూడులక్షల సైన్యములను తయారుచేసిరి. ఏప్రిలు 6 వ తేదీన యుద్ధమును జయప్రదముగా నడుపుటకై పండ్రెండుమందిగల (కమిటీ ఆఫ్ పబ్లిక్ సేఫ్టి), దేశసంరక్షక సంఘము నొకదాని నేర్పరచిరి. దేశములోపల జాతీయప్రభుత్వమునకు వ్యతిరేకులని యనుమానింపబడినవారిని పట్టుకొనుటకు పండ్రెండుమందిగల దేశపుకాపుదలసంఘము (కమిటీ ఆఫ్ జనరల్ సెక్యూరిటీ) నొకదానిని స్థాపించిరి. వీరుపంపినవారిని విచారించి శిక్షించుట కొరకు విప్లవన్యాయస్థానము నేర్పరచిరి.

(2)

సెప్టెంబరు నెలలో హత్యలుగావించిన కొందరిని విచారించుటకు గిరాండిస్టులు ప్రారంభించగా నతివాదులట్టి విచారణ కూడదని యాపిరి. రాజునురక్షింప యత్నించి నందుకు గిరాండిస్టులను అతివాదులు క్లబ్బులలో తీవ్రముగా ఖండించిరి. వర్తకులు సరుకులమ్మక దాచుకొనగా ధరలు పెరిగినందున ప్రజలు వెళ్లి దోచుకొనిరి. ఇది అతివాదనాయకుడగు మారెటు సలహా మీద జరిగినదని గిరాండిస్టులు జాతీయసభలో కఠినముగా విమర్శించిరి.

గిరాండిస్టు కక్షి పడిపోవుట.

ఇంతవరకును ఫ్రెంచిసేనలను నడిపిన డ్యూమరో సేనాని లూయిరాజుమరణమునకు చింతించి నూతనప్రభుత్వమునకు వ్యతిరేకుండయ్యెను. ప్యారిసుమీదికిపోయి తిరిగి రాజరికమును స్థాపించ నుద్దేశించెను. ఆస్ట్రియా సేనాధిపతితో కుట్రలునలిపి తన స్వాధీనములోని కొన్నికోటలను ఆస్ట్రియావారికి వశము చేసెను. కాని ఆయనక్రిందనున్న సేనలు ఆయనతోకూడ శత్రువులతో చేరుటకు సమ్మతించలేదు. డ్యూమరో సేనానిని జాతీయప్రభుత్వమువారు సేనాధిపత్యమునుండి తొలగించిరి. ఆయనయు మరియిద్దరుసేనానులును మాత్రము లేచిపోయి శత్రువులతో చేరిరి. ఆయనక్రిందనున్న సేనలన్నియు ఫామర్సు కువచ్చి మరియొక సేనాధిపతిక్రిందనున్న మిగిలిన ఫరాసుసైన్యములతో చేరెను. డ్యూమరో గిరాండిస్టులకక్షికి చెందియుండెను. ఆయనయొక్క కుట్రలో మిగిలిన గిరాండిస్టులును గల

రని యతివాదులు నిందలుమోపిరి. ప్యారిసుప్రజలసహాయ
మున గిరాండిస్టులను జాతీయసభనుండి వెడలగొట్టవలెనని
యతివాదు లాలోచించుచుండిరి. గిరాండిస్టు లతివాదనాయకు
డగు మారటుమీద వర్తకులను దోయించినాడను నేరా
రోపణచేసి నూతనవిప్లవన్యాయస్థానమునకు విచారణకు బంపిరి.
ప్యారిసుపట్టణములోను క్లబ్బులలోను గొప్పయాందోళనము
కలిగెను. ప్యారిసుపురపాలకాధ్యక్షుడు వెంటనే గిరాండిస్టు
లలో ముఖ్యులను జాతీయసభనుండి రాజీనామా నిచ్చి
పోవలెనని ప్యారిసుపురపాలకసంఘముతరఫున కోరెను. మా
రటుమీద కేసు కొట్టివేయబడెను. మారటును ప్యారిసుప్రజ
లూరేగించిరి. జేకొబినులపక్షమువారు జాతీయసభను చూడ
వెళ్లి కూర్చొని గిరాండిస్టులు మాట్లాడుచున్నపు డల్లరిచేయుచుం
డిరి. ప్యారిసుమ్యునిసిపాలిటీయొక్క ప్రవర్తనను విచారించుట
కొకకమిటీని గిరాండిస్టులు నియమించిరి. వీరివిచారణమూ
లమున మ్యునిసిపలుసభ్యులకు చాలభయముకలిగెను. మే 23 వ
తేదిన అమలుజరుగనున్న మరియొకకుట్ర గలదని తేలెను.
మ్యునిసిపలుసంఘములో చేరిన హెబర్టును, మరికొందరిని కుట్ర
క్రింద పట్టుకొనిరి. అతివాదులు, జేకొబినులు, మ్యునిసిపలు
సభ్యులు ప్రజలలో నుద్రేకమును పుట్టించిరి. ఈవిచారణసం
ఘమువారు జాతీయసభలోనుండిన యతివాదుల నందఱను
ఖయిదుచేసి గిరాండిస్టుల నిరంకుశత్వమును స్థాపించెద రను
సపోహ ప్యారిసుప్రజలలో కలిగెను. మే 27 వ తేదిన ప్యారిసుపుర
పాలకసంఘమువారు హెబర్టుమొదలగువారిని విడుదలచేయ

వలయుననియు వెంటనే విచారణసంఘమును రద్దుపర్చవలసినదనియు జాతీయసభవారిని కోరిరి. వేలకువేలు ప్యారిసుప్రజలు జాతీయసభను చుట్టుకొనిరి. 'ఇటువంటి యల్లరులు చేసినయెడల ప్యారిసుపట్టణమును నాశనముచేసెద'మని జాతీయసభాధ్యక్షుడు చెప్పినదానిమీద ప్రజలయాగ్రహము మరింత హెచ్చెను. అల్లరికి మేరలేదు. కొంతమంది గిరాండిస్టులు సభను విడిచిపోయిరి. మిగిలిన జాతీయసభ్యులు ప్రజలకోరికలను మన్నించి హెబర్టు మొదలగువారిని విడిచిపుచ్చుటకును విచారణసంఘమును రద్దుపరచుటకును తీర్మానించిరి.

మరునాడు జాతీయసభకు గిరాండిస్టులందరును హాజరై క్రిందటిరోజున చేసిన తీర్మానమును రద్దుపఱచి తిరిగి విచారణసంఘమును నెలకొలిపిరి. జాతీయసభపై ప్రజలలో తిరుగుబాటు ప్రారంభమయ్యెను. జూన్ 2వ తేదీన యెనుబదివేల మంది ప్యారిసుప్రజలు జాతీయసభను ముట్టడించిరి. వెంటనే గిరాండిస్టుప్రముఖుల నందరను ఖైదుచేయవలసినదని కోరిరి. "ఇరువదినలుగురు దేశద్రోహులను మాకప్పగించవలె" నని ప్రజల నాయకుడగు హాన్రియట్టు కోరెను. ఆకల్లోలములో సగముమంది జాతీయసభ్యులు లేచిపోయిరి. అతివాదసభ్యు లీ కుట్రలో చేరియుండిరి. మిగిలిన గిరాండిస్టులు భయపడిరి. అతివాదసభ్యు లిచ్చిన జాబితాదాఖలా ఇరువదిమంది గిరాండిస్టులను ప్రజలు ఖైదుచేయుటకు హాజరుండిన జాతీయసభ్యు లనుజ్ఞ నిచ్చిరి. ఆ ఇరువదినలుగురును వారివారియిండ్లలో నుండగా ప్రజలు ఖైదుచేసిరి. ప్రజ లంతటితో తృప్తినొంది వెళ్ళిపోయిరి.

(3)

మారటుయొక్క హత్య.

గిరాండిస్టులలో కొందరు ఖయిదులో నుండిరి. కొందరు దేశమునువిడిచి పారిపోయిరి. పేవర్ మొదలగు కొందరు రాష్ట్రములకు బోయి జాతీయప్రభుత్వముపై తిరుగుబాటులు చేయించిరి. ఎత్త్రీరోను, కైనులోను స్థావరమేర్పఱచుకొనిరి. బ్రిటనీ వీరితో చేరెను. సైన్యములను పోగుచేసికొని ప్యారిసు మీఁద దండెత్తవలెనని యత్నించుచుండిరి. ఆవైపుననున్న యతివాదులను ఖయిదుచేసిరి. ఇచటనుండి యొక ధైర్యశాలి యగు యువతి, మిగుల సౌందర్యవతి, చార్లొటికార్డి యనునామె, జూన్ 2 వ తేదీన గిరాండిస్టులను వెళ్లగొట్టినవారిలో ముఖ్యుఁడగు మారటును చంపుటకు బయలుదేరెను. మారటు సుప్రసిద్ధవైద్యుఁడు. ఎం. డి. పరీక్షలో తేరినవాఁడు. అతివాదులలో నెల్ల పలుకుబడిగలవాఁడు. "ప్రజాస్నేహితు" డను పత్రికకు సంపాదకుఁడు. ప్యారిసుప్రజల కీయనయం దత్యంతగౌరవము గలదు. గొప్ప రక్తపాతములేనిది స్వతంత్రము స్థాపించబడ నేరదని ఈయన సిద్ధాంతము. మారటు జబ్బుగానుండుటవలన యావిరిస్నానముచేసి కూర్చుండి యుండఁగా గిరాండిస్టుల కుట్రలనుగూర్చిన కొంతసమాచారము తెలుపుటకు వచ్చితినని చార్లొటి కబురంపి లోనికి వచ్చుటకు అనుజ్ఞపొందినది. లోనికి వెళ్ళినది. కొంతసమాచారము మారటుకు చెప్పినది. ఆమె చెప్పుచున్నదాని నాయన జాగ్రత్తగా వ్రాసికొనుచుండెను. ఈసమయమున తాను తెచ్చియున్న కత్తితో ఆమె మారటును పొడిచిచంపెను. వెంటనే ఆమెను, పట్టుకొనిరి. న్యా

యాధిపతుల యెదుట విచారణకు బెట్టిరి. "నేను ప్రజాస్వామ్యమును కోరుచున్నదాననే. వేలకొలది ప్రజలను సంరక్షించుట కీదుర్మార్గుని చంపితిని. అమాయకులను కాపాడుట కీద్రోహిని నాశనము చేసితిని. నా దేశమునకు శాంతినిచ్చుట కీయడవి మృగమును వధించితిని," అని యామె మిగుల ధైర్యముతో చెప్పెను. ఆమెకు మరణదండన విధింపబడెను. మారటు చనిపోయినతరువాత ప్రజలకొరకు ప్రాణముల ర్పించిన వీరుడని ఆయనయందు ప్రజలగౌరవ మతిశయించెను.

ఇంతలో లైన్సు, మార్సెల్సు, బోర్డోపట్టణములును అరువది గ్రామములును తిరుగుబాటులో చేరెను. రాజరికపక్షవాదులుకూడ తిరుగుబాటులను పురిగొలిపిరి.

తిరుగుబాటులు.

సైన్యములు తయారయ్యెను. సార్డినియాప్రభువు వీరికి సహాయమును బంపెను. టూలాను, నైమ్సు, మాంటుబాన్ పట్టణములును వీరితో చేరెను. జూన్ ౬ వ తేదీన నలుబదివేలమంది తిరుగుబాటుదారులసైన్యములు లావెండీనుండి బయలుదేరి సామూరును పట్టుకొనెను. తరువాత నాన్టెస్సుమీద పడెను. బయట శత్రుమండలివారు పెరినీసువద్ద ఫ్రెంచిసైన్యముల నోడించి వాలన్సీను, కాండేలను స్వాధీనపర్చుకొనిరి. మైన్సుపట్టణము శత్రువులవశమయ్యెను. ప్యారిసులోను, రాష్ట్రములలోను కఱవుబాధ అధికమగుట చూచి, ఇంగ్లీషువారు ఫ్రాన్సుకు సముద్రముమీద నాహారసామగ్రులు రాకుండుటకై సముద్రరేవులను ముట్టడించిరి. ఎటు

చూచినను ఫ్రెంచిప్రజాప్రభుత్వము విపత్పరంపరలలో చిక్కి కొనియున్నది.

(4)

అతివాదులు జాతీయసభలో ముఖ్యులైరి. ఒకనూతన రాజ్యాంగవిధానమును తయారుచేసిరి. గొప్పకుటుంబములో పుట్టినను, సామాన్యకుటుంబములో పుట్టినను, ఆస్తియున్నను లేకున్నను, విద్య యున్నను లేకున్నను, దేశములోని ప్రతిమనుష్యుడును ప్రభుత్వములో సమానభాగస్వామియని వీరిసిద్ధాంతము. ఇదే రూసోపండితుని మతము. ఈసిద్ధాంతమును బట్టి యాస్తిగాని విద్యగాని యుండవలెనను నిర్బంధములేక యందరుపౌరులకును ఎన్నుకొనుహక్కు నిచ్చిరి. ప్రతిసంవత్సరము శాసనసభను ప్రజ లెన్నుకొనవలెను. ఎప్పటికప్పుడు శాసన సభ్యులు ప్రజాభిప్రాయము ననుసరించి నడుచుకొనుటకై ప్రతిసంవత్సర మెన్నికలు పెట్టిరి. ఎన్నుకొనువారు స్వయముగా శాసనసభ్యుల నెన్నుకొనెదరు. ఎన్నుకొనువారి (వోటర్ల) సంఘము లేర్పరుపబడెను. ఈసంఘములవారు సంవత్సరము లోపల ఇష్టమువచ్చినపుడెల్ల సమావేశమై శాసనసభలోని తమ ప్రతినిధులు నడుచుకొనవలసినపద్ధతులను తీర్మానించుచుందురు. వీరు తమప్రతినిధులను రాజీనామా నియ్యవలసినదని కోరినచో శాసనసభ్యులు రాజీనామా నియ్యవలెను. వోటర్లసంఘముల సలహాల ననుసరించి శాసనసభ్యులు సంపూర్ణముగా నడుచుకొనవలెను. ఇది 1793 సంవత్సరపు రాజ్యాంగవిధానము. నలుబదినాలుగు వేల మ్యునిసిపలుసంఘములప్రతినిధులు

1793 రాజ్యాంగ విధానము.

ప్యారిసులో సమావేశమై దీని నంగీకరించిరి. "నిరంకుశత్వమును నిర్మూలించెదము. లేనియెడల నశించెదము," అను ప్రమాణము నందరును గైకొనిరి.

జాతీయసభవారు దేశము కష్టస్థితియం దుండగనే దేశోపయోగకరమగు పెక్కుకార్యములను చేసిరి. విద్యను, వ్యవసాయమును అభివృద్ధిచేయుటకును, నీళ్ళు నిలిచెడి ప్రదేశములలోని నీళ్ళను తీయించి వ్యవసాయమునకు అర్హముగా చేయుటకును, ముసలివారికిని, తల్లిదండ్రులులేని పిల్లలకును సహాయము చేయుటకును తీర్మానించిరి. ఎక్కువ స్పష్టమగునట్టియు చిక్కులు లేనట్టియు సివిలుకోడ్డును, ధర్మస్మృతిని తయారుచేసిరి. నీగ్రోలను బానిసలుగ పట్టుకొనుటను మాపిచేసిరి. ఫ్రాన్సుదేశపు వలసరాజ్యములలోని నల్లజాతులవారికందరికును ఫ్రెంచివారితో సమానముగ పౌరసత్వపుహక్కుల నిచ్చిరి. నిర్బంధముగ ఉచిత ప్రాథమిక విద్యను నెలకొలిపిరి. మతవిద్యను పాఠశాలలలో గరపగూడదనిరి. ప్యారిసుపట్టణములో మూడువైద్యవిద్యాలయములను, నొక ప్రకృతిశాస్త్రపరిశోధనాలయమును, నొక సంగీతవిద్యాశాలను స్థాపించిరి.

దేశోపయుక్త కార్యములు.

జాతీయసభవారిచే మూడునెలల కొకమారు దేశసంరక్షకసంఘ మెన్నుకొనబడుచుండెను. ఈ దేశసంరక్షకసంఘమే యావత్తుప్రభుత్వముయొక్కయు కార్యనిర్వాహకవర్గ మయ్యెను. జాతీయసభయు దేశసంరక్షకసంఘమును అతివాదులకు

క్రొత్తపంచాంగము.

పూర్తిగా వశమయ్యెను. రాబిస్పియరు అతివాదులలో ముఖ్యుడు. మారా, సెంటు జస్టు లీయనకు శిష్యులు. కార్నటు యుద్ధమంత్రిగనుండెను. వీరికి ప్రజాసమూహములలోను, క్లబ్బులలోను పూర్తిగా పలుకుబడియుండెను. జాతీయప్రభుత్వమువారు క్రైస్తవపంచాంగమును తీసివేసి విప్లవపంచాంగము నేర్పరచిరి. ఫ్రెంచిజాతీయప్రభుత్వమునకును క్రైస్తవమతమునకు నెట్టి సంబంధము లేదని తీర్మానించిరి. మొదటిసంవత్సరము ఏసుక్రీస్తుప్రభువు పుట్టినదినమునుండి ప్రారంభించుటకు మాఱుగ, ఫ్రెంచిప్రజలు పూర్తిగ స్వతంత్రమును పొందిన ఫ్రెంచిప్రజాస్వామ్యమే (రిపబ్లికు) ఏర్పడినప్పటినుండియు ప్రారంభము కావలెనని శాసించిరి. అందువలన ఫ్రెంచి (రిపబ్లికు) ప్రజాస్వామ్యమేర్పడిన క్రీస్తుశకము 1792 వ సంవత్సరము సెప్టెంబరు 22 వ తేదీనుండియు ఫ్రెంచిశకము ప్రారంభము చేయబడినది. సంవత్సరము ముప్పదిదినములుగల పండ్రెండు నెలలుగా భాగించబడెను. నెలలకు జనేవరి మొదలగు క్రైస్తవనామములను తీసివేసి క్రొత్తనామముల నిచ్చిరి. మూఁడువందల అఱువదిరోజులకు పైగనున్న అయిదురోజులను జాతీయపండుగలుగ నేర్పరచబడెను. ఒకదినము ప్రతిభ (బుద్ధి సూక్ష్మత) యొక్క పండుగ. రెండవదినము కాయకష్టముయొక్క పండుగ. మూఁడవదినము సత్కర్మలయొక్క పండుగ. నాలుగవదినము ఫలముల ననుభవించుటనుగూర్చిన (సత్కర్మలుచేసిన మంచి ఫలముల ననుభవించుట) పండుగ. అయిదవదినము ఉత్కృష్టమైన భావముల పండుగ. ఈ అయిదుపండుగలును ఫ్రెంచి

జాతి సలుపవలసిన జాతీయపాటలుగలని శాసించబడెను. ప్రతి నెలకును మూడువారములుండును. వారమునకు పదిరోజులుండును. పదియవదినము విశ్రాంతిదినము. ఆదినమున కచ్చేరీలును దుకాణములును మూయబడును. వారములోని దినముల పేళ్లుకూడ మార్చబడెను.

శత్రుమండలిగా నేర్పడిన యూరపురాజులపైకి తగిన సైన్యములను బంపుటకు దేశసంరక్షకసంఘమువారు గట్టి ప్రయత్నములను చేసిరి. "ప్రతిపౌరుడును తా ననుభవించదలచిన స్వాతంత్ర్యము యొక్క ఋణము తీర్చుకొనవలసియున్నాడు. స్వాతంత్ర్యమును సంరక్షించుటకు దేశములోని వయస్సుయొక్క విచక్షతలేకుండ స్త్రీపురుషులందరును కృషిసలుపవలెను. యువకులు యుద్ధములో పోరాడుటకు బోవలెను. వివాహితులైన పురుషులు ఆయుధములు తయారుచేయుటలోను, ఫిరంగులను సామానులను ఒకచోటనుండి మరియొకచోటికి చేర్చుటలోను తోడ్పడవలెను. మరియు నాహారసామగ్రిని తయారుచేయవలెను. స్త్రీలు డేరాలను సైనికులవస్తువులను తయారుచేయవలెను. కొందరు స్త్రీలు గాయములు తగిలినవారికి చికిత్సలుచేయవలెను. పిల్లలుగూడ దూది మొదలయినవి తీయవలెను. వృద్ధులైనవారు బహిరంగస్థలములలోనికి తీసికొనిపోబడి రాజులయందు ద్వేషమును, ప్రజాస్వామ్యమునందాసక్తిని బోధించి పడుచువారిని సైనికులుగ చేయునట్లు పురికొల్పవలెను. ప్రతివారియొద్దనున్న ఆయుధములను

యుద్ధమునకై సంసిద్ధమగుట.

గుఱ్ఱములను బండ్లను జాతికి సమర్పింపవలెను. ఫ్రాంచిదేశ మంతయు నవసరములనుబట్టి యొక సైనికపరిదేశముగ భావింపవలెను," అని ప్రచురించిరి. ఫ్రాన్సుదేశములోని పదునెని మిది. ఇరువదియైదు సంవత్సరముల మధ్యవయస్సుగల యువకు లందరును మాతృదేశముయొక్క సంరక్షణకొఱకు చెప్పనలవి గాని యుత్సాహముతో సైన్యములలో చేరి యాయుధములను ధరించిరి. యుద్ధసామగ్రిని ఆహారసామగ్రిని వస్త్రములు మొదలగువానిని ఫ్రాంచిస్త్రీలు, పురుషులు తయారుచేసిరి. అతిశీఘ్రకాలములో పదునాల్గులక్షలమంది ఫ్రాంచిసైనికులు పదునాలుగు గొప్పసేనలుగ విభజింపబడి, దేశరక్షణదీక్షా పరులగు సేనానులక్రింద ఫ్రాన్సుయొక్క యన్ని వైపులసరిహద్దులకును బయలుదేరి వెళ్లిరి.

మొదటిసంపుటము సమాప్తము.

# వ్యవసాయశాస్త్రము

(రెండుభాగములు)

శాస్త్రీయపద్ధతులమీద తెలుగులో వ్రాయబడిన గ్రంథమిదియొక్కటియే. రెండుభాగములలో 5, 6 వందల రూపాయల విలువగల పుస్తకములలోని విషయములు సంగ్రహముగ, సులభశైలిని వ్రాయబడినవి. సుబోధకముగనుండుటకై యనేక పటములను చేర్చియున్నాము. వ్యవసాయాభివృద్ధికిని, దేశముయొక్క భాగ్యవంతమునకును పాటుపడువారు వీనినిగొని లాభము పొందుదురని నమ్ముచున్నాము.

గ్రంథకర్త వ్యవసాయవిద్యావిశారదులగు గోటేటి జోగిరాజు పంతులుగారు. మొదటిభాగము వెల రు. 1-4-0. రెండవభాగము వెల రు. 1-8-0

# రాయచూరు యుద్ధము

ఆంధ్రదేశచరిత్రాత్మకనవలలలో పిన్న మిన్నయని పేరుగాంచినది. ఇది [illegible]తవరపు వేంకటశాస్త్రిగారిచే రచియింపబడినది. వెల 1-4-0. రామయామాత్యుని కృత్యము లద్భుతములు; భయంకరములు. విజయసింహుని సాహససౌందర్యములు, ముక్తాంబబుద్ధికుశలత వర్ణనాతీతము. అనంగసేనస్థితి జాలికరము. మాలతీవాకచక్యము, తిమ్మరుసు రాజనీతియు అసమానము. కృష్ణరాయని రణకౌశలము ఆంధ్రుల గర్వితుల జేయును. రామరాజు, శంకరరెడ్డి మొదలగువారు మారురూపములను దాల్చి కార్యసాఫల్య మొనర్చుట విచిత్రము.

# రాణీసంయుక్త

ఇదియొక చరిత్రవిషయిక నవల. పృథ్వీరాజుయొక్కయు, సంయుక్తయొక్కయు, దేశాభిమానము, పరాక్రమము, ప్రేమయు రసవంతముగా వర్ణింపబడినవి. హిందూసామ్రాజ్యనాశనమునకు కారణములును, తురుష్కులీదేశము మొదట వచ్చినప్పటి దేశపరిస్థితియు, నిందు చక్కగా వివరింపబడినవి. ఇప్పటికి నాలుగు కూర్పులైనవి. పదివేల గ్రంథము లమ్ముడుబోయినవి. దీనినిజూచి నలుగురు గ్రంథకర్తలు నాలుగు నాటకములను వ్రాసిరనినదియే దీనియోగ్యతను జాటుచున్నది. శ్రీయుత వేలాల సుబ్బారావుగారిచే ప్రణీతము.

రు. వెల 0-12-0

# ఆంధ్రుల చరిత్రము

## 2 వ భాగము.

పౌరుషమునందును, పాండిత్యాతిశయమునందును, రాజ్యవిస్తారంబునందును పూర్వపు టాంధ్రులు హిందూదేశములోని యితర దేశములవారికి దీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగ సిద్ధాంతీకరించుచున్నది! ఇప్పటి యాంధ్రులవలెనే మన పూర్వపు టాంధ్రులుగూడ కూపమండూకములు అని యనుకొనెదరేని ఆంధ్రు లొకప్పుడు, మగధసామ్రాజ్యమును ఇంకొకప్పుడు మహారాష్ట్రమును, మఱియొకప్పుడు యవద్వీపమును, వేఱొకప్పుడు పాండ్యచోళదేశములను జయించి రని వీరు కలనైన నెఱుంగుదురా? ఎఱుగనియెడల ఈగ్రంథము జదువుడు. శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారిచే రచింపబడినది. రు. వెల 1-8-0

# రసాయన శాస్త్రము

శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మ బి. ఏ. గారిచే రచియింపబడినది.

మన పూర్వులు బంగారము చేయవలయునన్న కోరికచే ఈ శాస్త్రమును అభ్యసించిరి. ఇప్పుడు ఇంగ్లీషువారు ఈశాస్త్రమును అభ్యసించి కోట్లకొలది ధనము సంపాదించుచున్నారు. ఇట్టి ఘనమైనవిద్య మనవాంధ్రకు తెలియుటకై ఈగ్రంథము చక్కనివచనశైలిని వ్రాయబడినది జనులు లక్షాధికారులై దేశము ధనసంపన్నతతో తులతూగుటకు ఇట్టి పుస్తకములే యాధారములు. ఈ గ్రంథమునందు హిందూరసాయనశాస్త్రము (Hindu Chemistry) యొక్కచరిత్ర కూడ రసవంతముగ వ్రాయబడినది. రు. 1-4-0

# ఆంధ్ర ఆయుర్వేద ఫార్మసి (లిమిటెడ్)

185, మౌంటురోడ్డు, మదరాసు.

డాక్టరు ఆచంట లక్ష్మీపతి, బి.ఏ., ఎమ్. బి, సి. యమ్. గారిచే స్థాపింపబడినది.

వసూలైన మూలధనము రు. 1,30,054

**మాయొద్ద రహస్యమనునదిలేదు. గొప్ప ఉత్కృష్టమైన మందులు ఇచ్చుటనే దొరకును.**

సిద్ధమకరధ్వజము:— కామోద్దీపజనకము - శ్రేష్ఠమయిన రసాయనము. ధాతుపుష్టికరము. బుద్ధిని, ఆయుస్సును వృద్ధిపరచును. అతిమూత్రము, క్షయ, సుఖరోగములు వీని యందు మంచిగుణము లిచ్చును. 25 మాత్రలు రూ 5-0-0

చ్యవనప్రాశలేహ్యము:— శ్రేష్ఠమయిన రసాయనము. శ్వాసకోశవికారములను పోగొట్టును. కాసములకు మంచిఔషధము. శరీరపుష్టిని గలుగజేయును.

1 పౌను రూ 3-0-0. 4 ఔన్సులు రూ 1-0-0

కస్తూరిమాత్రలు:— బాలురకుగలుగు దగ్గు, జ్వరము, జలుబు, అజీర్ణము మొదలగు వికారములను పోగొట్టును. ఒకబుడ్డి రూ 1-0-0

తాళీసాదివటి:—దగ్గు, గొంతునొప్పి, అజీర్ణము, జ్వరములు, వాంతులు, అరోచకము మొదలగువానిని పోగొట్టును. 25 మాత్రలు రూ 0-8-0

రేచనవటి:—ఇది అజీర్ణము, కడుపుబ్బరము, వికారములు, అజీర్ణముచే గలుగు కడుపునొప్పి మొదలగువానియందు దుపయోగించిన బాగుగ విరేచనము అగునట్లు జేసి సుఖమును గలిగించును. 25 మాత్రలు రూ 0-8-0

శీతాంశురసము:—శీతజ్వరములను నశింపజేయును. పైపూత కుపయోగించిన తేలు మొదలగువాని విషవికారములను, గజచర్మము, కుష్ఠము మొదలగువానిని నశింపజేయును. 60 మాత్రలు రూ 0-10-0

ఆనందభైరవి:—అన్నిజ్వరములకు, అతిసారము, గ్రహణము, దగ్గు, శ్వాసలను పోగొట్టును.
50 మాత్రలు రూ 0-10-0

ముస్తకాదివటి:—రక్తవిరేచనములు, అరుచి, విషూచి (కలరా), దగ్గు మొదలగువానిని నశింపజేయును.
25 మాత్రలు రూ 0-8-0

చందనాదితైలము:-ఇది తలవెంట్రుకలను పెరుగునట్లుచేయును. సువాసన నిచ్చును. మనస్సునకు ఆహ్లాదమును గలుగజేయును. 2 ఔన్సులు రూ 1-0-0..1 పౌను రూ 7-0-0